# భారతి

మాసపత్రిక



సంపాదకుడు :

శివలెంక శంభుప్రసాద్



ఏప్రిల్ 1971



సంపుటము : 48 : సంచిక : 4 :

విడిపత్రిక వెల ఒక రూపాయి



ఇంగ్లీషు తేదీల ప్రకారం
11—4—71

తెలుగు తిథుల ప్రకారము చైత్ర శుద్ధ ద్వాదశి
7—4—71

శ్రీ దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారి 33—వ పుణ్యావర్ధంతి

శివములు తత్వముల్ పరవశించిన వేళ, అనర్ఘ ధర్మముల్
శివములు చేతలై పరిమళించిన వేళ, రసాత్త భావముల్
శివములు గీతికల్ మధుర శీధువు లందినవేళ తెల్గునన్
ప్రవరము శైవ తేజము శుభాకృతి వెల్గిన వెల్గు వెల్గులై.

# విషయానుక్రమణిక

## ఏప్రిల్ 1971

# గానశ్రీ

## శ్రీ త్రిపురాణ వేంకటకృష్ణారావు

అది యొక జీర్ణదేవ నిలయం బొకనాఁడు మహేంద్ర రాజ కో
విద యతి పూజితం బతిపవిత్ర చరిత్రము; నేఁడు తొంటి పెం
పొదిగెను; శిల్ప మాత్రమున నొప్పుచు నున్నది; తత్ప్రభావముల్
విదురు లెఱింగి వచ్చెదరు; విశ్వవిభున్ శివమూర్తిఁ గొల్వగన్॥

ఒక నాఁ డున్నత రాజవంశ్యులు కరం బొప్పారి రాసీమ; నొ
క్క కుమారీమణి, గాయనీ రమణి, యా గంగాధరున్ గొల్వఁ బా
యక సంధ్యాసమయంబులన్ నియతి నేకాంతంబునన్ వచ్చి, ర
మ్యకృతుల్ గానముసేసిపోవు శివపూజాధీనదీక్షామతిన్॥

మీటున కొక్కమె ట్టధిగమించి, స్వరంబు సుధాయమానమై
పాటిల, రాగ సంగతులు భావములం బ్రకటింపఁ, దాళముల్
పాటకుఁ బ్రాణ మీఁ, గళలు పల్లవి కింపిడ, నామె వీణియన్
మీటుచుఁ బాడుచుండు నెలమిన్ శివసన్నిధి భక్తిగీతికల్॥

అనపాయంబు, దయామయంబయిన యిం దంధస్థితిన్ మెల్గినన్
మనఁగా నౌ, శ్రవణేంద్రియంబునన భామాగాన పానంబుచే
నని పాముల్ నయనేంద్రియం బణఁచి తా మాలించు నెల్లప్పు డా
వనితాలోక శిఖామణీ లలిత దివ్యస్వాదు సంగీతముల్॥

గిరిజేశానుల తాండవ వ్యసన కింకిణ్యాది నాదంబు, ద
త్పరతన్ లోవినఁగల్గి యామెయు నటింపంగల్గు; నాడున్ శిఖుల్
పురులన్ విచ్చి, జెవుల్ చలింప శశముల్ ముద్దార నర్తించుఁ; ద
త్పరమోల్లాస విలాస లాస్యగతు లాపాదించు నానందముల్॥

ఎప్పటినుండియో యొక జటీంద్రుఁడు, నవ్యవయస్వి వచ్చి, యా
చప్పరమందు నిల్చివిను జవ్వని పాడుచు నుండువేళ, నా

యొప్పుల కుప్ప కొల్చి చనుచున్నెడఁ దానును నెందుబోవునో
యెప్పటి యట్లు తానుగనిపింపడు గన్పడుఁ బాడవచ్చినన్॥

గుడికిన్ రాఁ జెలి యోగి వచ్చినిలుచున్ గూర్చుండి పూజించుచున్
గడఁగన్ బాడఁ బడంతి, తెప్ప యిడ కాకర్ణించు నాపావనుం
డొడలెల్లన్ జెవులై యదేపనిగ; గానోర్మిప్రభావద్యుతుల్
పడయంగాఁ గను అప్పగించి దయగొల్పన్ నిల్చు దీనాకృతిన్॥

అతఁ డంధుండయి యుండు; దూ పరయఁ బుట్టంధుండుగా డేదియో
కతనన్ జూపటి కన్నులున్నయటులే కన్పించుఁ దద్గీతికా
మృతపానంబుననో! మహేశ్వరతపశ్శ్రీయోగసంపత్తినో!
యతఁ డీషద్దృశఁ గాంచెఁబోలుఁ గనుగో నధ్యాత్మ కాంక్షించుటన్

శతపత్రేక్షణ వచ్చిపాడు; నతఁడా స్వాదించు గానామృతం;
బతఁడంధుండని యెంచి యామె కనఁబోఁదాదిక్కె యట్లే ఛనున్,
మతి నే మెంచెనొ! నాఁ డతండు చెలికన్నన్ మున్నెయేతెంచి, యా
సుతయెచ్చో వసియించి కొల్చు నతఁడచ్చో నిల్చె ధ్యానస్థితిన్॥

ఎడ నేతెంచి, జటిన్ నిజస్థలమునం దీక్షించి కూర్చుండ కా
బిడయున్ మీటిన గీతి సుస్వర సుధా విస్తార సారస్యమై
యడరింపన్ హరనాథుఁ దత్కరుణచే నైయుండ నోపున్ జటిన్
దొడఁగెన్ బాడ వయస్వినీమణి సుసాధుస్వాదుసద్గానముల్॥

ఎదలం దిర్వుర కేమి యున్నదియొ! కానీ యిర్వు రొక్కే గతిన్
వదలం బోవరు దేవ సన్నిధిని; నా భవ్యాత్ముఁ డీక్షించె నా
సుదతిన్; నాఁడు తదంగనా మణియుఁ జూచున్ దన్మయత్వంబునం
దెదియున్ దోఁపక రాఁగ్రహింప నతఁడున్ దృష్టిస్థితిన్ గాంచుటన్॥

గిలిగింతల్ గలిగింపఁ దన్వి యొక భంగిన్ వీణ మ్రోయింపఁ; జె
క్కిలి గింతల్ గరఁగింపఁ జెల్వ యొక రక్తిన్ జొక్కి పాడంగ, నం
దలి తళ్కుం దెలిరాతి శిల్పములు కాంతం గాంచ గాఁ గల్గె తా
జిలుఁగున్ గంటనె; యోగి తన్మహిమ దృష్టింగాంచ లేకుండునే॥

## గా న శ్రీ

గానాకార తపంబు సాధన కృతిన్ గావించి రావించి, యీ
శాన శ్రీ కరుణా ప్రదీప్తి వ్రతమున్, సాధింపఁగాఁగల్గె; హృ
ద్ధ్యాన శ్రీఁ దదభీష్టముంగనియె నాతం డొందఁగా దృష్టి; త
న్మౌనశ్రీ ఫలియింపఁ గాంచె నతఁడా నారీ మనో రాజ్యమున్॥

కనులం గోరియె యిర్వు రందుఁ దపమున్ గావించి సాధింపఁగాఁ
గని; రామానిని మంత్ర ముగ్ధ మగు సద్గానామృతానందమే
కను విచ్చెన్; హరసేవ వారి హృదయాకాంక్షవ్ ప్రసాదించె; మో
హన రమ్యంబుగ నాడి, పాడు వవలా యాతండు గొల్వన్ భవున్॥

---



# ఋక్సంహితలోని మంత్రాలకు యాగపరంగా సాయణభాష్యం

డాక్టర్ విద్యాధరశాస్త్రి భిడే

వైదిక వాఙ్మయం ప్రపంచ వాఙ్మయానికే ప్రథమావిష్కారమని ప్రసిద్ధి. ఈ వాఙ్మయం పరంపరగా అనాది, అపౌరుషేయం అని, 'అస్య మహతో భూతస్య నిశ్వసిత మేతత్ యదృగ్వేదో యజుర్వేదః సామవేదో ధర్వాంగిరసః' (బృహదారణ్యకం 2—4—10) ఇత్యాది శ్రుతివాక్యాలు ప్రతిపాదిస్తున్నాయి. వేదాలు నాలుగు. వాటిలో ఋక్సంహిత ప్రాథమ్యానికి అర్హం. ఋషులు దర్శించిన మంత్రాల సంహితీకరణమో, సంకలనమో గ్రథనమో కాలాంతరంలో జరిగినా, మంత్రాలు ప్రాచీనతమము లనడంలో సంశయం లేశమయినా లేదు. వైదిక వాఙ్మయంలో నాలుగు వేదాలు ఆయా పేర్లతో ప్రసిద్ధి పొందినా, శాఖాభేద, స్వరభేద రచనా భేదాలతో గ్రంథాలు పెక్కువున్నట్లు పండితులు అనుమానిస్తున్నారు. ఋగ్యజుస్సాను రూపాలయిన మంత్రాలకు, బ్రాహ్మణాలకుకూడా, బ్రహ్మపరంపర, ఆదిత్య పరంపర అని రెండు పరంపరలు ఏర్పడ్డాయి. 'మంత్ర బ్రాహ్మణయో ర్వేద నామధేయం' (ఆపస్తంభశ్రౌత సూత్ర—2—4—31) అనే ఆపస్తంభ వాక్యం వల్ల వేదశబ్దంతో బోధ్యమాన మయ్యే వాఙ్మయానికే ఈ రెండు పరంపరలూను. ఆదిత్య పరంపరలో వున్న వేదాలను యాజ్ఞవల్క్యుడు సంహితారూపంగా సంకలనం చేశాడు. ఇదే యజుర్వేదానికి కృష్ణయజుర్వేదమని, శుక్లయజుర్వేదమని రెండు భేదాల ఐతిహ్యంగా ప్రచారితమయింది. యాజ్ఞవల్క్య మహర్షి తపమాచరించి ఆదిత్యునినుంచి ఈ వేదజ్ఞానాన్ని సుష్ఠుగా సంపాదించాడు. 'ఆదిత్యా నీమాని శుక్లాని యజూంషి వాజసనేయేన యాజ్ఞవల్క్యే నాఖ్యాయంతే' (బృహదారణ్యక—5—6—1)అని శతపథ బ్రాహ్మణం అంతిమభాగమయిన బృహదారణ్యకోపనిషత్తు చెబుతున్నది.

'ఏవం స్తుతః స భగవాన్
వాజిరూపధరో హరిః,
యజూం ష్యయాతయామాని
మునయే దాత్ ప్రసాదతః'

అని విష్ణుపురాణం (3—5) చెబుతున్నది. యాజ్ఞవల్క్యుడు యజ్ఞసంవిధాన పర్యాలోచనతో శ్రౌత కర్మానుపూర్వితో వైదిక వాఙ్మయాన్ని పునః రచించాడు. అందువలన భగవాన్ యాజ్ఞవల్క్యుడు యజ్ఞార్థం రచించిన వేదాలు ఆదిత్యపరంపరను అనుసరించినట్టివి. భగవత్పూజ్యపాదులైన శంకరాచార్యులు బృహదారణ్యకోపనిషద్భాష్యంలో 'హే సామశ్రవ సామ విధిం హి శృణో త్యతోర్థా చ్చతుర్వేదో యాజ్ఞవల్క్యః' (3—1—2) అని యాజ్ఞవల్క్యునికి చతుర్వేదజ్ఞత్వం ప్రతిపాదించారు. అందువల్ల ఋగ్వేదమనే పేరుతో ప్రసిద్ధమయిన హౌత్రార్థవేదం యాజ్ఞవల్క్య ప్రణీతమయిన దొకటని, ఋక్సంహితపేరున ఉన్న మూలగ్రంథం మరొకటని కొందరు విద్వాంసులు అంటున్నారు. దేవతాస్తుతిపరాలు, యజ్ఞకర్మనిరపేక్షాలు అయిన మంత్రాల సంగ్రహణం ఋక్సంహితలో ఉన్నది. ఆ ఋక్సంహితే యిప్పుడు దాశతయీ— ఋగ్వేదాది నామధేయాలతో పరిగ్రహించబడుతున్నది. బ్రాహ్మణ గ్రంథ పర్యాలోకనతో

హౌత్రార్థమయిన ఋగ్వేదానికి భిన్నస్వరూపకల్పనం కూడా శక్యం. హౌత్రార్థమయిన ఋగ్వేదానికి ఋక్సంహితకు వెలిగా స్వతంత్రంగా అస్తిత్వాన్ని సాయణాచార్యులు పరికల్పించారు. ఆయన ఋగ్భాష్యాదిలో

"ఆధ్వర్యవస్య యజ్ఞేషు
ప్రాధాన్యాద్ వ్యాకృతం పురా,
యజుర్వేదోథ హౌత్రార్థ
మృగ్వేదో వ్యాకరిష్యతే"

అని అన్నారు. వేద శబ్దంతో అభిధీయమానమయ్యే ఋగ్వేదం వేరు, సంహితా శబ్దంతో రూఢమయిన ఋక్సంహిత వేరు అని కొందరి అభిప్రాయం. అది అలా వుండనీ.

ఈ విషయం ఇంతవరకే విమర్శించి, వేద శబ్దానికి యజ్ఞ కర్మలతో ఎలాటి సంబంధం అనే విషయం కొంచెం చెబుతాను:— "వేదాహి యజ్ఞార్థమభి ప్రవృత్తాః" అనే వేదాంగ జ్యోతిష వచనానుసారం సాయణాచార్యులు వేద శబ్దానికి అక్కడక్కడ లక్షణం నిర్దేశించారు— "ఇష్టప్రాప్త్యనిష్టపరిహారయో రలౌకిక ముపాయం యో గ్రంథో వేదయతి స వేదః" అని. యజ్ఞ ప్రకరణాన్ని చక్కగా పరిశీలించిన మీదటనే వేద భాష్యకారులు వైదిక వాఙ్మయ వివేచనం చేశారనడం సుస్పష్టం. యజ్ఞ కర్మ ప్రాధాన్యంవల్ల మొదట యజుర్వేద భాష్యానికి ఉపక్రమించామని, అనంతరం ఐతరేయ భాష్యం, ఋక్సంహితాభాష్యం విరచించామని సాయణాచార్యులే ఋగ్భాష్య భూమికలో తెలిపారు— "యజుర్వేదే నిష్పన్నం యజ్ఞ శరీర ముపజీవ్య తదపేక్షితౌ స్తోత్ర శస్త్ర రూపావయవౌ ఇతరేణ వేదద్వయేన పూర్యేతే ఇత్యుపజీవ్యస్య యజుర్వేదస్య ప్రథమతో వ్యాఖ్యానం యుక్తమ్." అని. అలాగే, "మంత్ర బ్రాహ్మణాత్మకే వేదే బ్రాహ్మణస్య మంత్ర వ్యాఖ్యాన స్వోపయోగిత్వా దాదౌ బ్రాహ్మణ మారణ్యకాండ సహితం వ్యాఖ్యాతం. అథ తత్ర తత్ర బ్రాహ్మణోదాహరణేన మంత్రాత్మక స్సంహితా గ్రంథో వ్యాఖ్యాతవ్యః" అని అన్నారు. శ్రౌత కర్మల అనుపూర్విని వాటి సమ్యక్ప్రయోగ జ్ఞానాన్ని నిర్ధారించుకొన్న మీదటనే భాష్యకారులు మంత్రగత శబ్దాల వివేచనను, అర్థ జ్ఞానాన్ని ప్రతిపాదించారు. యజుర్వేదంలోను, తైత్తిరీయ బ్రాహ్మణంలోను, ఋగ్వేదంలోను సమానమయిన మంత్రాలు చాలా కనిపిస్తాయి. తైత్తిరీయ సంహితలోని మంత్రాలు ఋగ్వేదం నుంచి గ్రహించబడినవని ఆధునిక విద్వాంసుల అభిప్రాయం. అయినప్పటికి సాయణాచార్యులు తైత్తిరీయ సంహితకు, ఐతరేయ బ్రాహ్మణానికి భాష్యం రచించిన తర్వాతనే ఋగ్భాష్యం రచించాడనడం నిశ్చప్రచం, సమానమయిన మంత్రాలు వున్నప్పటికీ, భాష్యకారులు ఎందుకు అర్థ భిన్నత్వం ఆశ్రయించారు? భాష్యకారుల రచనా చాతురి ఎలాటిది? — అనే విషయాలను చర్చిద్దాం. ఋక్సంహితాంతర్గతాలై అగ్నిష్టోమంలో వినియోగించబడిన మంత్రాలకు భాష్యకారులు చేసిన అర్థ వివరణను పర్యాలోచించి కొన్ని ఉదాహరణలు ఇస్తాను: అందువల్ల మొదట తైత్తిరీయ సంహితా భాష్యం నిర్దేశించి, తర్వాత ఋక్సంహితా భాష్యం పేర్కొంటాను:

(1) విష్ణోర్ను కం వీర్యాణి ప్రవోచం
యః పార్థివాని విమమే రజాగ్ంసి
యో అస్కభాయ దుత్తరగ్ం సధస్థం
విచక్రమాణః త్రేధో రుగాయః॥

(తైత్తిరీ 1-2-13; ఋగ్ 1-154-1)

తైత్తిరీయ సంహితలో ఈ మంత్రం హవిర్ధానస్థమయిన మేథీనిహననంలో వినియోగించబడింది. దీనికి కర్మానువాదకత్వం బ్రాహ్మణంలో విధించబడలేదు; భాష్యకారులుకూడ చెప్పలేదు. భాష్యకారులు కేవలం శబ్దార్థమే చెప్పారు. 'నుక మిత్యవ్యయం కర్మవాచకం. విష్ణోర్వీర్యాణి కర్మాణి ప్రవోచం ప్రబ్రవీమి. కాని కర్మాణి. యో విష్ణుః పార్థివాని రజాంసి పరమాణూన్ విమమే నిర్మితవాన్ పరిగణితవాంశ్చ. పునరపి యో విష్ణుః ఉత్తర ముపరివర్తి సధస్థం దేవానాం సహవాసస్థానం,

ద్యులోక మస్కభాత్, యథా అధో న పతతి తథా స్తంభిత వాన్. పునరపి యు స్త్రేధా విచక్రమాణః త్రిషు లోకేషు పదత్రయం నిదధే. ఉరుభి ర్మహాత్మభి ర్గీయతే.' అని. (నుకమనేది అవ్యయం, కర్మవాచకం. విష్ణువు కర్మలను చెబుతాను. ఆ కర్మలు ఏవి. ఏ విష్ణువయితే పార్థివాలయిన పరమాణువులను నిర్మించాడో, పరిగణించాడో. పైనవున్న దేవలోకం కిందపడిపోకుండా స్తంభింపజేశాడో, నిలబెట్టాడో. మరల మూడు లోకాలలోను పదత్రయం పెట్టాడో. మహాత్ములచే ప్రశంసింపబడినాడో. అట్టివిష్ణువుకర్మలు.)

ఋక్సంహితలో వైష్ణవసూక్తంలో పఠించిన ఈ మంత్రానికి భాష్యకారులు ఆశ్వలాయనోక్తరీతిలో వినియోగం చూపి వ్యాఖ్యానం చేశారు. అక్కడి భాష్యంలోని విభిన్నత్వం మాత్రమే ఇక్కడ ఉదాహరిస్తున్నాను. 'విష్ణో ర్వ్యాపనశీలస్య, నుకమ్ అతి శీఘ్రం. అత్ర యద్యపి ను కమ్ ఇతి పదద్వయం తథాపి యాస్కేన 'నవోత్తరాణి పదాని' ఇత్యుక్తత్వాత్, శాఖాంతరే ఏకత్వేన పాఠాచ్చ ను ఇత్యేకస్మిన్నేవార్థే నుకమ్ ఇతి పదద్వయమ్. పార్థివాని రజాంసి పృథివీ సంబంధీని రంజనాత్మకాని క్షిత్యాదిలోకత్రయాభిమానిని అగ్నివాయ్వాదిత్య రూపాణి రజాంసి. అత్ర త్రయోలోకా అపి పృథివీశబ్దవాచ్యాః. యద్వా పార్థివాని పృథివీ సంబంధీని రజాంసి పృథివ్యా అధస్తన సప్త లోకాన్ విమమే వివిధం నిర్మితవాన్. అథవా పార్థివాని పృథివీ నిమిత్తకాని రజాంసి లోకాన్ విమమే. భూరాదిలోక త్రయ మిత్యర్థః. భూమ్యా ముపార్జిత కర్మభోగార్థత్వాత్ ఇతర లోకానాం తత్కారణత్వమ్' అని.

(విష్ణోః వ్యాపనశీలునియొక్క, నుకమ్ అతి శీఘ్రం. ఇక్కడ ను కమ్ అనేవి రెండు పదాలయినప్పటికీ, యాస్కుడు నవోత్తరాణిపదాని అని చెప్పడం వల్ల, శాఖాంతరంలో ఏకపదంగా పఠించడంవల్ల నుకంఅనే రెండు పదాలకు ను అనే అర్థం. పార్థివాని రజాంసి అంటే, పృథివీ సంబంధమయినవి, రంజనాత్మకాలయిన క్షిత్యాది లోకత్రయాభిమాని అగ్ని వాయు ఆదిత్యాలనే రజస్సులు. ఇక్కడ మూడు లోకాలూ పృథివీశబ్దవాచ్యాలు. లేక పృథివికింది సప్త లోకాలను నిర్మించాడు. భూరాది లోకత్రయ మని అర్థం. భూమిలో ఆర్జించిన కర్మభోగార్థత్వంవల్ల ఇతర లోకాలకు భూమి కారణత్వం.)

ఇక్కడ 'పార్థివాని రజాంసి' అనే పదద్వయ భాష్యం అవధరించాలి.

(2) య మగ్నే పృత్సు మర్త్య మావో
(మర్త్య మవా) వాజేషు యం జునాః,
స యంతా శాశ్వతీ రిషః.
(తై. సం. 1—3—13; ఋగ్ 1—27—7.)

'యదగ్నిష్టోమో జుహోతి' (తై. సం. 6—4—3.) అనే విధి ననుసరించి ఈ మంత్రం అగ్నిష్టోమంలో ప్రాతస్సవనంలో క్రతుకరణహోమంలో వినియోగించబడుతున్నది. యజ్ఞప్రక్రియను అభిలక్షించి ఈ మంత్రం తైత్తిరీయ సంహితాభాష్యంలో ఇలా వ్యాఖ్యానించబడింది:—'హే అగ్నే యం మర్త్యం పృత్సు సంగ్రామేషు ఆవో రక్షసి. కించ వాజేష్వన్న నిమిత్తం యం మర్త్యం జునా గచ్ఛసి హవింషి గ్రహీతుం యస్య సకాశం గచ్ఛసీత్యర్థః. స మర్త్యస్త్వదనుగ్రహేణ శాశ్వతీ రిషో నిత్యాన్యన్నాని ధనరూపాణి యంతా నియంస్యతి ప్రాప్స్యతీత్యర్థః.'

(అగ్నీ, నీవు ఏ మనుష్యులను యుద్ధాలలో రక్షిస్తున్నావో యజ్ఞాలలో హవిస్సు గ్రహించడానికి ఏ మానవులవద్దకు వెళ్ళుతున్నావో, ఆ మర్త్యులకు ధనరూపమయిన నిత్యాన్నాలు పొందింపజేస్తున్నావు.)

ఋక్సంహితా భాష్యంలో ఈ మంత్రానికి కేవలం శబ్దార్థం చూపబడింది:— "హే అగ్నే పృత్సు సంగ్రామేషు యం మర్త్యం యజమానం అవాః అవసి రక్షసి. యం పురుషం వాజేషు సంగ్రామేషు జునాః ప్రేరయసి, సనరో యజమానః శాశ్వతీరిషః నిత్యాన్యన్నాని యంతా నియంతుం సమర్థో భవతి. అవాః ఆవః. అకారాకారయో ర్విపర్యయః. యద్వా లేటి అడాగమః."

**వాజ** శబ్దం అన్వర్థంలో ప్రసిద్ధమయినా, సంగ్రామమనే అర్థం ఆ శబ్దానికి ఋగ్భాష్యంలో ఎందుకు చెప్పారు? అంతేకాక తైత్తిరీయ సంహిత లోని "ఆవః" అనే పాఠమే సాధువని ఋగ్వేద భాష్యంలో భాష్యకారుల అభిప్రాయ మయినట్టు స్పష్టమవుతున్నది.

(3) ఉరుగ్ం హి రాజా వరుణ శ్చకార
సూర్యాయ పంథా మన్వేతవా ఉ
అపదే పాదా ప్రతిధాతవే
అకరుతా పవక్తా హృదయా విధశ్చిత్.
(తై. సం. 1—4—45; ఋక్ 1—24-8)

అగ్నిష్టోమ ప్రకరణంలో అవభృథ విధిలో ఈ మంత్రం వినియోగం. ఈ మంత్రానికి బ్రాహ్మణంలో కర్మవిధానం కనిపించకపోయినా, అర్థవాదవాక్యంవల్ల కర్మవిధానం కల్పించవచ్చు. ఏతద్విషయకమయిన బ్రాహ్మణవాక్యం ఉదాహరించి భాష్యకారులు విధి రూపమయిన అర్థం చూపారు : 'మంత్రోక్తో మార్గ విస్తరః పాదప్రతిష్ఠార్థ ఇత్యాహ. 'ఉరుగ్ంహి రాజా వరుణ శ్చకార ఇత్యాహ ప్రతిష్ఠిత్యై' (తై. సం. 6—6—9) ఇతి.' ప్రయోగవిధిని పరికించి భాష్య కారులు శబ్దార్థం చెబుతున్నారు తైత్తిరీయభాష్యంలో ఇలా అని: 'ఉశబ్దో అవధారణే. వరుణఏవ రాజా సూర్యాయ సూర్యస్యాన్వేతవై అనుక్రమేణ గంతు అపదే నిరాలంబే అంతరిక్ష ఉరుం పంథాం విస్తీర్ణం మార్గం యస్మా చ్చకార తస్మా దస్మాకమపి పాదా ప్రతి ధాతవే పాదం ప్రక్షేప్తుం మార్గ మకః కరోతు. ఉతా పిచ. యఃశత్రు రపవక్తా నిందకో య శ్చ హృదయా విధః హృదయోపలక్షితం శరీరం తాడయతి. చిచ్ఛబ్దః సముచ్చయే. సోపి ప్రతిబంధ మకృత్వా మార్గం కరోత్విత్యర్థః.' (ఉశబ్దం అవధారణార్థకం. ఏ వరుణు డనే రాజు సూర్యుడు అనుక్రమంగా వెళ్లడానికి నిరా లంబమయిన అంతరిక్షంలో వెడల్పాటి దారులు తీర్చాడో, అందువల్ల మా పాదాలు మోపడానికి కూడా దారులు తీర్చనీ. అంతేకాక, నిందకుడు, హృద యోపలక్షితమయిన శరీరాన్ని కొట్టేవాడు అయిన శత్రువు కూడా ప్రతిబంధాలు తొలగించి, వాటిని చేయక దారిచేయనీ.)

ఋక్సంహితా భాష్యంలో ప్రయోగానుకూల్యం తోనే వ్యాఖ్యానం చేయాలనే నియమం ఒప్పుకోనందు వల్ల, శబ్దార్థ వివేచన సమయంలో ఉత్తరాయణ దక్షిణాయన మార్గాలు, ఉదయాస్తమయాలు నిర్దే శించబడ్డాయి. ఒక్కొకచోట 'యద్వా', 'అథవా', ఇత్యాది శబ్దాలతో శబ్దార్థాన్ని భాష్యకారులు అన్యథాగాను చేశారు. ఈ మంత్ర వ్యాఖ్యానం ఋక్సంహితాభాష్యంలో ఇలా వుంది: 'వరుణః రాజా సూర్యాయ సూర్యస్య పంథాం మార్గం ఉరుం విస్తీర్ణం చకార. హి శబ్దః ప్రసిద్ధౌ. ఉత్తరాయణ దక్షిణాయన మార్గస్య విస్తారః ప్రసిద్ధః. కిమర్థ మేవంకృతవా నితి త దుచ్యతే. అన్వేతవా ఉ అను క్రమేణ ఉదయాస్తమయౌ గంతు మేవ. తథా. అపదే పాదరహితే అంతరిక్షే పాదా ప్రతిధాతవే పాదౌ ప్రక్షేప్తుం అకః మార్గం కృతవాన్. పూర్వత్ర రథస్య మార్గః అత్ర పాదయోరితి విశేషః. యద్వా అపదే యూపే బద్ధేన మయా గంతు మశక్యే భూప్రదేశే పాదౌ ప్రక్షేప్తుం ఉపాయం బంధవిమో చన రూపం కరో త్విత్యర్థః. ఉత అపిచ హృదయా విధశ్చిత్ అస్మదీయవేధకస్య శత్రో రపి అపవక్తా అప వాదితా నిరాకర్తా భవతు.'

(వరుణుడనేరాజు సూర్యుని మార్గం విస్తీర్ణం చేశాడు. ఎందుకిలా చేశాడంటే, అనుక్రమంగా ఉద యాస్తమయాలలో వెళ్లడానికి. పాదరహితమయిన అంతరిక్షంలో అడుగులు పెట్టడానికని మార్గం చేశాడు. పూర్వం రథానికి మార్గం ఇక్కడ పాదాలకు అని విశేషం. లేక అపదే అంటే యూపానికి కట్టు బడిన నేను పోవడానికి వీలుకాని ప్రదేశంలో అడుగులు పెట్టడానికి బంధ. మోచన రూపమయిన ఉపాయం చేయనీ. అంతేకాక హృదయ వేధకుడయిన శత్రువును నిరాకరించేవాడూ అగుగాక!)

(4) ఇమాం ధియగ్ం శిక్షమాణస్య దేవ
క్రతుం దక్షం వరుణ సంశిశాధి,

యయా తి విశ్వా దురితా తరేమ
సుతర్మాణ మధి నావం రుహేమ.

(తై. సం. 1-2-2; ఐత. బ్రాహ్మ 1-13, ఋగ్. 8—42—3.)

ఈ మంత్రం తైత్తిరీయ సంహితలో దీక్షా ప్రకరణంలో పఠితం. 'కృష్ణాజినేన దీక్షయతి' (తై. సం. 6—1—3) అనే విధిని అనుసరించి, శ్రౌతసూత్రోక్తరీతితో ఈ మంత్రానికి వినియోగం చూపారు భాష్యకార సాయణాచార్యులు. 'కృష్ణాజినం వై సుతర్మా నౌః' అని ఐతరేయ బ్రాహ్మణం (1—13) పర్యాలోచనతో ఈ మంత్రాన్ని తైత్తిరీయ సంహితా భాష్యంలో ఇలా వ్యాఖ్యానించారు:— 'హే వరుణ దేవేమా మగ్నిష్టోమ విషయాం ధియ ముపాదదానస్య యజమానస్య సంబంధినం దక్షం సమృద్ధ మగ్నిష్టోమం క్రతుం సంశిశాధి సమ్యగుప దిశ్య నయ. వయమపి పారం గంతుం సర్వాణి విఘ్న రూపదురితాని యయా నావా త్వరితం తరేమ తాం సుఖేన తరణే సమర్థా మిమాం కృష్ణాజిన రూపాం నావ మధిరుహేమ.'

(ఓ వరుణుడా, అగ్నిష్టోమ విషయక బుద్ధిగల ఈ యజమానునికి తత్సంబంధి, సమృద్ధము అయిన అగ్నిష్టోమక్రతువును బాగా ఉపదేశించి పూర్తిచేయి. మేము సకల విఘ్నరూపాలయిన దురితాలను సులభంగా తరించగల ఈ కృష్ణాజిన రూపమయిన నావను అధిరోహిస్తాము.)

ఐతరేయబ్రాహ్మణంలో ఈ మంత్రం సోమ క్రయ ప్రకరణంలో వినియోగించబడింది. ఈ మంత్ర విధానాన్ని కూడా బ్రాహ్మణమే చేసి, మంత్రార్థం ప్రకటించింది —'ఇమాం ధియం శిక్షమాణస్య దేవేతి వారుణ్యా పరిదధాతి. క్రతుం దక్షం వరుణ సంశిశాధీతి. వీర్యం ప్రజ్ఞానం వరుణ సంశిశాధీతి. యజ్ఞో వై సుతర్మా నౌః. కృష్ణాజినం వై సుతర్మా నౌః. వాగ్వై సుతర్మా నౌః. వాచ మేవ త దారుహ్య తయా స్వర్గం లోక మభిసంతరతి.' (ఐత.బ్రా.1—13.). తైత్తిరీయ భాష్యంకన్నా బ్రాహ్మణ భాష్యం శ్రుతి వచనాన్ని అనుసరిస్తున్నది. ఐతరేయ బ్రాహ్మణంలో సాయణభాష్యం ఇలా వుంది:—'హే వరుణ దేవేమాం ధియం యజ్ఞానుష్ఠాన విషయాం బుద్ధిం శిక్షమాణస్యాభ్యస్యతో యజమానస్య క్రతుం యజ్ఞ విషయం వీర్యం దక్షం కౌశలం యజ్ఞవిషయ ప్రజ్ఞానం సంశిశాధి సమ్యగుపదిశ. యయా వాగ్రూపయా నావా విశ్వాదురితా సర్వాణి పాపా న్యతితరేమ. తాదృశీం సుతర్మాణం సుష్ఠు తరణహేతుం వాగ్రూపాం నావ మధిరుహేమా ధిక్యేనారోహణం కుర్మః.'

తైత్తిరీయ భాష్యం తర్వాత ఈ భాష్యం రచితమయిందని స్పష్టం. 'యత్ర యజ్ఞస్య వా కృష్ణాజినస్య వా ప్రస్తావః తత్ర తత్పరత్వేన సుతర్మ శబ్దో వ్యాఖ్యేయః. ఇహతు మంత్రరూపా వాగ్వివక్షితా' అని సాయణాచార్యులన్నారు. (ఎక్కడ యజ్ఞంకాని కృష్ణాజినంకాని ప్రస్తావించబడిందో అక్కడ దాని పరంగానే సుతర్మా శబ్దం వ్యాఖ్యానించాలి. ఇక్కడ మంత్ర రూపమయిన వాక్కు ఉద్దేశించబడింది.)

ఋక్సంహితా భాష్యంలో ఈ మంత్రం శబ్దశః వ్యాఖ్యానించబడింది. అక్కడ యాగపరమయిన భాష్యం కనిపించదు. ఋగ్భాష్యం ఇలా వుంది:— 'హే దేవ ద్యోతమాన వరుణ ఇమాం ధియం ఇదం కర్మ శిక్షమాణస్య అనుతిష్ఠతో మమ క్రతుం ప్రజ్ఞానం దక్షం బలం సంశిశాధి తీక్ష్ణీకురు. యయా నావా యజ్ఞరూపయా విశ్వా సర్వాణి దురితా దురితాని అతితరేమ తాం సుతర్మాణం సుష్ఠు తారయిత్రీం యజ్ఞరూపాం నావం అధిరుహేమ వయ మారుహేమ. దుఃఖసాగరతరణే హేతుత్వాద్ యజ్ఞో నౌ రిత్యత్ర వ్యపదిశ్యతే'

(ఓ ప్రకాశిస్తున్న వరుణుడా, ఈ కర్మను అనుష్ఠించే నా ప్రజ్ఞానాన్ని బలాన్ని తీక్ష్ణం చేయి. ఏ యజ్ఞ రూపమయిన నావతో సకల దురితాలు తరించగలమో అలాటి బాగా తరింపజేసే యజ్ఞ రూపమయిన నావను మేము అధిరోహిస్తాము. దుఃఖ సాగరతరణహేతువు కావడంవల్ల యజ్ఞ మిక్కడ నావగా వ్యపదేశించబడుతున్నది.)

(5) భద్రా దక్షిశేయః ప్రేహి
బృహస్పతిః పుర ఏతా తే అస్తు
అథే మవస్య వర ఆ పృథివ్యా
ఆరే శత్రూన్ కృణుహి సర్వవీరః.
(తై. సం. 1—2—3; ఐత. బ్రా 1—13)

తైత్తిరీయంలో ఈ మంత్రం దీక్షాప్రకరణంలో పఠితం. దీనికి బ్రాహ్మణంలో ఎలా వినియోగమన్నదానికి వ్యాఖ్యానం లేదు. భాష్యకారులే 'భద్రాదభి ఇత్యాది మంత్రార్థః స్పష్ట ఇత్యభిప్రేత్య బ్రాహ్మణే నాత్ర వ్యాఖ్యానం ఉపేక్షితమ్' అని ముందుకు పోయారు. (ఈ మంత్రార్థం స్పష్టమనే అభిప్రాయంతో బ్రాహ్మణంలో దీనికి వ్యాఖ్యానం ఉపేక్షించబడింది.)దీనికి తైత్తిరీయ సంహితాభాష్యంలోవ్యాఖ్యానం ఇలా వుంది:-'హే రథ భద్రా ప్రశస్తా దస్మాన్నిత్యాగ్నిహోత్ర స్థానా దతిప్రశస్తం సౌమికం దేవయజన మభి ప్రయాహి. బృహస్పతి స్తవ పురతో గంతా భవతు. అథ ప్రయాణా దూర్ధ్వం పృథివ్యాః సంబంధిన్యా సమంతా ద్వరే శ్రేష్ఠే స్థాన ఈ మిమాం గతిం అవస్య సమాపయ. హే రథాభిమాని న్నాదిత్య, శత్రూన్ రాక్షసాదీన్ ఆరే దేవయజనా ద్దూరే కురు.'

(ఓ రథమా, ప్రశస్తమయిన మా నిత్యాగ్నిహోత్ర స్థానంనుంచి అతి ప్రశస్తమయిన సౌమికదేవయజనం గురించి బయలువెడలు. బృహస్పతి నీకు ముందు వెళ్లేవాడు అగుగాక! ప్రయాణానంతరం పృథివీ సంబంధి అయిన శ్రేష్ఠమయిన స్థానంలో ఈ గతిని ముగించు. ఓ రథాభిమాని అయిన ఆదిత్యుడా, రాక్షసులు మొదలయిన శత్రువులను దేవయజనానికి దూరంగా వుంచు.)

సూత్రకారులు కూడా దీక్షితుడయిన యజమానుని ప్రాగ్వంశ ప్రవేశనంలో ఈ మంత్రం వినియోగించారు.

ఈ మంత్రమే ఐతరేయబ్రాహ్మణంలో సోమక్రయ ప్రకరణంలో పఠించబడింది. విలుచుకొనబడిన సోమాన్ని నాటుతున్నప్పుడు దాని స్తుత్యర్థం ఈ మంత్రాలను హోత పఠిస్తాడు. వాటిలో 'భద్రాదభి' అనేది ప్రథమ మంత్రం. ఈ ప్రకరణంలో ఐతరేయ బ్రాహ్మణం సంపూర్ణ మంత్రపాఠాన్ని నిర్దేశించి, మంత్రగత శబ్దాలకు అర్థం ప్రకటిస్తున్నది:— 'అయం వావ లోకో భద్రః. తస్మా దసావేవ లోకః శ్రేయాన్. బ్రహ్మవై బృహస్పతిః. దేవయజనం వై వరం పృథివ్యై. ద్విషంత మేవా స్మై తత్పాప్మానం భ్రాతృవ్య మప బాధతే'(ఐత 1—13.)బ్రాహ్మణాలలో వినియోగం ఆలోచించే ఈ మంత్రానికి వ్యాఖ్య చేశారు సాయణాచార్యులు ఇలా: 'హే సోమ భద్రా న్మంగళాద్ భూలోకరూపాత్తస్మాత్ క్రయదేశాత్ శ్రేయః శ్రేష్ఠం స్వర్గలోక స్థానీయుం ప్రాచీనవంశదేశ మభిలక్ష్య ప్రేహి ప్రకర్షేణ గచ్ఛ. తథా గచ్ఛతస్తే బృహస్పతిః పుర ఏతా పురతో గంతా అస్తు. అథ గమనా దూర్ధ్వం పృథివ్యా స్సంబంధ్యా సమంతా ద్వరే శ్రేష్ఠే దేవయజన ఈ మవస్యేదం తవా వస్థానయోగ్యం స్థానం నిశ్చిను. సర్వేభ్యో వీరశ్శూర స్త్వం శత్రూన్ పాపరూపాన్ యజ్ఞవిద్వేషిణ ఆరే కృణుహి దూరే కురు. నిరాకుర్విత్యర్థః.' అని.

(ఓ సోమమా, మంగళకరమయిన భూలోకరూపమయిన క్రయప్రాంతంనుంచి స్వర్గలోక స్థానీయమయిన ప్రాచీనవంశదేశంగూర్చి వెళ్లు. అలా వెళ్తున్న నీకు బృహస్పతి ముందు వెళ్లేవాడు అవుగాక! అలా వెళ్లినతర్వాత శ్రేష్ఠమయిన దేవయజనంలో నీకు అవస్థానయోగ్యమయిన స్థానం నిర్ణయించుకో. నీవు అందరికన్నా శూరుడివి. యజ్ఞవిద్వేషులయిన పాపరూప శత్రువులను దూరంగా వుంచు.)

ఈ మంత్రం ఋక్సంహితలో ఉపదేశింపబడలేదు. ఒక మంత్రమే భిన్నప్రకరణంలో వినియుక్తమయితే, దానిని వ్యాఖ్యానించేటప్పుడు, భాష్యకారుల అభిప్రాయమేమిటి, ఎలాటిది అని చూపడానికే ఈ మంత్రభాష్యం చూపించాను.

ఋక్సంహితలోవున్న మంత్రాలు కొన్ని తైత్తిరీయ సంహితలోను, ఐతరేయబ్రాహ్మణంలోను కనిపిస్తున్నాయి. తైత్తిరీయసంహితా, ఏతరేయ బ్రాహ్మ

ణముగా ప్రయోగానుపూర్వితో మంత్రాలను పఠిస్తాయి. కనుక ప్రయోగానుకూలంగానే అర్థం గ్రహించాలని ఆయాచోట్ల ఆ మంత్రాలకు యాగపరంగానే వ్యాఖ్య చేశారు భాష్యకారులు. ఒకానొక చోట అర్థవైపరీత్యమూ చేశారు. నేనిచ్చిన నాల్గవ ఉదాహరణలో దక్ష క్రతు శబ్దాల భాష్యం పరిశీలించండి. ఒకొకచోట మంత్రాల వినియోగం బ్రాహ్మణంతో చూపారు; మంత్ర శబ్దాల స్పష్టీకరణం కొన్ని బ్రాహ్మణ గ్రంథాలలో లభిస్తుంది; అలాటి స్థలాలలో మంత్రాల భాష్యం యాగపరమే. వినియోజకమయిన బ్రాహ్మణం లేనప్పుడు కూడా పరంపర ననుసరించీ, ప్రకరణం ప్రకారమూ, భాష్యకారులు యాగపరంగానే వ్యాఖ్య చేశారు. అయితే, ఋగ్భాష్యంలో ఇలాటి మంత్రాల భాష్య రచనలో ప్రయోగానుసారమే వ్యాఖ్య చేయాలనే నియమం స్వీకరించనందున భాష్యకారులు స్వాతంత్ర్యంతో శబ్దార్థానుకూలమయిన వ్యాఖ్య చేశారు. అందువల్లనే ఋగ్భాష్యంలో సాయణాచార్యుల విదగ్ధమయిన శైలి కానవస్తున్నది. శబ్దాలు తీసుకొని అర్థం పరిశీలించారు. కొన్నిచోట్ల, యద్వా, అథవా మొదలయిన శబ్దాలతో మంత్రగత శబ్దాలకు వివిధార్థాలు ప్రతిపాదించబడ్డాయి. 'బ్రాహ్మణోదాహరణేన సంహితా గ్రంథో వ్యాఖ్యాతః' (బ్రాహ్మణోదాహరణతో సంహితా గ్రంథం వ్యాఖ్యానించాము) అని చెప్పినా, బ్రాహ్మణ విధానం లభించనిచోట మంత్రాలకు స్వతంత్రంగా వ్యాఖ్య చేశారు. వినియోగ విషయంలో ఒకానొకచోట భాష్యకారులు 'వినియోగో లైంగికః' అని అన్నారు.

ఇలా శాఖాంతరంలో పఠించిన ఋక్సంహితా మంత్రాలకు భాష్యవైచిత్ర్యం ఎలా కనిపిస్తున్నదో, దానినే ఇక్కడ నిరూపించాను. శాఖాంతర గతాలయిన కేవల ఋక్సంహితా పఠిత మంత్రాల వివేచనలో భాష్యకారుల రచనా చాతుర్యం ఎలాటిది అనడం సకలభాష్యగ్రంథాల అధ్యయనంతోనే నిర్ధరించవలసి వుంది.

(1971 మార్చి 27, 28 తేదీలలో మద్రాసులో జరిగిన శ్రీ కుప్పుస్వామిశాస్త్రి పరిశోధనసంస్థ రజతోత్సవంలో వైదిక సదస్సులో సంస్కృతభాషలో చదివిన వ్యాసం అనువాదం.)

---



పల్నాటి వీర కథాచక్రము :

# 'అలరాచ మల్లుగారి గురజాల రాయబారము'

## డా. తంగిరాల వెంకటసుబ్బారావు

తెలుగు వీరగాథా కవిత్వమున పల్నాటి వీర కథల దొక ప్రత్యేక స్థానము. చారిత్రక ప్రాచీనతయంటే కాక, కవిత్వ పటుత్వమునందును, ఇతర వీరగాథా లక్షణములందును ఇవి ప్రథమస్థానము నాక్రమించు చున్నవి. ఇది తెలుగులో నేర్పడిన సిసలైన 'వీరగాథా వృత్తము' లేక 'వీరకథా చక్రము' (Ballad—Cycle) ప్రాచీన తాళపత్ర గ్రంథములలో దీనికి 'పలనాటి వీరభాగవతము' అను పేరు కానవచ్చు చున్నది. 'పల్నాటి వీరచరిత్ర' అను పేరు ఆధునిక విమర్శకులు పెట్టినట్టిది. జానపదులు ఈ గాథా చక్రమును 'చెన్నుడు కథ' అందురు.

పల్నాటి వీరకథా చక్రము కల్పితమును కట్టు కథయును గాక, చారిత్రక సత్యమగుట మఱియొక విశేషము. ఈ అంతర్యుద్ధము క్రీ. శ. 1181—82 సంవత్సరములో జరిగెనని విమర్శకులు నిర్ణ యించిరి. తెలుగున లభ్యమగుచున్న వీరగాథలలో నిది ప్రాచీనతమమైనది. ఇంతకన్న ప్రాచీనతరములైన వీరగాథలు ఇతర భారత సాహిత్యములందును కానరావు అసలు పండ్రెండవ శతాబ్దముకంటె ప్రాచీనమైన వీరగాథలు ప్రపంచ సాహిత్యములం దెచ్చటను లేవని పాశ్చాత్య విమర్శకులు నిర్ణయించినారు. వీనినిబట్టి మన పల్నాటి వీరగాథల ప్రాశస్త్యము మఱింత ప్రస్ఫుటమగుచున్నది.

ఇట్టి పల్నాటి వీరగాథా వృత్తములో ఒక్క 'బాలచంద్రుని కథ' మాత్రమే పండితలోకమునకు పరిచితమైనది. దీనిని మొట్టమొదట ప్రకటించిన



'అలరాజు ఒఱగుటాయి' (చెర్లగుడిపాడు)

వారు కీ. శే. అక్కిరాజు ఉమాకాంతంగారు. ఇది శ్రీనాథ విరచితము. ఆచార్య పింగళి లక్ష్మీకాంతం గారు పరిష్కరించిన 'పల్నాటి వీరచరిత్ర' (విశాలాంధ్ర ప్రచురణము, 1961) లో పదునొకండు వీరగాథ లున్నవి. కాని, నా పరిశోధనమువలన ఈ వీరగాథా వృత్తమున సుమారు ఇరువదియైదు వీరగాథ లున్నవని తెలుచున్నది. వీనిలో పెక్కు కథలు తాళపత్ర గ్రంథములందు చివికిపోవుచు, గాథాకారుల జిహ్వా గ్రములందు కొన ఊపిరితో మూలుగుచున్నవి.

శ్రీనాథుడు, మల్లయ్య, కొండయ్య అను కవులు రచించిన వీరగాథలు కొన్ని నేడు లభించు చున్నవి. ఈ కవులలో నొక్కొక్కరు ప్రత్యేకముగా ఈ గాథాచక్ర మంతటిని వ్రాసియుందురు. కాని యిట్లు ప్రత్యేకముగా నొకే కవి విరచితముగానున్న సంపూర్ణగాథా చక్రమేదియు నేడు లభించుటలేదు.

కొన్ని వీరగాథ లొక కవిని, మఱికొన్ని వీరగాథ లొక కవివి లభించుచున్నవి.

క్రీ. శ. 1862 ప్రాంతమున పల్నాడులో నున్న ముదిగొండ వీరభద్రకవియను నతడు పల్నాటి వీరగాథల నన్నింటిని అనుసరించుచు 'వీరభాగవతము' అను పద్యకావ్యమును రచించెను. పల్నాటి వీరకథా చక్రముయొక్క సంపూర్ణేతివృత్తమును తెలిసికొను టకు ఈ పద్యకావ్యము మిక్కిలిగ తోడ్పడుచున్నది.

మద్రాసు ప్రభుత్వ ప్రాచ్యలిఖిత పుస్తకభాండా గారమునను, కాకినాడ ఆంధ్రసాహిత్య పరిషద్గ్రంథా లయమునను, గుంటూరు ఒంగోలు నెల్లూరు మండ లములలోనున్న వీరవిద్యావంతు లనబడెడి గాథాకారుల **(minstrels)** కడను పల్నాటి వీరగాథలకు సంబం ధించిన తాళపత్రప్రతులు, వ్రాతప్రతులు పెక్కు గలవు. గుంటూరు నెల్లూరు మండలములలో పర్య టింపగా నాకు ఇరువది వీరగాథలున్న మూడు తాళ పత్ర గ్రంథములు లభించినవి. వీనిలో పెక్కుగాథలు సాహిత్యలోకమునకు ఏమాత్రమును పరిచయములేని వినూత్న వీరగాథలు. ఇట్టివానిలో 'అలరాచమల్లుగారి గురజాల రాయబారము'అను వీరగాథనుగూర్చి వివ రింతును—

ఈ వీరగాథను 'గురిజాల రాయబారము' అనియు, 'అలరాజు రాయబారము'అనియు బిలుతురు. ఇందు 'అలరాజు రాయబారము'అను పేరును శిష్టులు కల్పించినట్లున్నది. జానపదు లీ కథను 'అలరాచ మల్లుగారి గురజాల రాయబారము' అనియే పిలుచు చున్నారు. హస్తప్రతకొఱకు 'గురిజాల రాయబారము' అనుటయును గలదు. 'అలరాజు రాయబారము'అను పేరుమాత్రము జానపదులలోలేదు. మదరాసు ప్రభుత్వ ప్రాచ్యలిఖితపుస్తక భాండాగారమున 'రాచమల్లు రాయ బారము' అను పేరుతో నాలుగు ప్రతులున్నవి. (చూ. డి. నెం. 1113, 1122, 1131, 1150.)

పల్నాటి వీరకథాచక్రమున వచ్చు వీరు లందఱి లోను అలరాజు మిక్కిలి గొప్పవాడు. ఈ గాథలలో వచ్చు నే వీరుడైనను ఇతనికి తక్కువవాడే! పెద్దన్న, బ్రహ్మన్న మున్నగు మహావీరులు సైతము ఇతని తరువాత చెప్పదగినవారే! కాని తెలుగు విమర్శక లోకము ఈతని గొప్పదనమునుగాని, ఈతనికి జరిగిన అన్యాయమునుగాని గుర్తించినట్లులేదు. అంధు లీతనిని నాగమ్మ విషప్రయోగమున మరణించిన అర్భకునిగా జమకట్టిరి. బ్రహ్మనాయునికి లేని ప్రాముఖ్యము నంటగట్టిరి. అతనిని, నాగమ్మ పంపిన విషాన్నమును జీర్ణించుకొనిన అవతారమూర్తిగా చిత్రించిరి. అలరాజునకు వీరగాథలలోనేకాక, కీర్తిప్రతిష్ఠల యందును అన్యాయము జరిగినది. ఈతనికి కావలసిన కీర్తియంతయు బాలచంద్రునకు దక్కినది. ఈతని దుర్మరణమునకు నాగమ్మకంటె బ్రహ్మనాయుడే ముఖ్యకారకుడు.

అలరాజు కల్యాణము నేలిన వీరసోముని పౌత్రుడు. (ఈ వీరసోముడు కాలచుర్య బిజ్జలుని పుత్రుడని చారిత్రకులు భావించుచున్నారు. వీరగాథలలో నితడు చోళరాజని యున్నది.) కొమ్మరాజు— చల్లమా దేవుల ఏకైక పుత్రుడు. (కొమ్మరాజునకు 'వంకి దేవరాజు' అనియు నామాంతరము). ఇతడు నలగాముని ఏకైక పుత్రికయగు రత్నాల పేరమ్మను వివాహ మాడెను. అలరాజు మేనత్తయగు సిరాదేవి పెదమలి దేవుని భార్య. ఇట్లు, అటు నలగామునకును, ఇటు మలిదేవునకును ఆప్తబంధువు అలరాజు. మైలమ దేవికి అరణముగావచ్చిన పల్నాటికి నలగాముడు రాజ య్యెను. పుత్రులులేని యీ నలగాముని రాజ్యమునకు రత్నాల పేరమ్మ భర్తయగు అలరాజే వారసుడు. ఈ చిక్కును గుర్తించియే కాబోలు, నరసింగరాజునకు పట్టము గట్టనెంచిన నాగమ్మ యీతనిపై విష ప్రయోగము చేసినది.

అలరాజు మహాశూరుడు. నూర్గురు రాజులను జయించి, 'రాచమల్లు' అను బిరుదమును వహించెను. ఈతని ఖడ్గము పేరు 'సూర్య భేతాళము'. ఇతని యశ్వము పేరు 'సవరాల జిమ్మడు.' దీనికి 'సవరాల గోడిగ' అనియు, 'శివక అశ్వము' అనియు మఱి రెండు నామాంతరములు గలవు. (శూరుని శూరత్వ

మున సగభాగమాత్రడు ధరించు నాయుధము పైనను ఎక్కిడి అశ్వముపైనను ఆధారపడియుండును). ఈ గుర్రము కాలికి అలరాజుచే జయింపబడిన మూర్గురు రాజుల బొమ్మలుగల పెండెరముండును! ఈతడే కనుక నాగమ్మ విషప్రయోగమునకు గురికాకున్నచో పల్నాటి యుద్ధమన్ని దినములు జరగెడిదికాదు. ఒకటి రెండు దినములలో నలగాముని వీరులందరిని తుడిచిపెట్టగల సమర్థుడు అలరాజు! ఈ విషయము నితడు నల గాముని నిండుపేరోలగమున నెలుగెత్తి చాటినాడు.

'దళములు గలవని దర్పమాడితివి
ఏడువేల్ గుఱ్ఱము లేకమైనపుడె
బొదరాజొక్కడు పట్టి సాధించు;
మున్నూరు శూలాలు ముద్ర గజములకు
ముగ్గురు సుంకర్లు ముద మొప్ప సాటి;
ఇరువది నాల్గువేలెనగు బంటులకు
ఏడ్గురు గోసంగు లెలమితో సాటి;
అధిక బిరుదులకెల్ల అలరాజు చాలు
అరులకు నంకుశ మ్మల్లు మల్లన్న!'

అలరాజు నలగామున కల్లుడును, రాచమల్లు బిరు దాంకితుడును అగుటచే నితనిని 'అల్లు మల్లన్న' అని ముద్దుగా పిలిచెడివారని తెలియుచున్నది.

అలరాచమల్లు మహావీరుడనుటకు మరియొక తార్కాణమున్నది. అతడు తన యొరనుండి సూర్య భేతాళమును బయటకు తీసినచో, దానిని ప్రయో గింపకుండ వ్యర్థముగా మరల లోపల పెట్టడు. ఇది శూరకులమున గానవచ్చు గొప్ప నియమము. (నేటి ప్రపంచమున వీరజాతులుగా ప్రసిద్ధికెక్కిన శిక్కుల లోను, ఘూర్కాలలోను ఇట్టి నియమము కలదని విందుము.) అలరాజు పెద్దన్న నెదిరించి, కంభంపాటి మిట్టలపై పోరునప్పుడు, బ్రహ్మనాయుడు వచ్చి, వారి యుద్ధము నాపి, 'అల్లుడా! కత్తిని ఒరవెయ్యి!' అని అలరాజును కోరగా, అలరాజు తన ఖడ్గమున కాహారములేనిదే ఉపసంహరింపజాలనని తెల్పెను. అప్పుడు బ్రహ్మనాయుడు అలరాజు సూర్యభేతాళమునకు 'ఏడు దున్నపోతులు, ఏడు బర్రెగొర్లు, ఏడు గాకొక్క ణిజలు' ఆహుతిగా బెట్టెనని నాకు లభించిన 'గురి జాల రాయబారము' అను వ్రాతప్రతిలో నున్నది.

ఇట్లే, అలరాజు, నలగాముని కొలువుకూట మునకు రాయబారమునకు బోయినప్పుడు, నాగమ్మ మాటలకు కోపించి కత్తి దూసినాడు. నాగమ్మ భయపడి నలగాముని చాటునకు తప్పుకొన్నది. నల గామాదు లతనిని శాంతపఱచిరి. అలరాజు అంతటితో తన కత్తిని దించలేదు. దాని కాహారము పెట్టికాని ఉపసంహరింపడు కదా! రౌద్రమూర్తియై యెదురుగా జూచినాడు. సభాభవనమున నుక్కు స్తంభమున్నది:

'సూర్యభేతాళమను సురియ ఝుళిపించి
మొగసాల ముందర ముదముతోనున్న
ఉక్కు కంబము నరికె నుగ్రకోపమున.'

అలరాజు, నాగమ్మ విషప్రయోగముచే చని పోవుచు, తన బిరుదులన్నియు బాలచంద్రుని కిచ్చెను. ఈ సూర్యభేతాళ ఖడ్గము కూడ బాలచంద్రు నకు దక్కినది. ఈ మహాఖడ్గముతో యుద్ధము చేయుటవలన బాలచంద్రుని శౌర్యము ద్విగుణీకృత మైనదని నా నమ్మకము.

నాగమ్మ విషప్రయోగముచే దుర్మరణము నొందుచున్న భర్తనుజూచి, శోకతప్తురాలైన పేరా దేవి (రత్నాల పేరమ్మ) ఆతని బలశౌర్యముల నిట్లు ప్రశంసించును :

'అలరాజ ! సకలవిద్యాప్రసంగముల
తులతూగ నీ సాటిదొరలెందు లేరు,
విలసిల్లు నా తెరవేట కయ్యమున
ఇలలోన డెబ్బదియేడండలముల
మనుజనాథుల నిముసమాత్రాన చంపి
ఘనశౌర్యసంపదగంటివి, వదిగాక
తక్కక నీవు హోదాటి కయ్యమున
ఒక్కడె గెలిచిన యురుబలాఢ్యుడవు.
తగిన కులమునపుట్టి తగని యీ చావు
మీకెట్లు సిద్ధించె మేదినిమీద
అట్టి సాహసమెందు అణగెనోరాజ !
ఎట్టి యౌదార్యంబు లింకెనోరాజ !'

ఇంతటి మహావీరుడగు అలరాచమల్లు, పల్నాటి రాజ్యమునకు వారసుడనియు, యుద్ధము వచ్చినచో తమ్మునందఱను తుడిచిపెట్టు ననియు భయపడి, నలగాముని తరువాత నరసింగరాజును సింహాసన మెక్కింపదలంచిన నాగమ్మ యితనిని మాయోపాయ ముచే చంపినది. దీనినిబట్టి అలరాజు మరణమునకు నాగమ్మయే కారణమని అందఱును తలంచుట సంభ వించినది. ఇది కేవలము భ్రమయనియు, అలరాజు

మరణమునకు నాగమ్మ యెంతకారణమో, బ్రహ్మ నాయడును అంతే కారణమనియు నిరూపించెడి వీర గాథ యొకటి నాకు పల్నాటిలో లభించినది. నెల్లూరు మండలమునగూడ నిట్టి కథయున్న తాళపత్రప్రతి లభ్యమైనది. ఈ కథలను పరిశీలించినచో, అలరాజు మరణమునకు బ్రహ్మనయే ముఖ్యకారకుడనియు, నాగమ్మ నిమిత్తమాత్రురాలనియు స్పష్టమగును.

'అలరాచమల్లుగారి గురజాల రాయబారము' అను నీ కథ రెండు రాత్రులకథ. అలరాజు— పెద్దన్నల యుద్ధ మొకరాత్రి. రాయబారము—మరణము రెండవ రాత్రి. వీనిని 'పూర్వభాగము — ఉత్తర భాగము' అనియు బిలువవచ్చును. ముద్రితమైన విశాలాంధ్ర ప్రచురణాలయము వారి ప్రతిలోగాని, అముద్రితములుగానున్న మదరాసు ప్రభుత్వ ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగార ప్రతులలోగాని యీ రెండు భాగములునుగల రాయబారము కథలు లేవు. వీనిలో నుత్తర భాగము మాత్రమే యున్నది. కావున నివి యసమగ్రములనుట నిస్సంశయము. నాకు లభించిన కథలు సమగ్రములైనవి.

అవి, మలిదేవుడు మాచెర్లను బాలించుచున్న రోజులు. మహర్నవమి పండుగ వచ్చినది. అలరాజు గుఱ్ఱమును మేపు 'గంగాధరుడు'ను, పెద్దన్న బాదరాజు గుఱ్ఱము ('కారు బొల్లడు')ను మేపు 'దాదివారి మల్లు'ను కలహించిరి. దాదివారిమల్లు, అలరాజు గుఱ్ఱమును కొట్టినాడు. ఆ గుఱ్ఱము మేతమాని చిక్కిపోయినది. అలరాజు అశ్వశాలకు వచ్చి, గుఱ్ఱమేల చిక్కిపోయినదని గంగాధరుని ప్రశ్నింపగా, వాడు జరగిన విషయమంతయును జెప్పెను. ఆనాటి కలహమున దాదివారిమల్లు; అలరాజు గుఱ్ఱముకన్న పెద్దన్న గుఱ్ఱము గొప్పదనియు, అలరాజుకన్న పెద్దన్న గొప్పవాడనియు, నందుచే తాను పెద్దన్న గుఱ్ఱమును తోలుకొని వచ్చునప్పుడు ప్రక్కకు తొలగి దారినీయవలెననియు బల్కెనట. అలరాజు ప్రశ్నకు సమాధానముగా గంగాధరుడీ విషయమును దెల్పెను. పెద్దన్న గర్వముతో నున్నాడనియు, నందుచే నాతని గుఱ్ఱమును మేపువాడును గర్వించియున్నాడనియు అలరాజు భావించి, పెద్దన్నకంటె తానే అన్నివిధముల నున్నతుడనని నిరూపింప దలంచెను. పెద్దన్న బొమ్మనుచేసి తన అశ్వపాదమునకు గట్టెను. అది చూచి పెద్దన్న ఆగ్రహించెను. ఇరువురును తమతమ బలాబలములను తేల్చుకొనుటకై కంభంపాడు మిట్టల పైకి పోయి, హోరాహోరిగ పోరాడసాగిరి. బ్రహ్మనాయడది తెలిసికొని; పరుగు పరుగున పోయి, వారిని విడదీసెను. బ్రహ్మనాయుడు సహితము పెద్దన గుఱ్ఱము ('కారుబొల్లడు') నాపగలిగినాడు కాని, రాచమల్లు గుఱ్ఱము ('సవరాల జిమ్మడు') నాపలేక పోయినాడు. పెద్దనకంటెను తనకంటెను గూడ అలరాచమల్లు బలశాలియని బ్రహ్మన గుర్తించినాడు. అతనివలన నెప్పటికైనను తనకు ముప్పు రాగలదని గ్రహించినాడు. 'అరెరె! ఇది పెరుము మించిన పల్లు! ఇతను నన్ను కాచేవాడుకాదు. 'ఏవొక్కనేర్పుననైన నేను ఈ పంటిని వూడపీకించవలెను'అని బ్రహ్మన నిశ్చయించినాడు. అందుచేతనే భట్లు బ్రాహ్మణులు పోదగిన రాయబారమునకు క్షత్రియుడగు అలరాజును పంపవలెనని తలచినాడు. అట్లు చేసినచో నతడు నాగమ్మచేతిలో హతుడగునని బ్రహ్మనకు తెలియును. భట్టును బ్రాహ్మణుడునుఅగు రాయబారియైనచో నెవరును జంపబూనరు. అలరాజు క్షత్రియుడగుటచేతనే నాగమ్మ పాపభీతిలేకుండ చంపివేసినది.

అలరాజును రాయబారిగా పంపుటకు తండ్రి 'కొమ్మరాజు' ఎట్టకేలకు అంగీకరించినను, తల్లి 'చల్లమాదేవి' మిక్కిలి భయపడి తిరస్కరించినది. బ్రహ్మన అమె నోదార్చి, తన మెడలోనున్న తులసి వనమాలను అలరాజు మెడలోవేసి, తన పుత్రుడు బాలచంద్రుని కొమ్మరాజునకు ఇల్లడమిచ్చి, అలరాజునకు కన్నమనీని సాయమిచ్చి, నమ్మించి యొప్పించెను. అలరాజు రాయబారమునకు పోవునప్పుడు బ్రహ్మన కాపట్యముతో దీవించినాడు. 'పోవోయి అల్లుడా!' అనినాడేకాని, 'పోయిరమ్ము' అని యనలేదు. బ్రహ్మనాయడు వాక్కు కలవాడు. అతడు పొమ్మన్నవారికి పోకడే కలుగును. రమ్మన్నవారికి రాకడే కలుగును. అలరాజు మెడలో తులసివనమాల యున్నంతవఱకును అతనికి మరణములేదు. అతడు మరణింపక తిరిగి వచ్చినచో తన ప్రాచిక పాఱదు. అందుచే బ్రహ్మన బాలచంద్రుని పిలిచి, మార్గమధ్యమున ఏమిషతో నైనను ఆ వనమాలను గ్రహించి తెమ్మనెను. బాలచంద్రుడు తన 'వేడుక పొటేలు'నెక్కి అలరాజు వెను

వెంటబోయి, అతనితో 'గండ్రయేఱు'ను గుఱ్ఱములు దూకించు పందెముచఱచి, అలరాజునుండి వనమాలను గ్రహించి, అతడు వెనుదిరిగి రాకుండ ఆనలువెట్టి, తండ్రికి ఆ వనమాల నిచ్చెను!

అలరాజు త్రిపురవరము, మటుకుల, మఱ్ఱివేముల, కంబాలకనుమ, చంద్రవంక, కంభముపాడు, గోలేరు, రెంటాల మున్నగు గ్రామములు గడచి, తెల్లవారుసరికి గురజాల చేరుకొనెను. గురజాల పరిసరములకు రాగానే, తన రాకను సూచించుటకై భేరి మ్రోయించి, తన సూర్యభేతాళమును ఝళిపించెను. అలరాజు భేరివిని గురజాల కోటలోని వారి గుండెలదిరెను. అతడు ఝళిపించిన సూర్యభేతాళకాంతులు స్వాతి మెఱువులవలె మెఱసెను. నాయకురాలు గడగడ వణకెను. అలరాజు నలగాముని కొలువు కూటములోనికి వచ్చి సంధివాక్యములు పలికెను. మాచెర్ల రాజ్యమును మరల మలిదేవుల కిచ్చుటకు నలగాము డంగీకరింపలేదు. అతడు కొంత మెత్తపడినను నాగమ్మ అడ్డుతగిలెను. అలరాజు ఉగ్రకోపముతో నాగమ్మను నఱుకబోయెను. ఆమె నలగాముని వెనుకకు తప్పుకొనగా, అలరాజు తానెత్తిన ఖడ్గమును దింపక మొగసాల ముందఱనున్న ఉక్కుకంబమును సఱకివైచెను. కారెంపూడిని రణరంగముగా బేర్కొని అలరాజు సభనుండి నిష్క్రమించెను.

కన్నమనీడు వలదని చెప్పుచున్నను, అలరాజు తన భార్యయగు రత్నాల పేరమ్మను చూడవలెనను తలంపులో ఆ రోజు గురజాలలోనే గుడారము లెత్తించెను. నాగమ్మ అలరాజును జంపుటకై విషాన్నమును బంపును. అలరాజు దానిని గుర్తించి పాఱవైచెను. మఱునాడు అలరాజు తిరుగు ప్రయాణమయ్యెను. నాయకురాలు, పూవులయందు విషము నుంచి 'తంబళ్ల'కిచ్చి, (తంబళ్ళు—శివాలయముల లోని పూజారులు), మార్గమధ్యమున అలరాజు కిండని చెప్పిపంపెను. అలరాజు 'చెర్లగుడిపాడు' గ్రామము కథకు వచ్చుసరికి తంబళ్లువచ్చి, అతనికి పూలను బహూకరించిరి. ఆ పూల నాఘ్రాణించి అలరాజు స్పృహతప్పి పడిపోవుచు, భార్యను తోడి తెమ్మని కన్నమదాసును గురజాలకు పంపెను. కన్నమనీడు గురజాలకు పరుగు పరుగునపోయి; రత్నాల పేరమ్మకు ఈ దుర్వార్త నెఱింగించి, ఆమెను తోడి తెచ్చెను. రత్నాల పేరమ్మ తండ్రిని శపించి, భర్త కడకు వచ్చి మిక్కిలి దుఃఖించెను. ప్రాణావశిష్టుడైన అలరాజు ఆమెను ఓదార్చి, తన బిరుదులన్నియును బాలచంద్రున కిమ్మని కన్నమదాసుతో చెప్పి గన్నుమూసెను. రత్నాల పేరమ్మ క్రుంగిపోయెను. భర్తశవమును పల్లకియందు జేర్చుకొని, మిరియాల, కంబాలకనుమ, మఱ్ఱివేముల, మటుకుల మీదుగా ఆ రాత్రియంతయును ప్రయాణముచేసి, వీరమేడపి చేరుకొనెను. జంగములను పూజించి, మేడపిలో రాచరావులకడ పతి శరీరముతో సహగమనము చేసెను.

అలరాజు—పెద్దన్నలు యుద్ధము చేసినట్లును, బ్రహ్మన్న కుటిలబుద్ధితో అలరాజును చంపింపవలెననెడి నిశ్చయముతో రాయబారమునకు పంపినట్లును గల యీ కథ పింగళివారు పరిష్కరించిన విశాలాంధ్ర ప్రతిలోకాని, మదరాసు ప్రభుత్వ ప్రాచ్యలిఖితపుస్తక భాండాగార ప్రతులలోగాని లేదని తెలిసికొంటిమి. కాని ముదిగొండ వీరభద్రకవి రచించిన 'వీరభాగవతము'అను పద్యకావ్యమునమాత్రము ఈ విషయము స్పష్టముగా చిత్రింపబడినది:—

మండాదినుండి బ్రహ్మనాయుడు వీరులతో గలసి శ్రీశైలమునకువచ్చి, మల్లికార్జునుని దర్శించి, 'మాకరాజు'కడ తన ఆయుధములను కుదువబెట్టి, ధనమును తీసికొని మారకాపురముజేరి, 'వీరమేడపి'ని గట్టుకొనెను. అనుకొన్నగడువు పూర్తికాగనే, అలరాచ మల్లును రాయబారమునకు బంప నిశ్చయించెను. ఈ సందర్భమున అలరాజుతల్లి చెల్మమాదేవి బ్రహ్మనాయని 'ప్రాతపగలేమైన మనసున బెట్టుకొని నా కుమారుని సంధికి బంపుచుంటివా?'అని ప్రశ్నించును. బ్రహ్మన ప్రాతపగయననేమియో తెలుపుమని కోరును. అప్పుడు చెల్లమాదేవి, పూర్వము జరిగిన పెద్దన—అలరాజుల కలహమునుగూర్చి చెప్పును. (నాకు లభించిన వీరగాథలలోగూడ పూర్వభాగ వివరణము ఈ సందర్భముననే యున్నది). అలరాజు—పెద్దనల యాశ్వికులు పరస్పరము కలహించుట—పెద్దనచే పంపబడిన భట్టు అలరాచమల్లుతో గుఱ్ఱపుకాలికి పెద్దనపేర బొమ్మ కట్టుతగదనుట—అలరాజు పెద్దనను తిరస్కరించుట—అలరాజు పెద్దనలు పోరునెడకు బ్రహ్మనాయుడు బంధువులతోనేగి వారి పోరు నివారింపజేయుట—బ్రహ్మ

నాయడు అలరాజు దురహంకారమును గని పెట్టి సంధికి బంప నిశ్చయించుట—అందులకై వీరుల నొడంబఱుచుట—బ్రహ్మనాయడు అలరాజుతల్లియగు చెల్లాంబను అనుమతిగోరుట-పుత్రుని సంధికి పంపజాలక చెల్లాంబ దుఃఖించుట—తుదకు బ్రహ్మన అమెను ఒప్పించుట—తులసిమాలను అలరాజుమెడను వేసిపంపుట—అలరాజును బాలుడు వాహనములచే నదిని దాటించుటకై పందెములు పూనుట—అలరాజు గుఱ్ఱము ఓడిపోవగా బాలుడతని తులసిమాలనుగొనుట-ఇత్యాది కథను వీరభద్రకవి తన పద్యకావ్యమున స్పష్టముగా వర్ణించియున్నాడు. (కీ. శే. ఏటుకూరి నరసయ్యగారు కూడ తమ 'అలరాజు' పద్యకావ్యములో బ్రహ్మనాయని దుస్తంత్రమును విపులముగా వర్ణించినారు).

పింగళివారి ప్రతిలో (విశాలాంధ్ర ప్రచురణము) అలరాజు పెద్దనల కలహమును గూర్చిన ప్రథమ భాగమేకాక, అలరాజు రాయబారము నెఱపిన దినము గురజాలలో విడిసిన సంగతికాని, నాగమ్మ విషాన్నమును పంపిన విషయముకాని లేవు. సంధి విషయములు మాటాడిన వెంటనే అలరాజు ప్రయాణమైనట్లుగా నున్నది. ఇది సరికాదు. నాగమ్మ అలరాజుపై విషాన్న ప్రయత్నము, విషపుష్పముల ప్రయత్నము—రెండింటిని జేసినట్లు జానపదులలో వాడుకగలదు. అంతేకాదు. నరసింగరాజు మార్గమధ్యమున పొంచియుండి, అలరాజును చంపెనను వాడుక కూడ కొందఱు ప్రజలలో గలదు. ఇది అంత విశ్వసింప దగినదిగాలేదు. నరసింగరాజు వంటి వారిని వందమంది నైనను అలరాజు అవలీలగా చంపగలడు. పైగా, మహావీరుడగు కన్నమనీడు అతనికి అంగరక్షకుడుగా నున్నాడు. కాని నరసింగరాజు, సింహాసనము తనకు దక్కగలదను నాసతో, రాజ్య వారసుడగు అలరాజును చంపుటలో నాగమ్మకు తోడ్పడియుండును. లేనిచో బాలచంద్రుడు పితనిని చంపెదనని పట్టు పట్టుటలో నర్థములేదు. నలగాముడు పేరునకు మాత్రమే రాజు. అధికారమంతయు నాగమ్మ — నరసింగరాజుల చేతులలోనే యున్నది. దీనివలననే వీరభద్రకవి 'నరసింగరాజు'ను పాలకునిగా చిత్రించినాడేమో (?).

పింగళివారి ప్రతిలో నాగమ్మ, అలరాజును తాను చంపబోవుచున్నట్లుగా ముందు నలగామునితో చెప్పి యొప్పించినట్లున్నది. ఎంతటి కఠినాత్ముడైనను అల్లుని చంపుట కంగీకరించునా? కాని నాగమ్మ అతని తండ్రియగు అనుగురాజుపై నొట్టుపెట్టి, నలగాముని నిరుత్తరునిగా జేసినదట !

మద్రాసు ప్రభుత్వ ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారములోని ప్రతులలో గూడ అలరాజు సంధి వాక్యములాడిన దినము గురజాలలో విడిది చేసినట్లుగ నున్నది. నాగమ్మ విషాన్నమును పంపిన సంగతియు నిందుగలదు. మఱునాడుకాని అలరాజు చెర్లగుడిపాడు మీదుగా ప్రయాణముకాలేదు. పెద్దన్న—అలరాజుల కలహవిషయము, బ్రహ్మనాయుని కుటిలయత్నము తప్పు తక్కినవన్నియును మదరాసు లిఖితప్రతులలో గలవు.

పింగళివారిప్రతిలో అలరాజునకు విషపుష్పముల నిచ్చినది 'కొమ్మజియ్యరు' అని కలదు. ఇత 'డొక్కడే యిచ్చినట్లున్నది. మదరాసు ప్రతులలో తమ్మళ్ళు' (=తంబళ్ళు) ఇచ్చినట్లున్నది. బహువచన ప్రయోగమునుబట్టి వీరు ఇద్దరుముగ్గురు గలరని యూహింపవచ్చును. జనవ్యవహారమున 'తంబళ్ళపెద్దు' అనువాడు ఈ పనినిచేసినట్లు కలదు. ఇతడు అలరాజునకు పూలచెండునిచ్చిన ప్రదేశము చెర్లగుడిపాడు గ్రామమునకు ఉత్తరదిశలో నేటికిని గలదు. అట తంబళ్ళ పెద్దు విగ్రహమున్నది. (నా పల్నాటియాత్రలో దీనిని జూచితిని). అట్లే అలరాజు ఒఱిగిపోయిన ప్రదేశము కూడ చెర్లగుడిపాడునకు దక్షిణదిశలో నువ్వది. అక్కడ నొక శిలాఫలకమును, దానిపై అలరాజు శిల్పమును గలదు. దీని ప్రజలు 'అలరాజు ఒఱుగుఱాయి' అని పిలుతురు. ఇది మిక్కిలి ప్రాచీనమైన శిల్పము. (దీని ఛాయాచిత్రమును నేను తీసితిని.)

రెండు రాత్రులు పాడబడు అలరాజు రాయబార కథతో మొదటిరాత్రిని 'పెద్దనపోరు'అనియు, రెండవ రాత్రిని 'అలరాజు మరణము' అనియు గాథాకారులు వ్యవహరింతురు.

# అంధులైన సంస్కృత కవిశేఖరులు

## శ్రీ ఈయుణ్ణి వేంకటవీరరాఘవాచార్యులు

సర్వజ్ఞానేంద్రియము లందును నేత్రమే ప్రధానము. జ్ఞానము శ్రోత్రనేత్రముల మూలముననే మనకు చాలవఱకు లభించును. మహాబధిరు డైనను ప్రమాదము లేదు కాని అంధు డైనచో వాని కీ ప్రపంచమే లేదు. వెలుగు, చీకటి, ఆకారము, వర్ణము, సౌందర్యము, కురూపము మొదలైన వానిని మనము కంటి వల్లనే గుర్తింప గల్గుదుము. నేత్రముల సాయము వల్లనే మనదైనందినకృత్యముల నన్నిటిని చేయ గల్గుదుము. నేత్రములే లేనివాని కేకార్యము చేయుట కైనను పరాపేక్షయే అవసరము. అందుచేతనే 'కళ్ళు లేనివానికి కలియుగమే లే' దనులోకోక్తి పుట్టినది. చర్మచక్షువులు లేనికొందఱు ప్రజ్ఞాచక్షువులై, తమజ్ఞానచక్షువుల సాయముననే సామాన్యమానవులు సాధింపలేని భువనాద్భుత కార్యములను నిర్వహించి ఖ్యాతి నందగల్గిరి. అట్టివారు సాహిత్యప్రపంచమున ఆశువుగా మహోదాత్త గ్రంథములను రచించి అమర కీర్తి నందగల్గిరి. ప్రాచ్యపాశ్చాత్యసారస్వతములలో తెలియవచ్చినంతవఱకును అంధులు, జనుషాంధులు నగు కవిశేఖరులను గూర్చియు పండితప్రకాండులను గూర్చియు నిట విశదీకరింపబడును.

త్రినేత్రుడయ్యు పరమశివుడు దేనిని చూడజాలడో అష్టనయనుడైనను బ్రహ్మ దేనిని కనలేడో ద్వాదశనేత్రుడయ్యు షణ్ముఖుడు దేనిని కననేఱడో, సహస్రాక్షుడైనను ఇంద్రుడు దేనిని దర్శింపలేడో, అసంఖ్యాకనేత్రములు కల్గియు లోకమునందలి జనులందఱును దేనిని చూడలేరో అట్టి భువనాద్భుత దృశ్యమును, ద్వినేత్రుడయ్యు పండితుడు (=కవి), తన చర్మచక్షువులను నిరసించి, గాఢసమాధిమగ్నుడై, తన ప్రజ్ఞాచక్షు వొక్కదానితో(కేవల దివ్యదృష్టితో- The Mind's eye—) దర్శింపగల్గుచున్నాడు.[1]

రెండు కన్నులుగల హరికాని, మూడు కన్నులున్న ఫాలాక్షుడుకాని, అష్టనేత్రములుకల బ్రహ్మకాని, ద్వాదశాక్షుడగు షణ్ముఖుడుకాని, ఇరువది నేత్రములుకల రావణుడుకాని, సహస్రాక్షుడగుఇంద్రుడుకాని, లెక్కలేనన్ని నేత్రములతో జనసమాజముకాని దేనిని చూడలేదో అట్టినిగూఢవస్తువునుతనప్రజ్ఞానేత్రమొక్క దానిచేతనే పండితుడు స్పష్టముగా దర్శింపగల్గును.[2] ప్రజ్ఞాచక్షు వనగా చర్మచక్షువులు లేనివాడు (=అంధుడు) అనునర్థముననే ప్రకృతవ్యాసమున వాడ

---

1. చూ. భారతి–డిసెంబరు, 1967. (పు. 40)

శా. 'య స్నేత్రై స్త్రిభి రీక్షతే న గిరిశో
నాష్టాభి రప్యబ్జభూః,
స్కందో ద్వాదశభిర్ న వా, న మఘవా
చక్షుస్సహస్రేణ వా
సంభూయాపి జగత్త్రయస్య నయనై ర్
ద్రష్టుం న తచ్ఛక్యతే,
ప్రత్యాదిశ్య దృశౌ, సమాహితధియః
పశ్యన్తి తత్ పండితాః.'

—(సుభాషితరత్నకోశ —1249 శ్లో.) 1957.

2. చూ. భారతి—డిసెంబరు, 1967 (పు. 41)

శా. 'ద్వాభ్యాం య న్నహరి స్త్రిభిర్ న చ హరః,
స్రష్టా న చై వాష్టభిః,
య న్నద్వాదశభిర్ గుహో న దశక
ద్వంద్వేన లంకాపతిః,
య న్నేంద్రో దశభిః శతై ర్న జనతా
నేత్రై రసంఖ్యై రపి,
తత్ ప్రజ్ఞానయనేన పశ్యతి బుధ
శ్చైకేన వస్తు స్ఫుటమ్.'

—(భవదత్తశాస్త్రిచే తిలకమంజరీ భూమికలో నుదాహృతము—పు. 5.)

బడెను. కాణుఁడు (ఏకాక్షి; అంధుడు), కొంత వయస్సున నేత్రావరోధము కలిగినవారు, జనుషాంధులు (పుట్టుకతోడనే నేత్రహీనులు) పలువు రనేకదేశము లందు, ఆయాభాషాసారస్వతములందు మహా విద్వాంసులు, కవిచూడామణులుగా తెలియవచ్చు చున్నారు.

రవికానని విషయమునుగూడ దూరదర్శియగు కవిశేఖరుడు (విద్వత్ ప్రకాండుడు) తన ప్రజ్ఞా చక్షుః ప్రభావమున చూడగల్గును. 'కవిః క్రాన్త దర్శీ'—అని ప్రాచీన సాహిత్యవేత్తల అభిప్రాయము. ఈ యర్థముననే 'ల్యాటిన్' (Latin) భాషలో కవి యనుపదమునకు Vates (=Prophet) అను శబ్దము కలదు. అనగా, భవిష్యత్తున జరుగబోవు కార్యములను గుర్తించి తెలుపగలవాడని భావము.

రాజశేఖరు డీ విషయములను 'కావ్యమీమాంస' యందు విశదీకరించియున్నాడు. (పు. 12.)

సంస్కృత సారస్వతము :

అంధులైన కవికోదులు 6 గురు సంస్కృత వాఙ్మయమున కలరని తెలియుచున్నది.

(1) జానకీహరణ మను మహాకావ్యమును రచించిన రాజకవి కుమారదాసుడు (క్రీ. 517—526) (2) మేధావిరుద్రుడు (3) గుజరాత్ దేశవాసి శ్రీపాల కవిచక్రవర్తి (4) విశ్వగుణాదర్శము మొదలగు శతాధిక గ్రంథ నిర్మాణ నిపుణు డగు కాంచీపురవాసి వేంకటాధ్వరి (క్రీ. 17 వ శతాబ్ది) (5) గుజరాత్—దేశీయుడు, జైన వాఙ్మయ మహారథుడునగు సుఖలాల్ జీ—సంఘవీ (S. Sanghavi) ఈయన ప్రకృతము సజీవుడు (6) ఏ. వి. కాణే (A. V. Kane) ప్రకృతము బొంబాయినగరమున నివసించు నొకయువకవి. ఈయన రచించిన లఘు కావ్యములు 'సంస్కృతప్రతిభ' అను పత్త్రికయం దెడనెడ ప్రకటింప బడుచున్నవి.

పై కవిషట్కమున మొదటి 5 గురిని కూర్చిన వృత్తాంతము లించుక వివరింపబడును.

### 1. కుమారదాసు (క్రీ. 517–650.)

ఈయన సింహలద్వీప పాలకుడగు రాజకవి. బహుశః, సముద్రగుప్తచక్రవర్తికి పిమ్మట పేర్కొనవలసిన రాజకవి ఈయనయే. ఇతివృత్త విన్యాసమున, శయ్యాసౌకుమార్యమునను ఈయనరచనపై కాళిదాసు కవితాప్రభావ మెంతో కన్పట్టును. కవికుల గురువు వలెనే ఈ కవియు వైదర్భీరీతి నాశ్రయించియే కవితారచనను సాగించెను. కుమారదాసు నిర్మించిన 'జానకీహరణ' మను మహాకావ్యమున 20 సర్గములు కలవు. కాళిదాసువలెనే ఈ కవియు మితముగా యమకాలంకారములతో మధుర మైనకవితను నిర్మించెను. భట్టి — మాఘ — మురారికవులవలె నీకవియు శబ్దశాస్త్రనిష్ణాత; కవి వాడిన వివిధ పద్య జాతులసంఖ్య 14. ఈ క్రిందిశ్లోకము కాళిదాస రచనకు అనుకరణము.

1\. శ్లో 'పుష్పరత్నవిభవై ర్యథేప్సితం
సా విభూషయతి రాజనందనే,
దర్పణం తు న చకాంక్ష, యోషితాం
స్వామి సమ్మదఫలం హి మండనమ్.'
— (జానకీ.)

పై శ్లోకమునందలి 'యోషితాం......మండనమ్'—అను వాక్యమున కీ క్రింది కాళిదాసుశ్లోకము మూలము :

2 శ్లో. 'తథా సమక్షం దహతా మనోభవం
పినాకినా భగ్నమనోరథా సతీ,
నినింద రూపం హృదయేన పార్వతీ
ప్రియేషు సౌభాగ్యఫలా హి చారుతా.'
—(కుమార. 5. 1.)

### 2. మేధావి రుద్రుడు

జనుషాంధుడు. ఈయన వృత్తాంతముకాని తద్రచనములుకాని మన కేమియు లభింపలేదు. క్రీ. 10 వ శతాబ్దిలోని బాలకవి—కవిరాజునగు రాజశేఖరు డీతనిని పేర్కొనుటచే ఈతడు 10 వ శతాబ్దికంటె పూర్వుడనిమాత్రము చెప్పవచ్చును.

### 3. కవి చక్రవర్తి—శ్రీపాలుడు

క్రీ. 12 వ శతాబ్ది. బహుశతాబ్దముల నుండి జైనులు సంస్కృత ప్రాకృతసారస్వతసాగర

మున ఓలలాడి ఈ వాఙ్మయములకు నిరుపమానసేవ చేసిరి. బహుశః గీర్వాణ ప్రాకృత సాహిత్యములందు వీరు తమ రచనలచే అలంకరింపనిశాఖయేలేదు. అట్టి పరశ్శత విద్వత్కవిశేఖరులలో చర్మచక్షువులు లేక, కేవల ప్రజ్ఞాచక్షువుచేతనే ఖ్యాతినందిన శ్రీపాలు డొకడు.

సిద్ధరాజ — జయసింహుడు (1094—1143 క్రీ.)— గుజరాత్‌దేశము నేలిన ప్రభు పుంగవులలో నతిప్రఖ్యాతుడు. ఈయన విక్రమార్క—భోజరాజాలవలె దిగంతరలసత్కీర్తి అయెను. ఈయన దర్బారును కుముదచంద్ర—వాదిదేవసూరులు, 'కవి కాల సర్వజ్ఞ'డైన ఆచార్య హేమచంద్రుడు, అంధ్రుడగు కవిసార్వభౌమ శ్రీపాల కవిచక్రవర్తి మొదలగు వారెందఱో అలంకరించిరి. వీరిలో ప్రాగ్వాట వంశమునకు చెందిన శ్రీపాలకవి, సిద్ధరాజ నిర్మితమగు సహస్రలింగ సరోవరముపై నొక 'ప్రశస్తి'ని రచించెను. ఇందలి భాగ మొక్కటియే కల యొకశిల పాటన్నగరమునందలి ఆలయమున కలదు. జీర్ణమైన రుద్రమహాలయమును పునరుద్ధరించి, సిద్ధరా జీయాలయమునుగూర్చి శ్రీపాలకవిచే నొక ప్రశస్తిని వ్రాయించెనట. సిద్ధరాజు తనయుడగు కుమారపాల ప్రభువు (క్రీ. 1143—1174) రాజ్యపాలన కాలమున శ్రీపాలకవి వడ్నగర—(Vadnagar) దుర్గముపై నొక ప్రశస్తిని రచించెను. దీని చివర కవి తన్నుగూర్చి యిట్లు చెప్పుకొనెను.

శ్లో. 'ఏకాహ నిష్పన్న మహా ప్రబన్ధః
శ్రీ సిద్ధరాజ ప్రతిపన్న బన్ధుః,
శ్రీపాలనామా కవి చక్రవర్తీ
ప్రశస్తి మేతా—మకరోత్ ప్రశస్తామ్'

—(ప్రాచీన లేఖమాలా — I భాగము. 45వ లేఖ) 1903 క్రీ.

పై శ్లోకమున పేర్కొనబడిన ఏకదిన నిర్మితమగు మహాప్రబంధము వైరోచన విజయము. దీనిని 'ప్రభావక చరితము'న ప్రభాచంద్రాచార్యుడును పేర్కొనియున్నాడు.

శ్రీపాలకవి సిద్ధరాజున కాప్తమిత్రుడే కాక తదాస్థానమున కవిచక్రవర్తిగా గూడ గౌరవింపబడెను. అణహిలవాడ నగరమునకు వచ్చిన దిగ్గజముల వంటి పండితులతోను, ముఖ్యముగా, భాగవత సంప్రదాయమునకు చెందిన దేవబోధ పండితుని తోడను శ్రీపాలు డనేకశాస్త్రచర్చల నిర్వహించెను. ఈ శాస్త్రవాదములను గూర్చిన విశేషములు హేమచంద్రుని కావ్యానుశాసనమునకు ఆచార్య ఆర్. సి. పరీఖ్ (Prof. R. C. Parikh) రచించిన ఆంగ్ల భూమికయందు విశదీకరింపబడెను. (I భాగము; 1938.) తమతమ రచనలను సవరింప జేసికొనుటకై సమకాలికపండితు లెందఱో శ్రీపాలకవి సన్నిధికి వచ్చుచుండెడివారు. ఎక్కడనోకాని ఒక్క వంశముననే మూడు పురషాంతరములవఱకు సరస్వతీ కటాక్షము ప్రసరింపదు. నేత్రావరోధరూపమున శ్రీపాలకవి దైవోపహత డయినను, ఆయనపుత్ర పౌత్రులు మాత్రము కవితాకౌశలము కలవారు. శ్రీపాలునికుమారుడు సిద్ధపాలుడు కావ్యనిర్మాణ నిపుణుడు. ఈతని ఉపాశ్రయమున నున్నపుడే (క్రీ. 1185) సోమప్రభాచార్యుడు 'కుమారపాల ప్రతిబోధ' మను ప్రాకృతగ్రంథమును రచించెను. ఇందు హేమచంద్రుడు తనశిష్యచూడామణి యగు సిద్ధరాజునకు బోధించిన మతవిషయికోపదేశముల సారము విశదీకరింప బడెను.

సిద్ధపాలుని కుమారుడగు విజయపాలుడును కవితల్లజుడే. ఈయన రచించిననాటకము ద్రౌపదీ—పరిణయము. ఈ రూపకము మూలరాజనిర్మితమగు త్రిపురుషప్రాసాదమున (అణహిల్ వాడ్‌నగరమున) రెండవ భీమదేవప్రభువు[4] నాజ్ఞచే ప్రదర్శింప బడెను. ఈ భీమదేవప్రభువు, కుమారపాలుని పిమ్మట గుజరాత్—దేశమును పాలించిన తృతీయ భూపాలుడు.[4]

3. క్రీ. 1179—1242.

4. రమారమి రెండు పుష్కరముల క్రింద 'శ్రీపాలకవి చక్రవర్తి'నిగూర్చి నేను రచించిన విపులవ్యాసమున ఈ కవి చక్రవర్తి కవితాశకలములు, లభించినంతవఱకు ఉల్లేఖింపబడినవి. 1945 వ వత్సరమున పై రచన 'పిఠాపురరాజ కళాశాలా పత్రిక' (Vol. 9) యందు ప్రకటింపబడెను. ఈ రచన కుప జీవ్యము 2500 వ జైనశాసన మహాసభయందు (2500 th All-India Jaina Sasana Conference, Calcutta.)

4. శ్లేషయమక చక్రవర్తి—అరశాణపాలెం వేంకటాధ్వరి (క్రీ. 17 వ శతాబ్ది):

ఈయన శ్రీవైష్ణవుడు, ఆత్రేయగోత్రజుడు; ఇంటిపేరు 'ఘటాంబు'—ఇదే క్రమముగా కడాంబు, కిడాంబి, కిళాంబిగా భ్రష్టరూపము నందినవి. తండ్రి శ్లేషయమక చక్రవర్తియగు రఘునాథాధ్వరి; పితామహుడు అప్పయాధ్వరి యనబడు శ్రీనివాసాధ్వరి. పంచమతభంజనమను గ్రంథమును నిర్మించి, విజయనగరాధీశ్వరుడగు కృష్ణదేవరాయలకు ఆచార్యులగు తాతాచార్యులవారి భాగినేయుడు శ్రీనివాసాధ్వరి. ఈయన కూటస్థుడు భగవద్రామానుజులకు (క్రీ. 1017—1137) హృదయనిక్షేపుడు, శిష్యచూడామణి, మహానసనిర్వాహకుడునగు కిళాంబి — ఆచ్చాన్‌పండితుడు. శ్రీవైష్ణవులలో 'వడగిలి' సంప్రదాయమునకు చెందిన దీ వంశము.

వేంకటాధ్వరి తర్కవ్యాకరణాలంకార శాస్త్రము లందు, పూర్వమీమాంస, వేదవేదాంతములందును కూలంకషవైదుష్యము నార్జించి, 108 గ్రంథములను రచించెనట. అం దేయిరువదియో మనకు లభించెను. ఈ కవి నిరంకుశ కవితాధురంధరుడు. ఈయన 1. ఉత్తరరామచరితచంపూ 2. కాంచీభాణ 3. ప్రద్యుమ్నానందనాటక 4. లక్ష్మీసహస్ర 5. వరదాభ్యుదయ చంపూ. (కరిగిరిచంపూ) 6. విధిత్రయ పరిత్రాణ 7. విశ్వగుణాదర్శచంపూ. 8. శ్రవణానంద 9. శ్రీనివాస విలాసచంపూ. 10. సుభాషితకౌస్తుభ మొదలగు గ్రంథము లనేకములు రచించెను. ఇందు విశ్వగుణాదర్శ — లక్ష్మీసహస్రములు విశేష వ్యాప్తి నందినవి.

ఇద్దఱు గంధర్వులు (కృశాను—విశ్వావసులు) భారత వర్షమును విహంగమదృష్టిచే దర్శించి, వర్ణించుటకై విమానముపై ఆసేతు శీతాచలమును ప్రయాణము చేసిరి. కృశానుడు పురోభాగి (దోషైక దృష్టి); విశ్వావసువు కేవలగుణగ్రాహి. సూర్యభగవానునితో మొదలిడి, అనేక పుణ్యక్షేత్రములను, నదీనదములను, ప్రజలను వారి యాచారాదులను వర్ణించుచు నొకానొకచో మహావిష్ణువును వర్ణించుచు 'పుష్పవన్నేత్రుడు' అని శ్లేషవ్యామోహమున ప్రయోగించెను. అనగా కంటిలో పువ్వువేసినవాడు, పుష్పవంతు లనబడు సూర్య చంద్రులు నేత్రములుగా కలవాడు—అని రెండర్థములు. ఇట్టి భగవదపచారము వలన కవికి నేత్రావరోధము కలిగెనట. అపుడు వేయి శ్లోకములచే (25 స్తబకములలో) శ్రీ మహాలక్ష్మిని ప్రార్థింపగా ఆయనకు తిరిగి దృష్టిభాగ్యము కలిగెనట.

దీనిని బట్టి కవి కరిగిరిచంపువును, లక్ష్మీసహస్రమును ఆశువుగా రచించె నేమో అని భావించుట అసమంజసము కాకపోవచ్చును. వేంకటాధ్వరి శ్లేషకవితాకౌశలము నిరూపించుటకై యొక్క శ్లోక ముల్లేఖింప బడును. దీని 4 పాదములలో 2 పాదములందు శేషచమత్కారమును గుర్తింపజనును.

శ్లో. 'వేంకటార్యవచోగుంఫై ర్జితౌ గురు—ఫణీశ్వరౌ,
ధిషణాహీనతాం ప్రాప్య జీవశేషౌ బభూవతుః.'

(వేంకటాధ్వరి వాగ్గుంఫములచే బృహస్పతియు ఆదిశేషుడును జయింపబడి, బుద్ధిహీనతను పొంది, జీవచ్ఛవములవలె నున్నారు). ఉత్తరార్థమున శ్లేషచమత్కారము నిట్లు గుర్తింపవలెను:

ధిషణః=గురుడు [గీష్పతి ర్ధిషణో గురుః]; అహి+ఇనతాం=సర్పరాజత్వము; జీవ=గురుడు [జీవ ఆంగిరసో వాచస్పతిః]; శేష=ఆదిశేషుడు.

5. పండిత—సుఖలాల్—జీ సంఘవీ
(Pt. Sukhalalji Sanghavi)

గుజరాత్‌వాసి, సజీవుడైన యీ విద్యచ్చూడామణి జనుషాంధుడు; అయినను, తర్క వేద భాష్యములందును, సంస్కృత ప్రాకృతములందును, జైన సంస్కృతి సాహిత్యములందును శ్రవణమాత్రము

5. 1927—28 వత్సరమున విజయనగర మహారాజ కళాశాలా పత్రికయందు ప్రకటితమగు నా ఆంధ్రవ్యాసమును, 1937 ప్రాంతమున 'ఇండియన్ — కల్చర్' (Calcutta; Vol. VII) పత్రికలో వేంకటాధ్వరి కాలమును, గ్రంథములను గూర్చిన నా ఆంగ్ల వ్యాసమును చూడదగును. Vol. 6. No 2. Oct. 1969 (PP 225 to 234.)

చేతనే అగాధ వైదుష్యమును పడసెను. ఆయన ప్రజ్ఞాచక్షువే దీనికి హేతువు.

1953 వ సంవత్సరమున అహమ్మదాబాద్‌లో జరిగిన 'అఖిలభారత — ప్రాచ్య విద్వన్మహా సమ్మేళన' మున, (All—India Oriental Conference), జైన—ప్రాకృతశాఖ కధ్యక్షుడై పాండిత్య గరిమను సూచించు మహోపన్యాసమును ఒసగెను. నేత్రావరోధ ముండియు శాస్త్రీయముగా ఆధునిక పరిష్కరణ విధాన మున (On modern scientific & critical lines) ఈ క్రింది గ్రంథములను పరిష్కరించెను :

1. జ్ఞానబిందు ప్రకరణ (యశోవిజయోపాధ్యాయకృతము): ఇట సుఖలాల్ జీతో సహసంపాదకులు. పండిత — దల్‌సుఖ్‌— మాలవానియా; విదుషీమణి హీర—కుమారీదేవి.

2. ప్రమాణమీమాంస (హేమచంద్రాచార్య రచితము): సంపా. సుఖలాల్—జీ; మహేంద్రకుమార్; మాలవానియా.

3 వేదభాష్యసార (సాయణభాష్యము నుజ్జీవించి) : సంపా. పండిత—సుఖలాల్—జీ.

4. వేదవాద—ద్వాత్రింశికా (సిద్ధసేన—దివాకర నిర్మితము) : సంపా. సుఖలాల్— జీ.

5. A. పరిశిష్టము ·

ప్రతివాది భయంకర శ్రీరామానుజాచార్యులవారు: (జీవితకాలము : రమారమి 1825 - 1897)—చామర్లకోటవాసి. 4—5 ఏండ్ల వయస్సుననే విషూచి వల్ల ఈయన కంధత్వము కలిగెను పీఠికాపురాధీశ్వరులైన గావునీలాద్రిరాయణింగారి ఆస్థానపండితులును సహస్రావధానియునగు ప్ర. భ. రాఘవాచార్యులవారును ఈయన జనకులును అన్నదమ్ముల పౌత్రులు. శాస్త్రత్రయ పండితులగు వేంకటాచార్యులవా రీయన జనకులు; జనని శ్రీమతి అలివేలమ్మ. అంధులయ్యు రామానుజాచార్యులుగారు నాలాయిరము (చతుస్సహస్రి) అను ద్రావిడ దివ్యప్రబంధమును క్షుణ్ణముగా వల్లించుటేకాక, ఆంధ్రసంస్కృత సాహిత్యములం దసదృశవైదుష్యము నార్జించిరి. శ్రవణ మాత్రమున నింతటి పాండిత్యమును పడసిన ఈయన అసాధారణధారణా సంపన్నులు.

ఆంధ్రవాఙ్మయము :

శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహకవి (1867—1945 క్రీ.) : ఈయనకు 45 వత్సరముల వయస్సున, మొదట రేచీకటియు, పిమ్మట పూర్తిగా అంధత్వమును కల్గినవి. ఆయన రచనలలో చాలవఱకు ఆయన ఆశువుగా చెప్పుచుండ లేఖకుడు వ్రాసినవే. అంధత్వ ప్రభావమువల్లనే ఆయన కేకసంధాగ్రహణ శక్తి, నిశిత ధిషణాసంపద, దృఢస్మరణ శక్తియు నలవడినవి. తెనుఁగున ప్రశస్తమైన ఆఖ్యాయికల (Novels) చాల రచించుటవల్ల 'ఆంధ్రస్కాట్' (Sir Walter Scott—of Andhra) అనియు, శీఘ్రకవియు, అంధులు అగుటచే 'ఆంధ్ర మిల్టన్' (Andhra Milton) అనియు వీరికి విద్వత్ప్రపంచ మున వ్యవహారము. ఈయన శ్రవణేంద్రియమునకు కూడ తీవ్రమైనశక్తి అలవడినది. నేత్రావరోధము వచ్చిన పిమ్మట ఏ వ్యక్తికంఠస్వరమునైనను ఒక్కసారి విన్నచో ఆ వ్యక్తి కంఠధ్వనిని ఎన్నియేండ్ల పిమ్మటనైన నిట్టే గుర్తించి ఆయనను పేరుపెట్టి పిలిచెడివారు. శ్రీ వీరేశలింగం పంతులుగారి రచనలు 10 సంపుటములలో ప్రచురింపబడినట్లే శ్రీ చిలకమర్తి వారి రచనలను వారి షష్టిపూర్తికి 10 సంపుటములుగా ప్రచురించి, విద్వల్లోకము వారికి సమర్పించి, వారి ఋణమును తీర్చుకొని, ఆంధ్రవాఙ్మయమునకు మహోపకార మొనరించెను.

ద్రావిడ వాఙ్మయము :

మనకు తెలిసినంతవఱకు ద్రావిడ సారస్వత మున అంధులైన కవిశేఖరు లిద్దరు కలరని తెలియుచున్నది. ఇరువురిలోను పూర్వుడు, ఘనతరుడు వీరరాఘవ ముదలియార్ (ANDAHAKKAVI= Andhakavi?, V. R. Mudaliar) (క్రీ. 17 వ శతాబ్దము). ఇతనికంటె పరుడును, ప్రజ్ఞాపాటవ మున అతని తరువాతివాడు 'కవిసింహ' మాంబలం-నవలార్ (క్రీ. 1831?—1884)—(KAVI-CHINGA' Mambalam Navalar.)

ఈ కవిసింహము పళని (Palani) అను దక్షిణదేశజనపదమున క్రీ 1831 39 నడుమ ఒక పవిత్రదంపతుల కుమారుడై జన్మించెను. ఆ

క్షేత్రమునకల దండాయుధపాణియనుదేవునిపై కవి జనకుడగు ముత్తయ్య ఆచార్యునికి గాఢమైనభక్తి కలదు. కవి బాల్యముననే విషూచివ్యాధికి గురియై, దైవోపహతుడై రెండు నేత్రములను కోల్పోయెను. అంధుడైన యీ బాలుని ఎంతకష్టపడియైనను ప్రయోజకుని చేయవలెనని జనకుని పట్టుదల. తండ్రి వ్రేలితో శిశువు వీపుపై అక్షరమాలను వ్రాసి ఆతనికి నేర్పుచుండెడివాడు. ఏయంగమునకైనను వైకల్యము కల్గినచో దానిశక్తి ఇంకొక యవయవమునకు విధిగా సంక్రమించును. ( Compensation is the law of Nature'.) అధఃకాయము దుర్బలమగుచో దాని బలమూర్ధ్వకాయమునకు సంక్రమించును. అందుచే ఈ బాలుని కతినిశితమైన ధిషణాసంపదయు, అద్భుతమైన జ్ఞాపకశక్తియు లభించెను. తండ్రిచే నియమింపబడిన యొక ఉపాధ్యాయునియొద్ద నీ బాలుడు వ్యాకరణమును, ప్రాచీనగ్రంథరాజములను క్షుణ్ణముగా వ్యాసంగ మొనర్చి, ఇరువదియేండ్ల వయస్సునకే దృఢవ్యుత్పన్నుడేకాక కవిప్రవరుడాయెను. స్థానికదైవమగు దండాయుధపాణిపై భక్తిరసనిర్భరములగు కీర్తన లనేకము లాశువుగా నిర్మించి 'కవిరాజు' ('Kavirayar') అని ఖ్యాతి నందెను. నాడు ఉదారులు, వితరణశీలురు అగు భూస్వాములు, జమీందారులు, మహారాజుల సమాదరణమువల్లనే కవులకు, కోవిదులకు విశేషఖ్యాతి కల్గుచుండెడిది. కవికి రాజాశ్రయము లేనిదే కీర్తి దుర్లభము. అట్లే కవి నాటిన కవితాలత రాజాశ్రయ దోహదము లేనిచో వర్ధిల్లనేఱదు. నిరుపఘ్నమైన లత యభివృద్ధి నందజాలదు. నిరాశ్రయుడగు కవికిగాని, పండితునికిగాని యశస్సు దుర్లభము.

'నిరాశ్రయా న శోభంతే పండితా వనితా లతాః'—అని సూక్తి. కవులు ప్రభువులను గూర్చి స్తోత్రకావ్యములను నిర్మించియు, తాము రచించిన కావ్యములను వారికి కృతిగా నర్పించియు వారి యనుగ్రహమునకు పాత్రులగుచుండెడివారు.

మాంబళ కవిరాజును శిష్యులు కొందరాశ్రయించి విద్యలను నేర్చుచుండిరి. వీరు గురువునకుపచారములు చేయుచు ఆయన ఆశువుగా చెప్పిన రచనలను గ్రంథస్థము చేయుచుండిరి. ఈ యతేంవాసి మండలితో గురువు తమిళనాడున నలువైపులను ప్రయాణముచేయుచు, రామనాథపురమునకు ( Ramnad ) వచ్చెను. అచ్చటి ప్రభువు ముత్తురామలింగసేతుపతి. ఆయనయొద్ద ప్రధానామాత్యుడు (దివాన్) పొన్నుస్వామి దేవర్ ( Thevar). ఈయన ద్రావిడభాషా కోవిదుడు. 19వ శతాబ్దమున మధురలో తమిళ సంగమును స్థాపించి, కీర్తినందిన విద్వాంసుడు పండితురై-దేవర్(Panditurai Thevar) పొన్నుస్వామి కుమారుడే. మాంబళకవి ప్రభువును గూర్చియు, ప్రధానామాత్యుని గూర్చియు ప్రశంసించుచు పద్యముల రచించి, నాటిసంప్రదాయము ననుసరించి, వారిరువురకునుపంపి, దర్శనమొసగ ప్రార్థించెను. ప్రభుప్రధాను లిరువురును కవి రచనలను మెచ్చుకొనిరి; కాని, సంస్థానమున అంధులను సత్కరించు నాచారము లేకపోవుటచే వా రిరువురును కవిని దర్బారున కాహ్వానించుటకు జంకుచుండిరి. ఈ సంగతివిని, కవిరాజు చాల నిరుత్సాహము నందెను. కాని ఆతనికి కొంత యాశాలేశ ముండుటచే, ప్రభుసమ్మానము నందక, తా నారాజధానిని వదలగూడదని భీష్మించుకొనియుండెను. త్వరలోనే ఆతనికి అనుకూల సన్నివేశ మొకటి లభించెను. ఒకనా డాస్థానమునందలి కవులకు శారదాపరమగు నొక శ్లోకము నొసగి, దానిని 'వెణ్బా' (Vemba) వృత్తముగా ద్రావిడభాషలో ననువదింపుడని ప్రభువాజ్ఞాపించెను. కాని వారి కది అసాధ్యముగా కన్పట్టెను.

అప్పుడా కవిమండలిలో నొకడు మన అంధకవివరునియొద్ద కేగి, రాజు కోరిన ట్లాశ్లోకము ననువదించి యిచ్చి తన పరువును దక్కించుమని ప్రాధేయపడెను. అర్థించుటయే తడవుగ మన కవి కొన్నిసెకండ్లలోనే పద్యము నాశువుగా రచించి, ఆతని కిచ్చెను. దీని నీతడు ప్రభువున కర్పించి, ఆయనకు సంతోషమును కల్గించెను. కాని క్రమముగా ఆ యనువాదము మాంబళకవిరాజు రచనయని ప్రభువునకు తెలియగా, ప్రభు ప్రధానామాత్యు లిరువురును,

సంస్థానమర్యాద కపవాదముగా అంధకవిరాజును దర్బారున కాహ్వానించి, విశేషసత్కారము గొనర్చుటేకాక, తదద్భుత ప్రతిభాపాటవమునకును, నిరుపమకవితా కౌశలమునకు తగినట్లు 'నవలార్; కవిసింహ (Kavi-chingam)' అను బిరుదము లొసగి గౌరవించిరి.

రామనాధపుర సంస్థానమున మాంబలకవిసింహ మునుగూర్చి యనేకకథలు ప్రచారము నందినవి. ఈ ప్రభువునొద్ద సెలవు గైకొని కవి యితరప్రాంతముల నెన్నిటినో చూడనరిగెను. ఇతఁడే ప్రాంతమునకు వెళ్లినను ఈతనికి ముందుగా నీతని కీర్తి దూతికయే యరుగుచుండెను. లోకులును ప్రభువులు నీతని కఖండగౌరవమును చూపుచుండిరి. తరువాత కొంతకాలమున కీకవి వివాహితుడై, అవసానకాలమువఱకును (క్రీ. 1884) సుఖముగా జీవయాత్ర చేసెను.

రచనలు:

ఈ కవి రచనలలో ప్రశస్తమైనది 'చంద్ర విలాసము'. ఇది 100 పద్యములకు పైబడిన శతకము. 'వేలక్కురిచి' (Velakkurichi) జమీందారగు వేలప్ప—గౌండర్ ఇందు ప్రశంసింపబడెను. ప్రాచీన సంప్రదాయముననే నిర్మితమగు నీకృతియం దొక మహిళామణి విప్రలంభముచే బాధపడుచు, తన విరహవేదనను, స్వప్నానుభూతిని చంద్రునకు నివేదించును. కావ్యోద్దేశము సమానమే అయినను ఈకృతి 'కాదల్—ప్రబంధ' ప్రక్రియకంటె విలక్షణమైనది. ఈ పద్యములలో అనేక శబ్దములు శ్లేషచమత్కారము కలవి; క్లిష్టమగు ఛందశ్చమత్కారములతో నొప్పునవి. ఈ కవి దేవాంగ పురాణమును, అనేక ప్రబంధములను రచించెను; 'శృంగార రసమంజరి' అను శృంగార రసాత్మక సంస్కృత కావ్యమున కీకవి ఉజ్జ్వలమగు ద్రావిడ పరివర్తనమునే కాక, జమీందారులను, ప్రభువులను ప్రశంసించుచు అసంఖ్యాకస్తుతి కావ్యములను రచించెను.

ప్రస్తుత మీయన రచనల కంతగా జనాదరణము లేకపోయినను, 19 వ శతాబ్దము నందలి విద్వాంసులును, కవులును మాంబళకవిసింహుని రచనలను శిరసాధరించి గౌరవించెడివారు.

(ఉపజీవ్యము : '19 వ శతాబ్దమున విలసిల్లిన పళని గ్రామవాసియగు అంధకవి' [Blind Poet of Palani who flourished in 19 th Century—By A. V. Subramania Aiyar— అను నాంగ్ల వ్యాసము ప్రధానముగా నా పై రచన కాధారము. వారికి కృతజ్ఞుడను. Hindu-P. II, Sunday, 10 th March, 1968.)



# వచన కవిత–అభిమానుల అత్యుక్తులు

శ్రీ నోరి నరసింహశాస్త్రి

"పరమ వివేక సౌరభ విభాసిత
సద్గుణపుంజ వారిజో
త్కర రుచిరంబులై సకల
గమ్యసుతీర్థములై మహామనో
హర సుచరిత్ర పావనపయః
పరిపూర్ణములైన సత్సభాం
తర సరసీవనంబుల ముదం
బొనరం గొనియాడి వేడుకన్"

ఈ విధంగా నన్నయ కొనియాడిన సభలు 'సకల గమ్యసుతీర్థములు'కాని విద్వాంసులూ ప్రభువులూ మాత్రము సమావిష్టులైన పరిమిత సభలుకావు. ఆ సభలలో సత్కవులు కావ్యాలు వినిపించి సభ్యుల మెప్పు పొందినప్పుడే కృతార్థత పొందేవారు.

నేడు మహాపట్టణాలలో కూడుతున్న సభలు కూడా సకల గమ్యములే. కాని నేటి సభలను రంజింప జేస్తున్నది చిత్రకవిత్వ సదృశమైన కేవల చమత్కార మాత్రములైన కావ్యాలే కాని ఉత్తమశ్రేణి కావ్యాలు కాకపోవడము తోచింపదగినది. ఈ సభలను రంజింప జేయడానికి కావ్యగత చిత్రత లేకపోతే, శ్రావ్యమైన కంఠమో పఠన వైచిత్రియో అవసరమవుతున్నవి.

సభల సంగతి ఇట్లా ఉండగా, ఇక అక్షర రూపము ధరించిన వాఙ్మయము సంగతి ఆలోచిస్తే, పత్రికలు ప్రాధాన్యము వహిస్తున్నవి. అవి జనుల అభిప్రాయాలను ప్రతిబింబించవలె. ఇది ప్రచార యుగము గనుక రాజకీయాది కారణాలవల్ల దేనికి ఎక్కువ ప్రచారము ఉంటే, అదే ఉత్తమ కావ్యంగా చలామణీ అవుతున్నది. ప్రచారాధిక్యమువల్ల కొందరి కావ్యాల గుణదోషాలు శాంతంగా విచారణ చేయడమే పాపంగా పరిగణింపబడుతున్నది. ఐనా కొందరైనా దానికి పూనుకోకపోతే కిల్బిష మంటుకుంటుంది అనే భయంతో ఇట్టి విచారణకు పూనుకోనవలసి వచ్చినది.

నేడు ముఖ్యముగా యువతీ యువకులను, విస్తార ప్రచార ఫలితంగా, ఎక్కువ ఆకర్షిస్తున్నది. వచన కవితాప్రక్రియ. కొందరు దీనినే వచనగేయమనీ, ఫ్రీవర్సుఅనీ, స్వచ్ఛంద కవిత్వము, అనిబద్ధ కవిత్వము, ముక్తచ్ఛంద కవిత, వెర్సులిబ్రే—ఇత్యాది నామాలతో ఎవరి అభిమానముకొద్దీ వారు పిలుస్తున్నారు. ఏ పేరు పెట్టినా, అది పద్య ఛందస్సునుగాని గేయచ్ఛందస్సుగాని ఆదరించక వాటికి కట్టుపడక స్వతంత్రంగా వచనమే పద్యంగా రూపొందే ప్రక్రియ.

ఈ వచనకవితా ప్రక్రియ స్వరూపము పలువురు పలువిధాలుగా నిర్వచనము చేస్తున్నారుకాని వారిలో సంయమనముతో ఆలోచించి వ్రాయగలవారి మాటలలో కొంత ఏకవాక్యత ఏర్పడుతున్నది. అన్నిటిలో ప్రధానమైన లక్షణము ఒక క్రొత్త లయ.

ఈ లయను ఎక్కువమంది 'భావలయ' అని వ్యవహరిస్తున్నారు, ఛందస్సులలో ఎక్కువ కృషిచేసిన శ్రీ సంపత్కుమార వర్ధిటివారు ఇందులో 'భావ గణాలు' ఉంటవంటున్నారు.

భావలయతోపాటు 'తూగు' అనే గుణం కూడా ఒకటి ఉన్నదంటున్నారు. ఈ తూగు లయకు పర్యాయపదమో, భావలయలోని ఒకానొక అవాంతరగుణమో వారి మాటలలో స్పష్టపడడములేదు. తూగువంటివే వారు చెప్పే 'ఊపూ', 'విసురూ'అనే లక్షణాలుకూడాను.

వారు చెప్పే మరో గుణం 'గమనవైవిధ్యం'.

**స**మవృత్తాలలోకంటె ఇంద్రగణ సూర్యగణాలుండే వానిలో అసమానపాదాలు ఉండడమూ, అంతకంటే కూడా కందమూ ఆటవెలదివంటివానిలో పాదాలలో అసమానత్వము ఎక్కువగా ఉండుట ముందడుగు అనీ, అంతకంటె ఎక్కువగా పాదాలలో అసమానత్వము వచనకవిత్వము సాధిస్తున్నందున అది మరికొంత ముందడుగు అనీ, శ్రీ సంపత్కుమార సిద్ధాంతం చేసినారు. ధనికుడూ పేదా, పెద్దాచిన్నా భేదాలు రూపుమాపి వర్గరహితమైన సమాజము నిర్మింపవలెనని కలలుకంటున్న ఈ కాలంలో వచనపద్యాలలో పాదాలలో అసమానత్వం ఎట్లా గ్రాహ్యమవుతుందో, అది ఎట్లా నేటికాల లక్షణాన్ని ప్రతిబింబించగలుగుతుందో ఆలోచించినవాళ్లుగాని నిర్వచించినవాళ్లుగాని మా దృష్టికి తగులలేదు. సమాజంలో ఉండగూడని అసమానత్వము కవిత్వరూపంలో ఉండవలెనేమో?

ప్రాచీన ఛందస్సులలో ప్రాచీన సంగీతం గోచరించినట్లే వచనకవిత్వంలో నవీనమైన సంగీతము, పారిశ్రామిక యుగధర్మంగా గోచరిస్తుందని కొందరు ప్రతిపాదించినారు. ఈ మాటలు పెద్దఫాక్టరీ పని చేసేప్పుడు దగ్గరఉండిచూచి వినక, దూరాన సుఖంగా కూచుని, చెప్పేవారికి ఆకర్షకంగా ఉండవచ్చునుగాని, ఫాక్టరీలో పనిచేసే శ్రామికులకుమాత్రము ఆ ధ్వని పిచ్చిఎత్తించకపోదు. పైగా ఆ ధ్వని అసమానంగా కాక అతిసమానంగాఉండే కర్ణకఠోరమైనధ్వనిఅని మనము గుర్తుంచుకోవలె.

ఒక్కరు మాత్రము వచనకవితలో లయ మాత్రమేకాదు, 'నాద'మనేదికూడా ఉన్నదన్నారు. ఆ నాదస్వరూపము వారు నిర్ణయించలేదు. అది ప్రణవనాదమో, వీణానాదమో, సింహనాదమో, దర్దురనాదమో—మరి ఏనాదమో తెలియరాదు.

వచనకవిత్వ సిద్ధాంతవాదులంతా అందులో వచనత్వం విరగవలెనంటున్నారు. ఆ వచనత్వం విరగకపోతే కేవలవచనమై కవిత కాకుండాపోతుందట. కాబట్టి వచనత్వం విరిచే రచనావిధానం ఎవరికివారు ఏర్పరచుకోవలెనట. వారిలో ఒకరు విరామచిహ్నాలు బహిష్కరించడముద్వారా వచనగీతంలో శీఘ్రగమనాన్ని సాధించగా, ఒకరికి అంత్యప్రాస బాగా అక్కరకు వచ్చినదట. మరిఒకరు సంస్కృత శబ్దాలను దొంతర్లుగట్టి నిలపడము, మధ్య పద్యపాదాలను నల్లపూసలమధ్య బంగారుపూసలవలె ఇరికించడమూ, యమకము వాడుకోడమూ మొదలైన బహుపద్ధతుల వల్ల వచనగుణం విరిచినారుట. ఇంకొకరికి సంస్కృత శబ్దబంధురత, కావ్యభాషావాసనా, అందుకు సాధనాలైనవట. మరియొకరు భావచిత్రాల వైచిత్రివల్ల జయము సాధించినారట. ఎవరేమి సాధించినా, వచనత్వము విరిచేపద్ధతి వైయక్తికవ్యవహారమే 'అనేది సారాంశమట.

సామాన్యులకు పద్య రచనా, గేయ రచనా, కష్టమే అని అంగీకరిద్దాము. పోనీ, ఈ వచన కవిత తేలికా అంటే, కానే కాదని వారంతా ఏకగ్రీవంగా అంటున్నారు. పైగా పద్య కవిత్వంకంటే చాలా కష్టమట!

'వచన గీతం రాయడంవరకైతే, ఎవరైనా రాస్తారు, ఎందరైనా రాశారు, గాని రాసి మెప్పించినవారు కొద్దిమంది అని ఎక్కువ మంది అంగీకరిస్తారు' అంటూ శ్రీ రమణారెడ్డి దానికి ఛందస్సహాయంగాని సంగీతసహాయంగాని లేకపోవడం కష్టానికి కారణమంటున్నారు.

వచన పద్య రచన అసిధారావ్రతం అని ఒకరూ, కత్తి అంచుమీద నడకవంటిదని మరొకరూ అన్నారు. వారికందరికీ పట్టుకొన్న భయం ఒకటే. ఒకవైపు జారితే పద్యం కావచ్చు. రెండోవైపైతే వచనం. కేవలం వచనమైతే పేలవం కావచ్చుగాని పద్యమైపోతే కొంపమునిగేదేమిటోమాత్రం అర్థం కావడం లేదు. ఈ ప్రక్రియ వచనానికీ పద్యానికీ దూరంగా ఉండేది కనుకనే కాబోలు వచనకవిత అనే శబ్దము వాడక, కొందరు దీన్ని స్వచ్ఛందకవిత అనీ, ముక్తచ్ఛందో కవిత అని వ్యవహరిస్తున్నారు.

'నిర్మితి విషయమై పద్యకవికంటె కొన్నిరెట్లు ఎక్కువగా వచన కవి శ్రద్ధచూపవళి

ఉంటుంది' అంటూ శ్రీ రమణారెడ్డి ఇంకా ఇట్లా అంటున్నారు. 'ఎవ్వరేమన్నా వచన గీతాలు కుప్పతెప్పలుగా వస్తున్నాయి. పరమ వచనంకూడా కవిత్వమై పోతున్నది. వచనంగా చెడిపోయిన సరుకుకూడా కవిత్వమై పోతున్నది. అంత్యప్రాసలు నిలిపితే వోడలు బండౌతున్నాయి.'

### 3

మరి, చక్కని రాజమార్గాలైన ఛందోగేయ రచన లవలంబించక, వాటిని వదిలి, ఒక నిర్దిష్టమైన విధానము లేక, అగమ్యమైన అరణ్యము వంటిదో, దారిలేని ఎడారివంటిదో ఐన ఈ వచన కవితాప్రక్రియ ఎందుకు వీరు అవలంబిస్తున్నట్లు? ఇంత సూక్ష్మంగా వారెవరూ ప్రశ్నించుకోలేదుకాని మొత్తముమీద దానికి రకరకాలుగా సమాధానాలియ్యడానికి యత్నించారు.

శ్రీ వేగుంట మోహనప్రసాద్ సమాధాన సారమిది. 'అన్నింటిలోనూ అందరిలోనూ ఎల్లెడలా వచ్చిన మార్పు—విప్లవం, ఒకానొకపరి మానసిక వైక్లబ్యం—ఇవన్నీ కారణాలు వచన కవితావిర్భావానికి... అశాంతి, ఆవేదన, కలుక్కుమనే జ్ఞాపకాలు, అసంతృప్తి, ఆక్రోశం, ఉక్రోశం, కసి, నిర్వచనం, సందేశం, ఆశయం, ఆచరణ, విమర్శ—యివీ దీని కవితా వస్తువులు......సాంప్రదాయమైన దుఃఖాన్నుండి విదుల్చుకొన్న కవి ఆత్మనించి జారిపడిన ఒకానొక విశేషం వచన కవిత.'

శ్రీ కుందుర్తి ఇట్లా అంటున్నారు. 'అశేష ప్రజానీకానికీ ప్రయోజనాత్మకమైన ఆనంద కల్పనయే ప్రధానమనే వాదానికి, కనీసం ఈ నవీన యుగంలో బలం ఎక్కువ. ఏ రంగంలోనైనా పాతకూ కొత్తకూ సంఘర్షణ తప్పదు. పాత వోటమీ తప్పదు...ఈ పద్యమే, వృత్తమే తుది స్వరూపమని మాత్రమే అంగీకరించం. దీనికంటే మేలైన రూపం ఏదైనా మనస్సుకు తగుల్తుందేమోననే ప్రయత్నం, కొత్త ప్రయోగం నిరంతరం జరుగవల్సిందే.'

మళ్లీ 'మరిగేయానికి పద్యంలోనే గేయ గుణానికి అతిశయ ప్రాముఖ్యమిచ్చిన భావకవిత్వం అంత్యక్షణాలలో, దానికి 'రియాక్షను'గా ముక్త ఛందోరీతులు వెలువడ్డాయి' అంటారు శ్రీ రమణారెడ్డి.

'యథార్థాన్ని గుర్తించము – కలలు మాకు యథార్థాలు. ఈ జగత్తుతో మాకు పనిలేదు. మాది స్వప్నజగత్తు. సంపన్నులు, భాషా సంపన్నులు మాకు విరోధులు. కావ్యలక్షణాలే అవలక్షణాలు...వ్యాకరణాన్ని వదలిపెడతాము. వ్యక్తావ్యక్తంలో ఈత కొడతాము' ఇత్యాదిగా అపలాపించినాడు శ్రీరంగం నారాయణబాబు. ఛందోరీతులనుగూర్చి గాఢపరిశ్రమ చేసినవారిలో శ్రీ సంపత్కుమార అగ్రశ్రేణిలోనివారు కాబట్టి వారి మాటలకు ఎక్కువ విలువ యియ్యడము న్యాయము. వారి భావముల సారాంశమిది:

'పూర్వకాలం పద్యనియమాలు సడలించడానికి చేసిన ప్రయత్నాల వలెనే, ఆధునిక కాలంలోగూడా మరికొంత విస్తృతమైన అన్వేషణ జరిగింది. భావ కవులు పద్యాలు వ్రాసినా సంగీత స్పర్శవల్ల ఆకర్షణీయమైన గేయస్వరూపాన్ని అధికంగా స్వీకరించినారు. ఆ గేయంకంటెకూడా అధికమయిన సడలింపులుగల మరొక కొత్త ఛందోరీతికోసం ప్రయత్నించడం సహజ పరిణామానికి చిహ్నమే. అలాంటి పరిణామంలోనే గేయాన్నికూడా వదలవలెననే ఊహ ఒక సహజక్రమంలోనే వచ్చింది. అనేక కారణాలవల్ల, అనేక సౌలభ్యాలవల్ల వచన రచనా ప్రక్రియ విపరీతంగా పెరిగిపోయింది. వివిధ శాఖలుగా విస్తరించింది. మిగిలిన అనేక ప్రక్రియలకు వలెనే పాశ్చాత్య సాహిత్య సంపర్కంద్వారా అధికమైన ప్రేరణ ప్రోత్సాహమూ వ్యాప్తీ జరిగింది.'

కొందరు నేటి పారిశ్రామిక యుగధర్మంగా వచన కవిత ఆవిర్భవించిన దన్నారు.

స్వాతంత్ర్యోన్ముఖముగా నేడు సాగుతున్న స్వతంత్ర సమరంలో సర్వబంధాలనుంచీ విడివడ్డదే స్వచ్ఛంద కవిత అని కొందరి మతము.

'పద్యం రైలుబండి నడకవంటిది—
గద్యం విమాన విహారం వంటిది'

అన్నారు శ్రీ శ్రీ. ఆయనే మరొకమాటకూడా అన్నారు.

'గణబద్ధ ఛందస్సులు ఫ్యూడలిజము, మాత్రా ఛ్ఛందస్సులు ప్రజాస్వామ్యం పేరిటి కేపిటలిజము, స్వేచ్ఛా వచనకవిత్వరూపాలు సోషలిజము.'

కాని పై నుదాహరించిన శ్రీ శ్రీ మాటలను 'సమాజ పురోగతిలోని ఒక్కొక్క ఆర్థిక వ్యవస్థకు అనుగుణంగా కవిత్వ బహిస్స్వరూపం ఒక్కొక్క విధంగా ఉంటుందని చెప్పడం చరిత్రను చాలా సులువుగా తేల్చిపారవెయ్యడ'మంటూ 'ఇది శ్రీ శ్రీ అంతటి కవికికూడా సాహసమే ననాలి' అని శ్రీ రమణారెడ్డి త్రోసివేసినారు.

వచన కవిత ఒక ఉద్యమమని అభిమానిస్తున్న శ్రీ కుందుర్తి 'వచనగేయం వర్ధిల్లాలంటే నేటి కవులు కొన్ని నియమాలను పాటించాలి. సమకాలీనమైన జీవితచిత్రణం, తెనుగుదనం, ప్రగతిశీలమైన దృక్పథం, వ్యవహారభాషాపదప్రయోగపరత్వం, చంపూగ్రాంథికబంధవిచ్ఛేదనం, అస్పష్టతాదోష బహిష్కారం అవలంబించవలె'నని ప్రతిపాదించగా శ్రీరమణారెడ్డి కొంత అంగీకరించినట్లే ప్రారంభించి, ఈ లక్షణాలను ఒకదాని తర్వాత ఒకటి కత్తిరించివేసినారు. ఏమైనప్పటికీ పైన శ్రీ కుందుర్తి కాంక్షించిన నియమాలలో ఏవో ఒకటో రెండో ప్రభావితం చేయడమువల్లనే వచన కవిత ఒక్కొక్కరిలో ప్రాదుర్భవించి విస్తరిస్తున్న దనడము సత్యదూరం కాదు.

## 4

కవితారూపంలో కొత్త ప్రక్రియకొరకు జరుపుతున్న అన్వేషణే వచన కవితా రచన అంటే—అది పూర్తిగా సత్యము కాకపోయినా—అంత బాధలేదు. శ్రీ కుందుర్తి వచన కవిత ఎక్కువగా వ్రాయడమే కాక, దానినిగూర్చికూడా ఎంతో వ్రాసినవారు. ఆయనకు కవి ఋషి కావలెననే ఆకాంక్ష ఉన్నది. రచన నాలుగు కాలాలపాటు నిలవవలేనంటే వచన కవులు కొంటె కోణాల వంటివి విసర్జించవలెననీ, ఆధునిక కవికి ఉండవలసిన ముఖ్యలక్షణాలలో చిత్ర కవిత్వంకూడా ఒకటా అని అనుమానం వచ్చేటంతగా అని పెరిగిపోతున్నవనీ, వాటిని ప్రజలు సహింపరనీ బాధ వ్యక్తము చేసిన వారు. ఈ నూతన సృష్టి ప్రజల దృష్టికి రావాలంటే కేవల పండితులను మూర్ఖపండితులని నిరసించక, వారినికూడా ఈ ప్రక్రియను అంగీకరించేటట్లు చేయవలెననే తహతహ కలవారు. అదిగాక తన కవితాసంకలనంచేత సోవియటు లాండు బహుమతిని గత సంవత్సరమూ,ఆంధ్రప్రదేశ సాహిత్యఅకాడెమీవారి బహుమతిని ఈ సంవత్సరమూ గ్రహించినవారు. అట్టి శ్రీ కుందుర్తి 'స్వాతంత్ర్యోత్తరకాలాన తెలుగు కవిత'అనే జనధర్మ 1969 డిసెంబరు ప్రత్యేక సంచికలో 'స్వాతంత్ర్యానంతర కవిత'అనే వ్యాసంలో ఈ క్రిందివిధంగా వ్రాశారు. ముఖ్యంగా ఆ వాక్యాలే వచనకవితాతత్త్వ విచారణ చేయడానికి ఈ వ్యాసకర్తను పురికొల్పినవి.

'స్వాతంత్ర్యానంతర కవిత్వమంటే స్థూలంగా శ్రీశ్రీయుగంలోని కవితావికాసమని చెప్పుకోవచ్చును. ఎందుకంటే పాతపద్ధతికి సంబంధించిన పద్యకావ్యాలు ఎప్పుడూ వస్తూనేవుంటాయి. వాటికి బానిసత్వంతో గాని స్వాతంత్ర్యంతోగానీ అంతగా సంబంధంలేదు. కొయ్యఅచ్చుపెట్టి వినాయకుడిబొమ్మలు వరుసగా తీసినట్లు ఒకేభాష ఒకే భావనతో వెలువడుతుంటాయి. జీవితంలోవచ్చే మార్పులను అవి ప్రతిఫలించవు......సాహిత్యంలో తిరిగి ప్రయోజనవాదాన్ని ప్రవేశపెట్టిన ఘనత శ్రీ వీరేశలింగంగారిది. దీని ఫలితమే శ్రీశ్రీయుగం. ఆనాటినుండి నేటివరకు కవిత్వంలో ప్రయోజనవాదమూ కళావాదమూ—రెండూ ఒకదానివరసనే ఒకటి సమాంతరరేఖల్లా నడుస్తున్నవి......ప్రయోజనవాదము నెగ్గింది కనుకనే భాషలో వ్యావహారికవాదము నెగ్గింది. భావములో అభ్యుదయవాదము నెగ్గింది. రూపములో వచనగేయవాదము నెగ్గింది. అందువల్ల స్వాతంత్ర్యానంతర కవిత్వమంటే వచనగేయ కవితావికాసమన్నమాట.'

పై వానిలో ప్రయోజనవాదమూ, అభ్యుదయ వాదమూ, వచనగేయవాదమూ నెగ్గినవనేసి ముందు విచారణచేసి ఆ తర్వాత పాతపద్ధతికావ్యాలు వినాయకుని అచ్చుబొమ్మలు అనేమాట విచారిద్దాము.

కవితలో శ్రీ వీరేశలింగము ప్రయోజన వాదానికి ప్రవర్తకుడుగదా! ఆయన గతించి ఇప్పటికి 52 సం. లు మాత్రము. ఆయన ఆంధ్ర కవుల చరిత్రనుగూర్చి చేసిన కృషి నేటికీ గౌరవింప బడుతున్నది. కాని అతి బాల్యవివాహాలూ, వితంతు పునర్వివాహాలూ, బ్రాహ్మమతబోధ, సంఘసంస్కరణముకోసము వారు రచించిన కావ్యాత్మక రచనలు ఇప్పటికి ముప్పై ఏళ్లకు పూర్వమే విస్మృతప్రాయాలైనవంటే అతిశయోక్తికాదు. అవి పునర్ముద్రణ జరుగుతున్నవంటే, అందుకు కారణం వాటి సాహిత్యపు విలువకాక ఆ రచయిత వ్యక్తి గొప్పదనముమీది గౌరవము. వారు ఉద్దేశించిన సంస్కరణలు వచ్చిన తర్వాత వారి రచన ప్రయోజనము తీరిపోయి అవి విస్మరింపబడినవి.

శ్రీ శ్రీ యుగము అభ్యుదయ మనే పేరుతో కమ్యూనిజము ప్రచారము ధ్యేయంగా పెట్టుకొన్నది. శ్రీ వీరేశలింగము గారికి ఉన్నంత ప్రతిభగాని పాండిత్యముగాని లోకానుభవముగాని వైవిధ్యముగాని శ్రీ శ్రీకిగాని ఆ యుగములోని మరి యేఒకరికిగాని లేవనడము అతిశయోక్తికాదు. వీరేశలింగంగారు కడపిన నిర్భయ, జీవితముకూడా వీరి కందరికీ అచుంబిత విషయమని మనము గుర్తుంచుకోవలెను. వారికి వ్యక్తిగతముగా లభించిన గౌరవమునల్ల వారి రచనలను పునర్ముద్రణమైనా చేస్తున్నారు.

మరి ఈ అభ్యుదయకవులు కోరిన అభ్యుదయమే ప్రాప్తిస్తే, శ్రీ శ్రీ యుగరచనలగతి ఏమి కాను! వారిలో ఎవ్వరికీ శ్రీ వీరేశలింగముగారికి వ్యక్తిగతముగాఉన్న ఔన్నత్యములేదే! శ్రీ శ్రీ మొదట భావకవిగా 'ప్రభవ' ప్రచురించినాడు. తర్వాత కొన్నాళ్లు అభ్యుదయకవిగా ప్రచారము పొందినాడు. మధ్య కొన్నాళ్లు అధివాస్తవికత ఇత్యాదులైన 'ఇజము'లలో తల దూర్చినాడు. ఇప్పుడు అభ్యుదయ కవులను కాదని విప్లవకవుల సంఘానికి అధ్యక్షుడైనాడు. ఇప్పుడాయన అభ్యుదయ కవిత్వానికి స్వస్తి చెప్పినట్లు భావిస్తే, ఆయన వదలిన అభ్యుదయ కవిత్వము మరి ఎవరికి కావలసిఉంటుంది? కేవల ప్రయోజనాపేక్షగల కవిత్వము శ్రీ కుందుర్తి కాంక్షించేటట్లుగా నాలుగు కాలాలపాటు నిలపలేదు. ఏ కావ్యమైనా దాని కళాలక్షణాన్నిబట్టి చిరకాలము నిలుస్తుంది. ప్రయోజనము అనుషంగికముమాత్రమే.

అభ్యుదయవాదము నెగ్గినదని శ్రీ కుందుర్తి 1969 సం. చివరలోకూడా పట్టుకొని వదలక పై విధంగా వ్రాసినారు. అంతకుముందు 1967 లోనే శ్రీ కుందుర్తి సంపాదకత్వముతో వెలువడిన 'వచన కవిత' అని ఫ్రీవర్సు ఫంటు వారి సంకలన ప్రచురణలోనే శ్రీ వరవరరావు 'స్వచ్ఛంద కవిత్వంలో వస్తువు' అనే వ్యాసంలో శ్రీ శ్రీతో ఆరంభమయిన అభ్యుదయ కవితా ఉద్యమం కవితా వస్తువుకూ, సమాజ చైతన్యానికీ ప్రాధాన్యమిస్తే, అందులోని పాయగానే ఆరంభమైన ఫ్రీవర్సు ఉద్యమం రానురాను ఆధునికుల హృదయాల్లో ఒక స్వతంత్ర ప్రవాహమై తన గమనాన్నే కాదు గమ్యాన్నే మార్చుకున్నది' అంటూ 'ఈనాడు మళ్లీ కవి సమిష్టిలోంచి వ్యక్తిలోకి పోతున్నాడు. సామ్యవాదంనుంచి వైయక్తిక వాదంలోకి పోతున్నాడు. కొన్ని కొన్ని చోట్ల అరాచక వాదంలోకి పోతున్నాడు' అని నిరూపించినారు.

ఇక వచనకవితావాదము నెగ్గినదనేమాట ఉన్నది. ఇప్పుడు పత్రికలలో ముఖ్యంగా యువకులు వ్రాసే కవిత బహుళంగా ఉన్నదంటే ఎక్కువ తప్పు పట్టనక్కరలేదుకాని నేటికాలంలో మంచిపద్యగేయకవితలు వ్రాసేవాళ్లు లేరని కాని – విజ్ఞానశాస్త్రంలో కొత్తసిద్ధాంతము వచ్చినతర్వాత పాతసిద్ధాంతము పరాస్తమయ్యేటట్లుగా—ఈ వచనకవిత్వము ఆవిర్భవించినతర్వాత సృష్టి నుంచీ ఇప్పటికి 30 సం.ల క్రిందటివరకూ పుట్టిన పద్యకవిత గేయకవితా చదివి

ఆనందించేవాళ్లు లేక విస్మృతములయినవనిగాని అవుత వనిగాని శ్రీ కుందుర్తి అభిప్రాయమైతే, వారి కవితాగుణగ్రహణశక్తిని ఏమనాలో తెలియదు. నిజానికి ఆ మాటలకు అదే అర్థమున్నది. వారి ఉద్దేశముకూడా ఆదే ఐఉంటుందనడానికి పాతపద్ధతి పద్య కావ్యాలను వినాయకుని అచ్చుబొమ్మలతో పోల్చడములోనే అభివ్యక్త మవుతున్నది. మా అన్వయమే శ్రీ, కుందుర్తి అభిమానమైతే వారికిగల వచనకవితాభిమానము వారిని అహంభావము తుది అంచులకు తీసుకొనిపోయినదనక తప్పదు.

వారి సంపాదకత్వమున వెలువడిన స్నేహాంజలి ప్రచురణలోనే పై శ్రీ కుందుర్తి అభిప్రాయాన్నే అంతకంటె తీవ్రమైనభాషలో శ్రీ సోమసుందర్ అన్నారు. ఆ మాట లివి :

'త్రిదశత్వం అందుకున్న యీ తరుణంలో ముక్తచ్ఛందకవిత ప్రధాన ఆధునిక కవితావాహికగా స్థిరపడినట్లు కనిపిస్తోంది...అయినా పూర్వయుగ అవశేషాలయిన లాక్షణిక ఛందోబద్ధకవితలూ (మార్గ) మాత్రాచ్ఛంద కవితలూ (దేశి) వెలువడుతూనే ఉన్నాయి.'

పైన ఉదాహరించిన శ్రీ సోమసుందర్ మాటలు శ్రీ కుందుర్తి వాక్యాలకు పైన మేము చేసిన అన్వయమే సరియైనదని బలపరుస్తున్నవి.

## 5

వచన కవితాభిమానులు మాదొక నూతన ప్రయోగమంటే; సహృదయులు కొంత సానుభూతితో దాన్ని పరిశీలించగలరు. కాని ఇది వచ్చినతర్వాత వెనకటి పద్యకవిత్వానికీ గేయకవిత్వానికీ ప్రాచీన యుగావశేషాలుగానేతప్ప స్వయంగా కవిత్వంగా విలువ లేదంటేమాత్రము బుద్ధిమంతులెవరూ సమ్మతించేది కాదు. నాకేదో మెరిసేవస్తువు దొరకగానే—అది గాజుపూసో రత్నమో నిర్ధారణకాకముందే—కూడబెట్టిన రత్నరాశినంతా సముద్రంలోకి విసిరిపారవేస్తానుఅని వ్యవహరించేవానిని ఏమంటామో పేరిసి ఆ పేరుతోనే పిలవవలసిఉంటుంది.

కవిత అనేది మహాసముద్రము. దానిలో మధ్య మధ్య బుడగలూ నురుగుతరకలూ తేరుకొని మెరిపించి మాయమవుతూఉంటవి. అట్లాగే కవిత్వంలో మధ్యమధ్య తలచూపే ఫాషనులుకూడాను. 'పైపై మెరుగుల్ పచరింప దాని దిలకింపంబోరు ధీరోత్తముల్.' వచనకవిత్వము ఇప్పటికి సాధించినది చాలా స్వల్పము. విశేషమేదైనా భావిలో సాధించవలెనంటే ఇటువంటి అహంభావధోరణులు వదలిపెట్టి కార్య దీక్షలో మగ్నులు కావలె.

మాబోంట్లకు వచనమంటే నిరసనములేదు. వేదములో ఎంతో వచనభాగమున్నది. ఉపనిషత్తులు చాలాభాగము వచనమయముులే. అందులో తక్కిన విశేషాలు అట్లాఉంచి కేవల కవిత్వంగా చూచినా మానవమాత్రులు అందుకోలేని మధురోదాత్త భాగాలున్నవి. ఈ వచనకవితావాదులు తమ కవితలో ఉన్నవనే లక్షణాలన్నీ ఆ భాగాలకు అన్వయిస్తవి. కాస్త ఓపికతో వేదవాఙ్మయము తరిస్తే కొత్తదారులు కూడా వారికి దొరుకుతవి.

మరి మనకు సన్నిహితులైన కన్నడ వీరశైవ భక్తుల వచనా లున్నవి. చూడండి. ఈ బసవన వచనము !

'ఎత్తెత్త నోడిద రత్తత్త నీనే దేవ
సకలవిస్తారద రూహు నీనే దేవ
విశ్వతో చక్షు నీనే దేవ
విశ్వతోముఖ నీనే దేవ
విశ్వతోబాహు నీనే దేవ
విశ్వతోపాద నీనే దేవ కూడలసంగమదేవ.'

ఈ అక్కమహాదేవి వచనము చూడండి !

'నెలద మరెయ నిధానదంతె
ఫలద మరెయ రుచి యంతె
శిలెయ మరెయ హేమ దంతె
తిలద మరెయ తైల దంతె
మరద మరెయ తేజ దంతె

భావద మరెయ బ్రహ్మవాగిప్ప
చెన్నమల్లికార్జునన నిలవనారూ అరియ
బారదు.'

ఆంధ్రవచనాలుకాక కన్నడవచనాలు ఉదాహరించడానికి కారణమున్నది. ఆంధ్రములోని వచనాలకూ విన్నపాలకూ తూగుఉన్నదికాని పాదవిభజన లేదని శ్రీ సంపత్కుమార లోపముగా చూపినారు. పై వచనాలకు ఆ తూగూ లయతోపాటు పాదవిభజన కూడా ఉన్నదని చూపుటకే. వేదభాష, పై భక్తుల కన్నడమూ రెండూ వ్యావహారికభాషలనికూడా గమనింపవలె.

వేదర్షులుగాని, వీరశైవభక్తులుగాని వారి భావావేశము ఏరూపములో ఆవిర్భవిస్తే ఆ రూపంలో రానిచ్చారేకాని వచనమే కావలెననిగాని, పద్యమే కావలెననికాని పట్టుదలవల్ల చెప్పలేదు. నేటి వచనకవితాభిమానులకు వారి కవితావిర్భావము వచనంలోనే వస్తూ ఉంటే దాన్నే వాళ్ళు అవలంబించవచ్చు. దానికెవరూ అభ్యంతరపెట్టరు. కాని ఛందోబద్ధమైన కవిత ప్రాచీనయుగావశేషమనిగాని అది వోడిపోయినదనిగానిఅనే సాహసానికి ఒడిగట్టవద్దు! పద్యకవితను అరికట్టవద్దు !

నిజానికి వచనకవితను అభిమానిస్తున్నవారు ఎక్కువభాగము పద్యకవితచెప్పే శక్తిలేక సులభసాధ్యమని ఈ ప్రక్రియ అవలంబిస్తున్నవారే. వారిలో పద్యకవిత కొంత చెప్పగలవారుకూడా ఉత్తమస్థాయి పద్యకవిత చెప్పినవాళ్ళు కారంటే అత్యుక్తికాదు.

కొంతమంది కొత్త ఒకవింతఅని సరదాకు దీన్ని అవలంబిస్తున్నారు.

వచనకవితాభిమానులకు చాలామందికి కావ్యభాష డొక్కశుద్ధిగారాదు. శ్రీశ్రీవంటి ఏకొద్దిమందికో మాత్రమే ఆంధ్రకావ్యభాషమీద అధికారం ఉన్నది. అందువల్లనే అట్టివారు భాషతో ఏమి వేసినా, హర్షించి బ్రహ్మరథము పట్టుతున్నారు తక్కినవాళ్ళు.

లోకంలో కవితా పరిణామము తెలిసినవారు ఈ విధంగా చెబుతారు. మానవుడు ముందు మాట్లాడినది వచనము. అతనికి కవితావేశము కలిగినప్పుడు అప్రయత్నముగా గేయము ఆవిర్భవిస్తుంది. ఆవేశము సంయమముతో పరిణతి పొందినప్పుడు పద్యరూపము ధరిస్తుంది. పద్యరూపము కవితా స్వరూపానికి పరమావధి. వాల్మీకికి అప్రయత్నంగా వాక్కున వెలువడినది గేయాత్మకమైన ఛందస్సు. పాదబద్ధోక్షరసమః తంత్రీలయ సమన్వితః. అది పాఠ్యే గేయే చ మధురంకూడాను. ఛందస్సు అప్రయత్నంగా వాక్కున ఆవిర్భవించినప్పుడు ఉత్తమ కవికి కలిగే ఆనందము శ్రీమద్రామాయణారంభములో వర్ణింపబడినది. శ్రీ సుప్రసన్న 'వచనకవిత—కథాకావ్యం' అన్న వ్యాసంలో ఆధునికకాలంలో బృహత్కావ్యాలు ఎన్నో భాషల్లో వస్తున్నవంటూ, శ్రీ అరవిందుల 'సావిత్రి' మనదేశంలో ఈ కాలంలో వచ్చిన బృహత్కావ్యమని సగౌరవంగా ప్రస్తావించారు. 'సావిత్రి' కావ్యం చివర దానినిగూర్చి అరవిందులు మిత్రులతో జరిపిన ఉత్తరప్రత్యుత్తరాలు ప్రచురించారు. అందులో వారు పద్యరచనలో సందర్భవశాత్తుగా రావలసిన శ్రావ్యతకు ఓజస్సుకు మాటలు, వాటి వరుస, వాటి బరువు ఎంత మెలకువతో వాడుకొనవలెనో ఎంతో విస్తారంగా ప్రదర్శించినట్లు దర్శింపగలము. పద్యమూ గేయమూ వచన కవితా ప్రక్రియతో వోడిపోయినవనే వారికీ అవి ప్రాచీన యుగావశేషాలనే వారికీ ఛందస్సు స్వరూపము అణుమాత్రమైనా తెలియదనక తప్పదు.

పద్యము కూర్చినంతమాత్రముచేత అది కవిత్వమయిపోతుందనే భ్రాంతిమాత్రము ఏ సహృదయునికీ ఉండదు. సత్కవిత్వము ఉచితచ్ఛందోబద్ధమైనప్పుడు రాణించినట్లుగా అది లేనప్పుడంత రాణించదు.

వచన కవితాభిమానులలో అధమ పక్షము ఇద్దరు తాము ప్రయోగిస్తున్నది శిష్ట వ్యావహారికము అనడము మా కంటబడ్డది. అది కొంత ఆశ్చర్యమే కలిగించినది. ప్రజాసామాన్యానికి సమీపంగా తమ కవితను తేదలచిన వారికి భాషలో మళ్ళీ ప్రాచీన యుగావశేషమైన శిష్టత్వముకూడా ఎందుకా అని

పించింది. తమ వాదన హేతుబద్ధముగా ఎక్కడికి నడిపిస్తే అక్కడికి పోవడానికి వెనుకాడే భీరువు లన్నమాట, వారు!

ప్రజాసామాన్యానికి సన్నిహితము కావడానికి వ్యావహారిక భాష గ్రహించినామంటున్నారు, వీరు. ఈ వ్యావహారిక భాషకు పద్యకవిత్వము నప్పడము లేదనీ, గేయము అంతకంటె కొంచెము నయమనీ, వచనము పూర్తిగా అనుకూలిస్తుంది గనుక వచన కవిత స్వీకరించామనీ కొందరంటున్నారు. కావచ్చు కాని పద్యరూపము కవితా రూపానికి పరమావధి అని పైన ప్రతిపాదించిన దాన్నిబట్టిచూస్తే, వారికి రెండు లోపాలలో ఏదో ఒకటి ఆపాదిస్తుంది. ఆంధ్ర వ్యావహారిక భాష పద్యకవిత్వానికి అనుకూలించ దంటే, భాష సంపన్నము కాదనవలసివస్తుంది. తాము వ్యావహారికాంధ్రములో పద్యాలు వ్రాయ లేకున్నామంటే కవుల అశక్తత ఒప్పుకోవలసి వస్తుంది. రెండూ ఏమంత గౌరవప్రదమైనవి కావు. ఈ రెండింటిలో ఏది వాస్తవమైనా వ్యావహారిక భాషనూ వచన కవితనూ వదిలివేయవలసివస్తుంది.

'ఛందస్సుకీ, వ్యాకరణానికీ, అలంకారాలకీ అన్నింటికీ అవతల స్వచ్ఛమూ, స్వచ్ఛందమూ, నీరవమూ, నీరూపమూ అయిన కవిత్వ పదార్థం ఒకటి ఉంది. ప్రతికవీ దాన్ని అందుకోడానికే ప్రయత్నిస్తాడు' అని శ్రీ శ్రీ ఆంధ్ర శిల్పిలో వ్రాసినట్లు శ్రీ కె. వి. రమణారెడ్డి 'వచన కవిత' అనే వ్యాసంలో అనుమోదన పూర్వకంగా ఉదాహరించినారు.

నిజమే. కవిత్వము కేవల చ్ఛందస్సుకూ వ్యాకరణానికీ అలంకారాలకీ అవతలఉండే అవ్యక్తపదార్థ మన్నంతవరకు సత్యమేకాని అది నీరవమూ నీరూపమూ మాత్రముకాదు. నీరవమైనది వినబడదు. నీరూపమైనది కనబడదు. కవిత్వము శబ్దస్వరూపంలో ఆవిర్భవించి నప్పుడే కవిత్వశబ్దవాచ్య మవుతుంది. అప్పుడది వ్యాకరణ బద్ధంగానూ ఉంటుంది. ఛందోబద్ధంగానూ ఉండితీరుతుంది. వచన కవితాభిమానులుకూడా అసలు చ్ఛందస్సును వదలడము లేదుగదా! అలంకారాలన్నారూ సత్కవిత్వము ఎప్పుడైనా నిరలంకృతిగాకూడా ఉండవచ్చుగాని, తరుచుగా అలంకారంతోకూడే ఉంటుంది. ఉత్తమకవితలో ఆ అలంకారాలలోకూడా నేటి వచనకవితలో ప్రచురంగా ఉంటున్న శబ్దాలంకారాలుగాక ఎక్కువగా అర్థాలంకారా లుంటవి.

## 6

ఇతర భాషలలోవలెనే ఆంధ్రభాషలో కూడా కాలాంతరాలలో బాహ్యరూపాలలో కొత్తకొత్త రూపాలు అవతరింపజేయడానికి ప్రయత్నాలు జరుగకపోలేదు. తిక్కనసోమయాజులయంతవాడు ఉత్తరరామాయణము నిర్వచనముగా వ్రాసినాడు. కాని ఆ విషయంలో ఎక్కువమంది అనుసరించలేదు. ఆయనే మహాభారత రచననాటికి నన్నయ ప్రారంభించిన చంపూపద్ధతికి తిరిగి వచ్చినాడు.

ఆ తర్వాతనో కొంచెముముందో, పాల్కురికి సోమనాథుడు అనేకరూపాలలో నూతన ప్రక్రియలు అవలంబించాడు. వాటిలో పంచప్రకారగద్య ఒకటి. నిజానికి అది గద్యకాదు, రగడాభేదము. ఆయనకు పూర్వం విస్తారంగా దేశియవాఙ్మయంలోఉన్న ద్విపదను సంస్కరించి దీర్ఘకావ్యాలకు వాహకంగా అనుసరించినాడు.

'తేట తెనుంగున ద్విపద రచింతు......'
'దేశిగా నిలిపి...ద్విపదలు రచియింతు'

'ఒప్పదు ద్విపదకావ్యోక్తి నా వలవ
దారూఢ గద్యపద్యాది ప్రబంధ
పూరిత సంస్కృతభూయిష్ఠ రచన
మానుగా సర్వసామాన్యంబుగామి
జానుతెనుగు విశేషము ప్రసన్నతకు...'

అని మొదలుగా నేటి వచనకవులు నేడు చెబుతున్న వాదభావాలే కొన్ని ప్రదర్శించినాడు. కొంతకాలము ఆంధ్రకవులకు అభిమానపాత్రమై ద్విపదరచన ఒక మోజుగా సాగింది. అందులలో నడకలలో ఎంత వైవిధ్యము ప్రవేశపెట్టినా, దీర్ఘకావ్యాలలో విసుగు పుట్టడము తప్పనిసరికావడంతో, ఆ ద్విపద షోజు వెనకబడ్డది.

మళ్లీ 16 వ శతాబ్దము ఉత్తరార్థంలో కొత్తదనముకోసము అన్వేషణ మొదలైనది. పింగళి సూరన మూడు కావ్యాలలో మూడు మార్గా లవలంబించినాడు. రామరాజభూషణుడు కొత్తదారులు అవలంబించినాడు. ఐనా వాటి అన్నిటిలో వసుచరిత్రకు వచ్చిన జనామోదము మరి దేనికీ రాలేదు.

ఆ ప్రాంతాలలోనే పొన్నెగంటి తెలగన్న అచ్చ తెనుగు కావ్యరచన ఆరంభించాడు. ఆ కాలంలోనే నిరోష్ఠ్యరచన లారంభించినవి. ఇంకా చిత్రవిచిత్ర రచన లారంభించినవి. ఐనా అవి అన్నీ బుద్ధికే చమత్కారావేశము కలిగించినవికాని హృదయస్పర్శిగా ఉండలేకపోయినవి.

తాత్కాలికంగా ఆంధ్రకవిత పట్టిన ఆ పెడ దారులకు విరుద్ధంగా ఈ శతాబ్ది ఆరంభంలో నేడు భావకవిత్వ మనబడేది వెలసినది. అందులో రూపములో పెద్దమార్పులేదు. ప్రాచీనులు వాడిన గణ మాత్రాఛందస్సులే వాడినారు. ఎవరి ప్రతిభకొద్దీ, పెద్దవీ, చిన్నవీ కావ్యాలు వారు వ్రాసినారు. వారెప్పుడూ కవితాప్రకృతిని నిరసించలేదు. అందువల్లనే ఈ శతాబ్దారంభంనుంచీ పుట్టిన ఉత్తమకవిత భావ కవు లనబడేవారిలోనే ఆవిర్భవించిందికాని ఇతరత్ర కాదు.

ఆ తర్వాత ఫ్యూచరిజము ప్రభావమువల్ల శ్రీ శిష్ట్లా ఉమామహేశ్వరరావు ఎన్నో పిల్లిగంతులు వేసి చూపినాడు. ఎన్ని అపమార్గాలనుసరించినా అతడు కవితాత్మకలవాడు కనుక అతని రచనలు మధ్య మధ్య హృదయానికి ఆహ్లాదము కలిగిస్తవి.

ఆ తర్వాత ఎన్నో ఇజములు ఆంధ్రదేశములో వ్యాప్తిలోకి వచ్చినవి. అందులో ముఖ్యమైనది కమ్యూనిజము. ఏ ఇజమునకు ఐనా కవిత్వ స్పర్శ కలదేమో గాని, కమ్యూనిజము మాత్రము కేవల రాజకీయ సంబంధి. అభ్యుదయ కవులనేపేరుతో కమ్యూనిజము భక్తులు దాని ప్రచార సాహిత్యము వెదజల్లినారు. ఆ రచనలు ఏమైనా కావచ్చు గాని, సహృదయుల కానందము కలిగించే కవిత్వకోటిలో ఎన్నదగినవి కాదు.

నేడు వచన కవిత సరికొత్త మోజు! అది తత్త్వమూ కాదు, ఉద్యమమూ కాదు. అది ఎక్కువ భాగము ఆదిప్రాసల అంత్యప్రాసల, మాటల విరుపుల, అసమాన పాదాల, మాటల పోటీల గారడీగానే ప్రధానంగా సాగుతున్నది. అది ప్రయోగ దశను ఇంకా అధిగమించలేదు.

అచ్చులో తీసిన వినాయకుని బొమ్మలవంటివని శ్రీ కుందుర్తి, ప్రాచీనయుగ అవశేషాలని శ్రీ సోమ సుందర్ ఈసడించిన లాక్షణిక ఛందోబద్ధ కవితలూ మాత్రాచ్ఛంద కవితలూ పూర్వమూ వచ్చినవి, ఇప్పుడూ వస్తున్నవి, ముందూ వస్తవి. నాలుగుకాలాల పాటు నిలిచే రచనలు కూడా ఎక్కువభాగము వాటిలో నుండే వస్తవనీ కవులూ సహృదయులూ మరవరాదు. కవి వృషభులు అనాదిగా లోకమంతటా అన్ని భాషలలో అన్ని కాలాలలో అవలంబించి సంపుష్టము చేసినది ఛందోమార్గము. డా. పాటిబండ మాధవశర్మ 'ఛందశ్శిల్పము' అని ప్రచురించిన సిద్ధాంత గ్రంథము తిరగవేయడానికైనా వీరు ప్రయత్నిస్తే బాగుంటుంది. అందులోని ప్రారంభ ప్రార్థనతో దీన్ని పరిపూర్ణము జేతాము.

'శిల్పం ఛందోమయం యస్య
నానావృత్త మిదం జగత్
శాంతః చంద్రకళాకాంతః
పాతు మాం స బుతధ్వజః.'

# తిరుపతి వెంకటకవులు : "సరస్వతి" పత్రిక

## శ్రీ నిడుదవోలు వెంకటరావు

తిరుపతి వెంకటకవుల కవితా సరస్వతి ఆంధ్ర సాహిత్య ప్రపంచమున చిరస్థాయియైనది, 'సరస్వతి' పత్రికా మూలముననే యనుట యతిశయోక్తి కాదు. ఆ పత్రికాధిపతి

'సరస్వతీ సంపుటములను చేతఁబట్టుకొని కంటి జోటితో ముందునకుఁ బోవుచున్న యా భాషా పోషక తేజమే బ్రాహ్మణ ప్రభునిదో పరిశీలించితిరా' అన్న పానుగంటివారి సాక్షి సూక్తికి నిదానమైన పోలవర సంస్థానాధిపతి శ్రీ రాజా కొచ్చెర్లకోట రామచంద్ర వేంకటకృష్ణారావు (1872—1919). 1ఈయన యొక పుష్కరకాలము (1900-1912) తిరుపతి వేంకటకవులను తన యాస్థానమున నిలుపుకొని, వారి రచనలను తన సరస్వతి పత్రికయందు ముద్రించి ప్రకటించెను. తిరుపతి వేంకటకవుల సాహిత్య జీవితములో 'సరస్వతీపత్రిక—వేంకటకృష్ణారావు' ప్రధానఘట్టము. అయితే యింత వఱకు తిరుపతి వేంకటకవులను గూర్చిన గ్రంథములలోగాని వ్యాసములలోగాని—ఈ సరస్వతిపత్రిక ప్రస్తావనగాని,వేంకటకృష్ణారావుగారితోగల సంబంధముగాని వివరింపబడియుండ లేదు. ఈ నాటి వారికివి పూర్తిగా నపరిచితములు కావడముచేత, వానినిగూర్చి తెలుపుచున్నాను.

### ప్రథమదశ — అవధానదశ

తిరుపతి వేంకటకవుల సాహిత్య జీవితములో ప్రథమ దశ—అవధానదశ. వారిరువురు చర్ల బ్రహ్మయ్యశాస్త్రిగారియొద్ద విద్యాభ్యాసము పూర్తి చేసిన వెనుక—అవధానములు చేయుటయే ప్రారంభించిరి. వారు ప్రప్రథమముగా కాకినాడలో తే 25—10—1891 దిని సంపూర్ణ శతావధానము చేసిరి.3 ఆ వెనుక మరి పదేండ్లు—అనగా క్రీ. శ. 1900 వఱకును, తెలుగు దేశమున నవధానయాత్రలు గావించి, ఆ సంవత్సరమున — పోలవరము జమీందారుగారైన—కొచ్చెర్లకోట వారి సంస్థానమున ప్రవేశించిరి.

### ద్వితీయదశ - గ్రంథ రచనాదశ

వెంకటకృష్ణారావుగారి యాస్థానమున ప్రవేశించిన నాటనుండి తిరుపతి వేంకటకవుల గ్రంథరచన మొదలిడినదని చెప్పవచ్చును. వారు తమ బుద్ధచరిత్ర వారికి కృతి యిచ్చుచు నిట్లు విన్నవించినారు.

---

1. ఈయన క్రీ. శ 1919 లో మరణించినపుడు తిరుపతి వేంకటకవులు 'కృష్ణారాయ నిర్యాణము' అను తమ పద్యములచేత, తమ పోషకుని యందుండెడి యనుపమాన కృతజ్ఞతను వెల్లడించిరి. అవి 1920 ఆంధ్రపత్రిక సంవత్సరాది సంచిక యందు ప్రకటితమైనవి.

2. తిరుపతి కవుల సాహిత్య పమీక్ష. (చూ. నా భారతి సమీక్ష 1966 సెప్టెంబరు అక్టోబరు సంచికలు.)

3. ఇంతవఱకు నెవ్వరికిని లభ్యముగాని యీ ప్రథమ శతావధాన పద్యములను సంపూర్ణముగా ప్రకటించియున్నాను.

'తిరిగితి మెల్లదేశము లదేపనిగా నికమీద దేశ సం
చరణ మొనర్పఁగా వినుగు చాల మనంబునఁ దోచె
వయ్యా నీ
తిరుపతి వెంకటేశ కవి ధీరుల నొక్కెడ నుండఁ
జేసి భూ
వర! సభలందు ఖ్యాతిని నవశ్యముఁ జెందుము కృష్ణ
భూవరా!'[4]

వేంకటకృష్ణారావుగారును తమకు సరస్వతి పత్రిక యొకటి యున్నందున తిరుపతి వేంకటకవుల చేత గ్రంధములు రచియింపజేసి వానిని ప్రకటించుటకు నిశ్చయించిరి. ఆ పత్రిక నెల కొకమాటు వెలువడు చుండెడిది. అందు ప్రాచీన ప్రబంధములు[5] తప్ప, వచన రూపకములైన వ్యాసములు, విమర్శలు నుండెడివి కావు. కేవలము ప్రాచీన ప్రబంధములేకాక, నవీన కవి రచనలున్న గాని పత్రిక వ్యాప్తిలోనికి రాదని తలంచి, వేంకటకృష్ణారావుగా రప్పటికే, తెలుగు ప్రజలను తమ యవధానాదికములచే నాకర్షించిన తిరుపతి వేంకటకవుల రచనలను ప్రకటింప నిశ్చయించిరి. అ రచనలు, ప్రతి నెల పత్రికలో— వెలువడగా, గ్రంధము పూర్తి కాగానే చందాదారులకు వారు పంపుచుండిరి. దీనివలన—పత్రిక ప్రతినెల వెలువడుటకు తగినన్ని రచనలు (చెళ్లపిళ్లవారి పరిభాషలో 'మేటరు') నుండెడివి. గ్రంధము ముద్రణ మయ్యెడిది. అచ్చుపడినవి చెల్లవనుమాట లేకుండ కొన్ని గ్రంధములు చందాదారుల మూలమున చెల్లుబడి యగుచుండెడివి. పద్యకావ్యములకన్న నాటకము లాకాలమున ప్రజారంజకములుగా నుండుటచేత, తిరుపతి వేంకటకవుల పాండవ నాటకములు చాలవఱకీ పత్రిక లోనే ప్రకటితములైనవి.

### వేంకట కృష్ణారావుగారితో ఏర్పాటు

పత్రికాధిపతులు తమకు తిరుపతి వేంకటకవుల యవధాన నైపుణ్యము తెలిసియుండుటచేత, వారి యవధాన ప్రదర్శనముల కాటంకము లేకుండగను, గ్రంథ రచన సాగునట్లుగాను, నీ క్రింది యేర్పాట్లు చేసిరి. అవధానములు చేయుట కితర ప్రదేశములకు వెళ్ళునప్పుడు వారిరువురును కలిసి వెళ్ళవచ్చును. కాని వారిలో నొకరు— శ్రీ దివాకర్ల తిరుపతిశాస్త్రిగారు మాత్రము పత్రికా కార్యస్థానమున నుండవలెను. వారిరువురు గ్రంధ రచన చేయుచుండవలెను. గ్రంధ రచనయే గాక, ప్రాచీన గ్రంధ పరిష్కరణము చేయుచుండవలెను.

వెంకటశాస్త్రిగా రప్పుడప్పు డితర ప్రదేశములకు వెళ్లినను, తిరుపతిశాస్త్రిగారు పత్రికాధిపతిగారితోనే యుండువారు. వారిరువురకు నెంతయో మైత్రి యుండెడిది.[6] వెంకటకృష్ణారావుగారే పత్రికా సంపాదకులు. అయినను, అప్పుడప్పుడు తిరుపతిశాస్త్రిగారు సంపాదకులకు బదులుగా వ్యవహరించేవారు. దీనికి ప్రమాణముగా నొక యుదాహరణ చూపుచున్నాను.

సరస్వతి సంపుటము. 11. సంచిక 4.
ఏప్రియలు 1910
స్వ వి ష య ము

'ఇకముందు సరస్వతి సకాలమునం బ్రచురించుటకుఁ దగిన యేర్పాటులు చేయబడును. గత సంచిక లన్నియు సకాలములో సంవత్సరమునకు లోపుగానే ప్రకటించుటకుఁ బ్రయత్నింతుముకావున నిరుత్సాహులు గాక భాషాభిమానులందఱు బ్రోత్సాహము గలిగింతురు గాక.

---

4. ఈ పద్యము ముందుదాహరించినాను.

5. ఈ పత్రికలో ప్రకటించిన ప్రాచీన ప్రబంధముల విశిష్టతను గూర్చి నా యీ క్రింది ఆంగ్ల వ్యాసము చూడనగును. (Literary Journalism in Narla Shashtyabdapurti Commemoration Volume. History of Telugu Journalism.)

6. వేంకటకృష్ణారావుగారు, తిరుపతిశాస్త్రిగారు కాకినాడలో స్థిరముగా నివసించుటకు, నొక వసతిని గూడ నిచ్చిరనియు తిరుపతిశాస్త్రిగారి కుమారులు శ్రీ వేంకటావధానిగారు తెలిపిరి.

దివాకర్ల తిరుపతిశాస్త్రి శతావధాని
ఫర్ ఎడిటర్.

ఈ సరస్వతీ పత్రికకు మొదటినుండియు మేనేజరై, చక్కని సద్గుణంబులును, ప్రభుభక్తియు తద్విశ్వాసార్హత్వమును గలిగి యుండుటంజేసి శ్రీ సరస్వతీ పత్రికాధిపతుల నిందు దయకుఁ బాత్రులైన శ్రీ కొత్తపల్లి సూర్యారావుగారు రెండు మూఁడేండ్లనుండియు, దేహారోగ్యముచేఁ బీడితులయ్యు, సత్స్వత్వాభిమానంబునను తదధిపతులకుంగల గౌరవమువలనను విడువఁజాలక యట్లే పనిసేయుచుఁ గాలముఁ గడపిరి. కాని మఱియు నస్వస్థులగుటవలనఁ దత్కార్యతంత్రము నెఱవేర్చుట కసమర్థులై యౌషధ సేవచేయుచుఁ గొన్ని దినములు విశ్రమించుచున్నారు. సరస్వతి ప్రచురించిన ప్రాచీనాంధ్ర ప్రబంధములన్నియు నేను సవరించి చెప్పగా వ్రాసి యచ్చొత్తించె. క్రమక్రమంబుగా సంస్కృతాంధ్రములయందును, హిందూస్థానీయందును, ద్రావిడ భాషయందును గూడ పాండిత్యము సంపాదించి, సంస్కృతద్రావిడ హిందూస్థానీ భాషాంతరీకరణములు కొన్నియు నాంధ్ర భాషాగ్రంథములు కొన్నియు రచించె. తగుమాత్ర మాంగ్లేయ భాషయందుఁగూడఁ బరిచయము సంపాదించె. ఇట్టి పాండిత్యము సద్గుణంబులుగల మేనేజరు లేకపోవుట సరస్వతికొక కొఱంతయేగాని యట్టి లోపము లేకుండ సరస్వతియే యనుగ్రహించుగాత. భగవంతుఁ డచిరకాలములోనే వారి సూర్యారావుగారి కారోగ్యము ప్రసాదించుఁగాత.[7]

దివాకర్ల తిరుపతిశాస్త్రి శతావధాని.'

## ప్రాచీనగ్రంథ పరిష్కరణము - తిరుపతిశాస్త్రి

ఈనాటివారికి తిరుపతిశాస్త్రిగారిని గూర్చి తెలియని విషయములలో నిది యొకటి. పై యుదాహరణమువలన తిరుపతిశాస్త్రిగారు ప్రాచీన గ్రంథములను సవరించేవారని తెలియుచున్నది గదా. వారు సవరించిన ప్రాచీనాంధ్ర కావ్య ప్రబంధములు చూడుడు.

1. మార్కండేయ పురాణము—మారన.
2. హరవిలాసము—శ్రీనాథుడు.
3. కేయూరబాహు చరిత్ర—మంచెన.
4. నిరంకుశోపాఖ్యానము—రుద్రకవి.
5. కకుత్స్థ విజయము — మట్ల అనంత భూపాలుడు.
6. కువలయాశ్వ చరిత్ర — సవరము చిన నారాయణ నాయకుడు.
7. పార్వతీ పరిణయము — తొండమాన్ మహీపాలుడు.
8. బహుళాశ్వ చరిత్ర — దామెర వెంగళ భూపాలుడు.
9. గంధవహము. మంచెళ్ల వాసుదేవకవి.
10. రంగనాథ రామాయణము—ఉత్తర కాండము ద్విపద. కాచవిభుడు విఠలరాజు.

---

7. ఆంధ్రపత్రికాప్రపంచమున — కొత్తపల్లి సూర్యారావు (1873—1940) గారి కున్నంత యనుభవము మఱియొకరికి లేదని చెప్పవచ్చును. ఆదిని గురుజాడ శ్రీరామమూర్తిగారి రాజయోగి పత్రికతో క్రీ. శ. 1890 లో ప్రారంభమై, సరస్వతి పత్రికలో పండ్రెండేండ్లు, ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రికలో — ముప్పదేండ్లు — మొత్తమర్థ శతాబ్దము వీరి జీవితము గడచినది. ఈయన బహుభాషావేది. బహుగ్రంథ నిర్మాత. సర్వాంధ్ర సాహిత్య వేత్తల నెఱిగినవాడు. అయినను నవ్యాంధ్ర సాహిత్య చరిత్రలలో నీతని పేరే కానరాదు.

సూర్యారావుగారు క్రీ. శ. 1893—1895 ప్రాంతములలో గురుజాడ శ్రీరామమూర్తి పంతులు గారి మూలమున, నా తండ్రిగారైన సుందరము పంతులవారి యొద్ద పూర్వగ్రంథములు వ్రాయుటకు లేఖకులుగా నుండేవారు. ఈ విషయము, మంజువాణి పత్రికాధిపతులు కీ. శే. నందిరాజు చలపతిరావుగారు గ్రంథస్థము చేసినారు.

11. వాల్మీకి చరిత్ర—రఘునాథ నాయకుడు.

సరస్వతీ పత్రికలో ప్రకటింపబడిన పై పది కొండు ప్రాచీన కావ్యములేగాక ఆ పత్రికాధిపతులు ప్రత్యేకముగా ప్రకటించిన 1. విజయ విలాసము 2. పెద్దాడ నాగరాజుకవి ప్రణీత శకుంతలా పరిణయము—అను రెండు ప్రబంధములు తిరుపతిశాస్త్రి గారే సవరించిరి. సరస్వతిలో ప్రకటితములైన ప్రాచీన ప్రబంధములన్నియు తాళపత్రములనుండి వ్రాయింప బడినవేగాని అంతకు ముందచ్చైనవికావు. దీనినిబట్టి తిరుపతిశాస్త్రిగారి ప్రాచీన గ్రంధ పరిష్కరణ సామర్థ్యమెట్టిదో విశదము కాగలదు.

పై వానిలో

5. కకుత్స్థ విజయము (1905)
6. కువలయాశ్వ చరిత్ర (1906)
7. పార్వతీ పరిణయము (1907)[8]
8. బహుళాశ్వ చరిత్ర (1908)
9. గంధవహము (1911)
10. రంగనాథ రామాయణోత్తరకాండ (1911)

తిరిగి ముద్రితములు గానేలేదు. పైవన్నియు మంచి విలువగలవి.

పూర్వ ముద్రణ ప్రబంధముల కిప్పటివలె పీఠిక లుండెడివి కావు. స్వల్పముగా గ్రంధమునుగూర్చి కవినిగూర్చి ఒకటి రెండు పుటలలో నుండెడివి. ఈ నాడు గ్రంథములకంటె పీఠికలకే విలువహెచ్చు. ఆనాడు మూల గ్రంధములకే ప్రాధాన్యము. గ్రంధస్థ విషయములనుగూర్చి కూలంకష వ్యాసంగము జరిగి, విమర్శలు ప్రత్యేకముగ వెలువడుచుండెడివి. అందువలన మన ప్రాచీన సాహిత్యముతో మన సంబంధ మవినా భావమై, ఆ సాహిత్య విశిష్టత గ్రహించుటకు వీలైనది. ప్రస్తుత పీఠికలలో గ్రంధమునుగూర్చిగాక వాఙ్మయ చరిత్రగూర్చి, కవులనుగూర్చి చారిత్రక విషయములు ప్రధానములై సాహిత్య విషయము విస్మృతమైనది. ఈ హేతువుచేత—సాహిత్య ప్రపంచమున విమర్శ ఉత్తమస్థాయినందక, అవ్యవస్థిత మైనది. ఈ పరిస్థితిని పత్రికా నిర్వహణమున అనుభవజ్ఞులైన పెద్దలు గ్రహించి హెచ్చరించుచునే యున్నారు.

## సరస్వతి పత్రిక-

## తిరుపతి వేంకటకవుల స్వంత రచనలు

తిరుపతి వేంకటకవుల స్వంత రచనలన్నియు మొదట సరస్వతీ పత్రికలోనే ప్రకటింపబడినవి. వాని వివరములు.

### నాటకములు - అనువాదములు

1. బాలరామాయణము— రాజశేఖరుని కృతి కనువాదము. 10 అంకములు. ఈ నాటకము వీరు తప్ప మఱియెవ్వరును నేటివఱకు తెలిగింపలేదు. వీరే ప్రథములు, కడపటివారు.

2. మృచ్ఛకటిక—శూద్రక రచితము. వీరికి ముందు క్రీ.శ1881లో వావిలాల వాసుదేవశాస్త్రిగారు దీనినాంధ్రీకరించిరి. వారిది ప్రథమానువాదము—కావున నిది రెండవ యనువాదము.

3. ముద్రారాక్షసము - విశాఖదత్తుని రచన— ఈ నాటకమునకు మొదటి యనువాదము సుసర్ల అనంతరావుగారిది (1890). వీరిది రెండవది. స్త్రీ పాత్రలు లేని నాటకము.

---

8. ఈ రసవత్ ప్రబంధము దక్షిణదేశమున పుదుక్కోటనేలిన రఘునాథ తొండమాన్ ప్రణీతము. రాజకవులలో ప్రథముడైన నన్నెచోడుని వెనుక రాజకవులలో కడపటివాడైన నీతడు రచించిన పార్వతీ పరిణయము— కాళిదాస నన్నెచోడుల ననుసరింపక నూతన భావములతో నున్నది. వెంటనే పునర్ముద్రణ మందదగిన ప్రశస్త కృతి. (దీనినిగూర్చి కీ. శే. ఏలూరిపాటి రామభద్రయనులుగారి వ్యాసము. కీ. శే. మాడపాటి హనుమంతరాయని షష్ఠి పూర్తి సంచికలో గలదు. 1945).

## స్వ తం త్ర ము లు

1. ఎడ్వర్డు పట్టాభిషేక నాటకము
2. పాండవ జననము
3. పాండవ ప్రవాసము— (ఇవి ప్రథమముగా నిందే ప్రకటితములైనవి.)
4. పాండవోద్యోగము
5. పాండవ విజయము
6. పాండవాశ్వమేధము

## వ చ న కా వ్య ము లు

1. విక్రమాంకదేవ చరిత్ర-బిల్హణకృతి కను వాదము-దీని నీ తరువాత నెవ్వరు వచనముగ రచియింప లేదు.[9] 1913లో ఎఫ్. ఏ. పరీక్షకు పఠనీయము.

2. చంద్రప్రభ చరిత్ర—వీరనంది రచితము. జైనతీర్థంకరుని చరిత్ర.

3. హర్షచరిత్ర—బాణునికృతి కనువాదము.

పైని వివరించినవన్నియు సరస్వతిపత్రికయందు ప్రకటితములైనవి. ఇవిగాక, తిరుపతి వేంకటకవుల స్వంతరచన లీ క్రిందివి క్రీ. శ. 1911 నాటికి ముద్రితమ్మైనవి.[10] సరస్వతిమూలమున ప్రకటితము లైనవి.

## ప ద్య కా వ్య ము లు

1. శ్రవణానందము—1911 నాటికి మూడవ ముద్రణము. ఈ రసోత్తరకృతికి మూడు నాల్గేండ్లలో వేలకొద్దీ ప్రతులు చెల్లినవి.

2. లక్షణా పరిణయము—ఇతర లక్షణా పరిణయములకన్న విలక్షణమ్మైనది. కవిత్వము సలక్షమ్మైనది.

3. పాణిగృహీత—శ్రవణానందమునకు తీసి పోనిది.

4. రసికానందము—కాళిదాసు శృంగార తిలకమునకు తెలుగు.

5. శుకరంభాసంవాదము — మొదట వీరు సంస్కృతమున రచించి తరువాత తెలుగు చేసిరి.

6. శనిగ్రహము—27 పద్యములు.

7. గ్రామసింహము — భారతకథ, చిన్నపద్య కృతి.

8. బుద్ధచరిత్ర — ఇది బుద్ధునిగూర్చిన తెలుగు కృతులలో మొదటిది.[11]

9, దేవీ భాగవతము — మొదటి నాలుగు స్కంధములు.

## నా ట క ము లు

1. సుకన్య
2. దంభవామనము
3. అనర్ఘనారదము

} ఈ మూడు కథలను నాటకములుగా వ్రాసిన వారిలో వీరే ప్రథములు.

## ప్ర హ స న ము లు

1. పల్లెటూళ్ల పట్టుదలలు—(ఇది మంజువాణిలో తొలుత ప్రచురింపబడినది.)
2. అపూర్వ కవితావివేచనము.
3. స్కూలు పిల్లల పార్టు.

} ఇవి రెండు నొక్కే గ్రంథము.

## శ త క ము లు

1. కామేశ్వరీ శతకము.

## అ వ ధా న ము లు

1. శతావధానసారము —
2. నానమామల్లై శతావధానము.
3. మైలవరపు శతావధానము.

---

9. శిరోమణి శ్రీ కప్పగంతుల లక్ష్మణ శాస్త్రిగారు విక్రమాంకదేవచరిత్ర హృద్యపద్యకావ్యముగా రచించి, 'ఆంధ్రబిల్హణ'అను బిరుదము పొందినారు. దీని యవతారికా శ్లోకములను నేను పద్యములుగా ననువదించి, క్రీ. శ. 1934 లో కల్యాణి పత్రికలో ప్రకటించినాను.

10. ఇవి యన్నియు బందరు భైరవప్రెస్సున ముద్రితమ్మైనవి.

11. చూ. పరిశోధన-బుద్ధజయంతి సంచిక-'ఆంధ్ర బౌద్ధవాఙ్మయము' అను నా వ్యాసము.

## వివాద గ్రంథములు

1. పాశుపతము — శతఘ్ని విమర్శనకు ఖండనము.

2. గీరథము—ఆనాడు—ఈ గ్రంథకర్తలు రచించిన సర్వగ్రంథములకు శిరోభూషణము' అని ప్రసిద్ధిగన్నది.

## సంస్కృతము

1. కాశీ స్వప్నము.

2. అష్టకములు.

పై వివరాలీనాటి వారికి అనావశ్యకములుగా తోచవచ్చును. కాని వాఙ్మయ చరిత్రకారులకు, విమర్శకులకు అత్యావశ్యకాలు. వీనివలన తిరుపతి వేంకట కవుల కవితా వ్యాసంగము గ్రంథ రచనా పటిమయేగాక సాహిత్య జీవిత క్రమపరిణామము తెలియుచున్నది. మఱియు పై వివరాలీ తరువాత ఆ గ్రంథములు పునర్ముద్రితములైనప్పుడు లేనేలేవు.[12] కాబట్టియే ఇందుచేర్చినాడను. ఇంకను అముద్రిత మగు 'కర్పూరమంజరి'[13] అసమగ్రానువాదమేకాక ముద్రితమై నేటికి

## 'కథలు – గాథలు'

లో చేరని యీ క్రింది వ్యాసములున్నవి.

1. 'అమ్మామాదా కవళంతల్లీ' — మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారి షష్ఠి పూర్తి సంచిక (1941).

2. దాసు శ్రీరామ మహాకవి — అయ్యంకి వేంకటరమణయ్య సన్మాన సంచిక (సరస్వతీ సామ్రాజ్యము).

## విషయ సేకరణ

మన పూర్వకవుల కృతు లాకాలమున ముద్రణాది సౌకర్యాలులేని కారణముగా, వారినిగూర్చి వారి గ్రంథా లనుగూర్చి, వివరాలు సేకరించుటకు మనకీనాడు దుశ్శకమగుచున్న సంగతి వాఙ్మయ చరిత్రయందు పరిశ్రమ చేయువారికి, పరిశోధకులకు సుపరిచిత మైనదే.

అట్టిపరిస్థితిలో, అచ్చులోనుండి, సులభముగా అందుబాటులోనున్న మన ఆధునిక కవుల గ్రంథా లనుగూర్చి విషయములన్నియు, ఆమూలాగ్రంగా సేకరించుట, మనకు ప్రధానాంశమై యున్నది.

సంపూర విషయ సేకరణ జరిగినగాని, సమగ్రము, ప్రమాణికము, సాధికారమునైన— నవ్యాంధ్ర సాహిత్య చరిత్ర వెలువడనేరదు.

తిరుపతి వేంకటకవుల, అముద్రిత, అలభ్య ముద్రిత రచనలను, సేకరించి, ముద్రించుట— ఆంధ్రమహాజనుల కర్తవ్యమని విన్నవించుచున్నాను.

---

12. ప్రథమ ముద్రణలో వివరాలు, తరువాత ముద్రణలలో తెలుపకపోయిన వాఙ్మయ చరిత్రకారుల కెంతో చరిత్ర రచనయందు క్లేశము గల్గించును.

13. దీనినిగూర్చి 'రెండు అముద్రిత రచనలు' అన్న నా వ్యాసము చూడనగును.

(భారతి. నవంబరు 1963)



# భా(భీ)మా కలాపం

## శ్రీ పులికంటి కృష్ణారెడ్డి

నట్టింటిగూటికి సరిగ్గా నాలుగుజానెళ్ల ఎత్తులో, నలుగురు దేవుళ్లపటాలమధ్య అందంగా అమర్చిన అద్దానికి అడ్డంగా నిలబడి, పైటచెరగును ముందుకు తీసి మునిపంటితో కఱచిపట్టి, 'మేమెంతో ముందుకు పోయాం!' అని విఱ్ఱవీగే నారీలోకాన్ని 'లేదు' అని సవాలు చేసినట్లు వెనక్కువెళ్లిన రవికగుండీలను తగిలించు కోవడానికి తంటాలుపడుతూ, అద్దంలోని ప్రతి బింబమువైపు పోజుపెట్టి నిలబడివుంది ఆమె! అనుకో కుండా నేను గుమ్మంలో అడుగుపెట్టేసరికి 'ఓ! మీరా?' అన్న మాటలు అప్రయత్నముగ ఆమె నోటి నుండి వెలువడడమూ, మునిపంట కరచిపట్టిన పైట చెరగు జారిపోవడము, ఆమె లోనికి పారిపోవడము క్షణంలో జరిగిపోయినవి. గిరక్కున వెనక్కుతిరిగిపోవా లనిపించి, నేను తిరుగుముఖంపెట్టినా, 'ఎందుకు పారి పోవాలి ఆమె?'...పైట జారిపోయింది పో మళ్లీ సర్దుకోవచ్చునే?...వెంటనే సర్దుకోలేకపోయినా ఆమె దాచుకొన్న సౌందర్యం కనీసం కళ్లలోనైనా దోచు కోవడానికి అస్కారంలేనిరీతిలో ఒకటిరెండు బంధనాల మధ్య పదిలపరచబడివుందే! అదీగాక—తీరిగ్గా అలంక రించుకొని బజార్నవెంబడిపడి, అంతంతమాత్రంగా మిగిలి, మళ్లీ ముందుకే వాలిన పైటచెరగు రవికలో దూరి సమున్నత ప్రదేశాన్ని చక్కలిగింతలు పెట్టా లని ప్రయత్నంచేస్తూఉంటే, నడుము నాజూకును, కటిస్థలి పటుత్వాన్ని ప్రదర్శించాలని ప్రాకులాడుతూ, అలంకరణలో ముందడుగువేశామని భ్రమిస్తున్న నారీ లోకానికే ఈమె ప్రవర్తన ఎబ్బెట్టుగా కనుపించదా? మరి ఆమె యెందుకలా పారిపోయి, నాలో యిలాంటి విపరీతమైన ఆలోచనలకు దోహదమివ్వాలి!' అన్న ఆలో చనలు కాళ్లకు బందాలు తగిలిస్తే కాసేపు నిలబడి పోయాను. ఇక నేనక్కడ నిలబడలేక అడుగు ముందుకువేయబోయాను, ఆ సంఘటన మరచిపోదా మన్న ప్రయత్నంలో!

'ఏమండీ! అప్పుడే వెళ్లిపోతున్నారే!'

తిరిగిచూచాను. మురులు గొలిపే సౌందర్యము మాటలాడుతూఉంది, నట్టింట నాజూకైన ధూపాన్ని సంతరించుకొని. చిందరవందరగ పారాడుతున్నాయి వదనారవిందములో చిరునవ్వులు ముంగురులలో పోటీ పడుతూ! 'ఎందుకండి? అలా గుడ్లప్పగించి, చూస్తారు; నిలువుగుడ్లు పడిపోయేను; లేదా మా యింట్లో పిడికెడు మిరపకాయలఘాటుకి తట్టుకోలేక అందరు నన్ను తిట్టిపోస్తారు. ఇలా వచ్చి కూర్చోండి.'

ఓ చిన్న 'స్టూలు'లాంటి ఆసనాన్ని చూపింది. వచ్చీరాని నవ్వు తన మొగానికి ఓ విధమైన వన్నె తెస్తూంటే. వెళ్లిపోదామనిపించినా కదలికకు కళ్లెం వేస్తున్నాయి ఆమె చూపులు. మారు మాట్లాడ కుండా వెళ్లి కూర్చున్నాను. జారిపోయిన పైట చెరగునుతీసి మెడచుట్టూవేసి లాగి మునిపంటితో కొరకుతూ వుండి కసిదీర బహుశా మగవారున్నారని కూడ తెలియకుండ జారిపోయినందుకు కోపమేమో మరి. ఏమి మాట్లాడడానికి తోచకుండా గత సంఘ టనలతో కలిసి నా పూర్వ స్మృతులన్నీ కనుల ముందు మెదిలేసరికి ఆమెవైపు చూడడానికి ధైర్యం చాలక, ప్రక్కనమేజామీద ఓ పాతపత్రిక పడివుంటే తీసుకొని పేజీలు త్రిప్పుతున్నాను, అక్షరాలు కను పించకపోయినా.

'ఏమండీ! ఈమధ్య 'స్ట్రెయిక్' ఫేశారే?!

అడుగుతున్నది ఆమె సోదరి. పేరు శాంత. వేసిన జడనువిప్పి నాలుగుసార్లు వేసుకొంటూవుంది చెప్పే భావాన్నే మరలా మరలా చెప్పే చేతగాని కవిలా. కాటుక దిద్దినతీరు...నుదిటిన ముంగురులను అతిజాగ్రత్తగా తీర్చిదిద్దినసొరు...చామను చాయను...మార్చడానికి ఒత్తుగా మెత్తుకొన్న పౌడరూ...గమనిస్తూంటే— అప్పుడే రంగస్థలంలో ప్రవేశపెట్టడానికి అలంకరణ పూర్తిచేసిన నాయికామణిలాగ కనిపిస్తూ ఉంది సామాన్యులకంటికి. 'శాంతవో!...అయస్కాంతానివో!' అని కవిత్వం ఆరంభిస్తాడేమో ఎవరైన భావకవి కంట పడడం తటస్థిస్తే!

'మరి యిది సమ్మెల యుగమే కదండి!' అన్నాను నెమ్మదిగా.

'నిజమే ననుకోండి. యజమానికి కార్మికుని మధ్య సమ్మెలుండడం సహజం. ఇక హైస్కూళ్ళు కాలేజీ లంటారా? అంతకంటే సహజం. భార్యాభర్తలమధ్యకూడ ఈమధ్య సమ్మెలు ప్రారంభమయ్యాయని వింటున్నామంటే—అది సహజంలో అసహజం. ప్రేయసీ ప్రియులవరకుకూడ పొడిగింపబడవచ్చు. కానీ స్నేహితులమధ్య సమ్మె లేమిటండీ!' గచ్చకాయకుండలో చేయిబెట్టి త్రిప్పి నట్లున్నాయి మాటలు. సరైన సమాధానంకోసం ఆలోచిస్తూ ఉంది మనస్సు.

'ఉండవే నీ బోడి వ్యాఖ్యాలున్నూ నీవున్నూ! పాపం! ఆయనేమో లేక లేక పండుగవంటి రోజున వచ్చాడు. అందులో ఎంతో బడలికగా కన్పిస్తున్నాడు కూడ. కాస్త కాఫీ అయినా యిద్దామనుకోకుండా!'

అడ్డు తగిలింది ఆమె!

'ఇప్పుడే త్రాగి వస్తున్నానండీ! ఎందు కన వసరమైన వృధా!'—

చెబుతున్నా వినిపించుకోకుండా ఆమె లోనికి వెళ్ళింది.

'అరె! మీరూ తాగుతారన్నమాట!'—త్రాగ డాన్ని కాస్త ఒత్తి, మెత్తగా ఎత్తిపొడవాలని ప్రయత్నించింది శాంత. సాధారణంగా తక్కువగా మాట్లాడి ఎక్కువగావింటే, తద్వారా విషయసేకరణ జరుగ వచ్చునని అభిప్రాయపడేవాడిని. కాని ఈ మాటతో ఎక్కడో నక్కియున్న గోరంత అహం దెబ్బతినింది. ఎదురుదెబ్బకొట్టాలని ఉడుకుమోతుతనం హెచ్చింది. 'అవునండీ! శాంతాదేవిగారూ! త్రాగడమంటే అటు యిటూ కాదు. ఒళ్ళు మరచిపోయేదాక తాగుతాము, అందులో మీలాంటి అందమైన అమ్మాయిలు కంట పడ్డప్పుడు సౌందర్యాన్ని!'

చిరుకోపం ఆమె అలంకరణకు మరింత అందాన్ని పులిమితే, తుర్రున పారిపోయింది శాంత ఆ హాల్లో ఆ స్టూలుమీద కూలబడివున్నాను నేను. అడిగినదానికి బదులుసదులు చెప్పని మొద్దబ్బాయిల్లాగ మూల రెండు మాటలధాన్యం......కిచకిచమని ధ్వని చేస్తూ, గూళ్లు కట్టుకోవడానికి ప్రయత్నంచేస్తూ, ఆ ప్రయత్నంలో అక్కడక్కడ చెత్తచెదారాన్ని రాలుస్తూపిచ్చుకలు...నట్టింటిగూటికిపైన నలుగురు దేవుళ్ళు...దేనితోను నిమిత్తంలేని సాధుపుంగవునిలా పంచన ఓనామాల ఆసామి...నా ఒంటరితనాన్ని చూచి జాలిపడుతున్నారేమో? ఒంటరితనంలో ఆలోచనలు రెక్కలు విప్పుకొంటున్నాయి.

*  *  *

అప్పటికి సరిగ్గా యేడాదిక్రిందట ఆమెను చూశాను.

ఆమెనేకాదు ఎందరినో చూస్తుంటాను. ఆఫీసుకు బయలుదేరకముందు, ఆఫీసునుండి తిరిగి వచ్చినపిదప అలవాటుమేరకు మా యింటిడాబామీద కాసేపు నిలబడితేచాలు, ఎందరో కనుపిస్తూఉంటారు.

సన్నగా యెత్తుగా ఉంటుంది ఆమె. అంతపొట్టి, అంతపొడుగు కాకపోయినా ఎత్తుమడమలజోళ్ల మీద కాసంత ఎత్తుగానే కనిపిస్తూఉంటుంది. ఆమెను చూస్తేనే భయం... పెద్దగాలివిస్తే యేమైపోతుందో? యేమో? అని. ఎడమచేతి ముంజేతిమీద తెల్లటి కోటు...మెడలో స్టెతాస్కోపు...కుడిచేతి ఆధారంలో నడుముమీద నాట్యంచేస్తూ ఓ నాలుగు పుస్తకాలు...

వైద్యకళాశాల అమ్మాయిలా ఉంటుంది. తలలోని సంపెంగపూల సౌరభము తెంపులుతెంపులుగా వస్తూ ఉంటుంది. మెడలో 'స్టెతస్కోపు' ఏమీలేని వక్షస్థలి మీద ప్రాకులాడుతూఉంటుంది పాపం! ఏమి వారు కొందామోఅని! ప్రతిరోజు ఉదయం ఆ దారివెంబడి వెళ్లి మళ్లీ సాయంకాలము అదే దారివెంబడి వస్తూ ఉంటుంది. ఆమె మొగముతో పోటీపడుతూ ఉదయం సౌరభాలు వెదజల్లే సంపెంగులు సాయంకాలానికి వాడి వత్తలై ఉంటాయి ఆమెలాగే! అపును మరి! వాటి స్వభావమే అంత! ఆమెకు 'సంపంగి'అని నామకరణం చేశాను.

'మూన్ కట్ జాకెట్టు'ను మించి ముడతలు పడిన కండరాలు...'ఏమాత్రం మీరు అజాగ్రత్త వహించినా మా పరువు దక్కదు' అని వీపు నాశ్రయించిన రవిక గుండీలను బతిమలాడుతూ వక్షోజాలు...'చూడు నా దెబ్బ!' అని పిటినన్నిటిని సవాలుచేస్తూ 'స్కూటరు' చక్రంలా తయారై నడినెత్తికెక్కిన సిగముడి!...అందులో ఒకటే ఒక్క పువ్వు!!—సరిగ్గా మా యెదురింటికి ఓ అయిదారు యిండ్లకవతల కడప ఆధారంతో నిలబడి వుంటుంది మరొక ఆవిడ! మా అమ్మ, అమ్మమ్మలు కటుకొంటూ ఉండిన పదహారు మూరల పొడవు చీర సంగతి అటుంచి, ఈ కాలం కారుకు కాస్త ఎక్కువని పించే పన్నెండు మూరల చీర సరిగ్గా ఆమె భుజస్కంధాలను తాకీతాకనంతవరకు వచ్చి ఆగిపోతే, పాపం! ఆధారరహితమైన ఆ పైటను సర్దుకోవడములో సరిపోతూ ఉంటుందామె పని! ఆమెనుచూస్తే బాగా కండపట్టిన ఒంగోలుగిత్త జ్ఞాపకమొస్తుంది. అందుకే నేనామెను 'ఒంగోలుగిత్త' అంటూ ఉంటాను.

ఉన్న బెత్తెడు వెంట్రుకలకు నాలుగు బెత్తెళ్ల పొడవు వెంట్రుకలను నాజూగ్గా జతచేర్చి జడఅల్లితే అది ఎప్పుడూ కటిస్థలి నాశ్రయించి ఉంటుంది. సాధారణంగా కీల్జడ తృటి నటియిస్తుందని పూర్వకవుల వర్ణన. ఆ నటన అందంగా కనుపిస్తుంది కూడ. కానీ ఆమె నడుస్తూ ఉంటే సైనికవందనం స్వీకరించే ప్రధాని జ్ఞాపకం వస్తాడు. ఉత్సవ విగ్రహాలముందు హుందాగా ముందుకుసాగే గజరాజు మదిలో మెదలుతాడు. రాయంచల నడకల వయ్యారాలు నాట్యం చేస్తాయి కనులముందు!—అంటే ఆమె నడుస్తూ ఉంటే కటిస్థలిమీద తెగబారెడు జడ కదిలితే ఒట్టు. అందుకే నేను ఆమెను 'రాజహంస' అంటాను.

ఇలా దినము ఎందరో కనబడుతుంటారు. కంటపడ్డప్పుడు ఏవేవో పేర్లుకూడ పెడుతుంటాను మరలా ఓ సారి వారు కంటపడేవరకు కనీసం ఆ పేరుకూడ మతికిరాదు. కాని సరిగ్గా సంవత్సరం క్రిందట ఆమెను చూచినపుడు నిజంగా నన్ను నేను మరచిపోయే స్థితి కలిగింది. ఆమెవైపు అలానే చూస్తూ నిలబడిపోతే, ప్రక్కనవున్న ఆమె నాన్నగారు 'నేనెందుకలా అయిపోయానో?' అన్న తలంపులో నేమో నా పరిస్థితిని పొలుపంచుకొంటే అతనిని యిరకాటంలో పడవేయడం యిష్టంలేక, ఆ ప్రవర్తనలో సభ్యత లోపించింది గనుక, 'అబ్బే! ఏమీలేదండీ!' అంటూ కుర్చీలో కూలబడ్డాను.

'ఏనమ్మా? మేము సకాలములోనే వచ్చామను కొంటాను. ఏదైనాకాస్త నాలుక తడిచేసే పని వుందా లేదా?' ముద్దు ముద్దుగా అడిగాడు. చిరునవ్వు సమాధానం. ఆమె లోనికివెళ్ళింది. కుర్చీలో కూర్చున్నానేగానీ, ఆలోచనలు ఆపురావురుమంటున్నాయి ఆకలిగొన్న ప్రేవుల్లా.

'నా రెండవ కుమార్తె బి, ఎ. చదువుతూ ఉంది. పేరు జయలక్ష్మి!'

పరిచయవాక్యాలు చెవిని పడడంతో తల పైకెత్తాను వ్యక్తికోసం. ఎవరూ కనుపించలేదక్కడ. లోనికివెళ్లిన ఆవిడనుగురించి అనుకొని 'ఓహో! అలాగా' అన్నాను. పేరు చెవినిపడడంతో నా ఆశ్చర్యం యింకనూ ద్విగుణీకృతమౌతూనేవుంది. ఆలోచనలు ఆశ్చర్యంతో పోటీపడుతున్నాయి.

'ఇదో ఈ పేపరుచూస్తూఉండండి. అంతలో

అమ్మాయి కాఫీ తెస్తుంది. నేనూ వచ్చేస్తా!'అంటూ విజయలక్ష్మి తండ్రిగారు లేచివెళ్లారు. ఆ రోజుకూడ యిలాంటి ఒంటరితనమే! అయితే ఆ రోజు కుర్చీలో, ఈ రోజు స్టూలుమీద కూర్చునిఉన్నాను. కుర్చీనుండి స్టూలువరకు రావడం సంవత్సరంపాటు పరిచయభాగ్యమేమో మరి! ఓమూల రెండుమూటల ధాన్యం... 'కిచకిచ'లాడుతూ పిచ్చుకలూ......నట్టింటగూటికి నాలుగుజానెళ్ల ఎత్తులో నలుగురు దేవుళ్లు—వాతావరణంలో యేమార్పు కనిపించలేదుకానీ, ఆనాటి నా మనఃప్రవృత్తికి ఈనాటికీ ఎంతో తేడావుంది.

అదేమి చిత్రమోకానీ కొందరిని చూస్తుంటే పరవశులవుతాము. మరికొందరు మాట్లాడుతూంటే మైమరచిపోతాము, కానీ కొందరిపేరు చెవినిపడితే చాలు!—వివశులైపోతాము.

నాకు ఒక మిత్రుడున్నాడు. నాకేగాదు అందరికీ మిత్రులుంటారు. అయితే ఉపయోగపడకపోయినా కనీసం ఉదాహరించుకోగల మిత్రులు చాల తక్కువ మందికే దొరకుతారు. అతని ఆకారాన్ని పోల్చుకోవడానికి అనంతమైన సృష్టిలో ఎన్నోవస్తువులు కనుపించినా అతనిని ఓ సూదిలాంటిమనిషిఅని చెప్పకొంటే, అతగాడి చదువు ఆ సూదిబెజ్జమంత. కానీ అతడు మాట్లాడుతూంటే, సూదిబెజ్జము భూగోళాన్నే మరపిస్తుంది. పుస్తకాలపురుగై అతడు సాధించిన ఘనవిజయం అది! అతడొక అమ్మాయిని ప్రేమించాడు. కాదు—ఆమే అతనిని ప్రేమించింది. ప్రేమించవలసివస్తే ఎవరో ఒకరు ప్రేమిస్తే మరొకరు ప్రేమింపబడతారు. ఇది సర్వసాధారణంగా జరిగే విషయం. దానితాడుతెగ ఈ ప్రేమకూడ డాక్టరు డాక్టర్నే, గుమాస్తా గుమాస్తాలనే, కాలేజీ వాళ్లు కాలేజీవాళ్లనే ప్రేమించేటట్టు చేస్తుంది. కానీ మావాడి విషయంలో పప్పులో కాలువేసింది. ఆమె ఓ తెలుగు లెక్చరర్!—పేరు 'తార'ట! ప్రేమ గుడ్డిది అని నిరూపించదలచినట్లుంది వీళ్లు. ఇంతకూ చెప్పవలసివచ్చిందేమిటంటే, వీళ్ల ప్రేమ తారస్థాయి నందుకొన్న కొన్నిరోజులకు ఆమెకు మార్పురావడంతో వెళ్లిపోయింది. పోతూపోతూ ఊరకేపోకుండా మావాణ్ణి తలమునిగే విరహంలో పడవేసిపోయింది.

తల్లిబిడ్డను ఓదారుస్తుంది. ప్రేయసి ప్రియుణ్ణి ఓదారుస్తుంది. పాపభీతికల వాళ్లను వేదాంతులు ఊరడిస్తారు. ఓటుచేత పట్టుకొన్న గొర్రెదాటు ప్రజలను ఎన్నికల్లో వేదికలెక్కి మహానాయకులు ఓదారుస్తారు విరహతాడితుని కంటితడిని స్నేహితుడు తుడుస్తాడు. ఆ బాధ్యత నాపై బడింది. నా మాటలన్నీ సావధానంగా విన్నట్లుగానేవుండి కడపట అతడనేవాడు, 'గురూ! తగిలిన కాలికే తెలుస్తుంది బాధ. నా పరిస్థితిలో మీరుంటే అలా చెప్పేవారుకాదు. చెప్పడానికేముంది?—చెత్తచెదారాన్నికూడ చలామణి చేయవచ్చు చెప్పగలిగితే! కానీ, ఎటుచూచినా ఆమె స్వరూపమే! ఎటు తిరిగినా ఓ సంఘటన కనులముందు మెదలుతూ ఉంది. ఎలా మరచి పొమ్మంటారు చెప్పండి. కనీసం యేదైనా పుస్తకం చదువుకొంటూ మరచిపోదామంటే, ఏ వాక్యములోనైనాసరే, 'త' వర్ణం కనుపిస్తే చాలు. దీనికి దీర్ఘమిస్తే 'తా' అవుతుంది ప్రక్కన 'ర' వ్రాస్తే 'తార' అవుతుంది. నా తార!—ఇంతెందుకు 'త'కు యిటువైపు అటువైపు యే అక్షరం కనుపించినా ఇన్ని అక్షరాలు ముందుకువెళ్లితే, లేదు వెనక్కువస్తే 'త' వస్తుంది. దీనిని దీర్ఘమిస్తే 'తా' అవుతుంది. ప్రక్కన 'ర' వ్రాస్తే 'తార' అవుతుంది. 'నా తార! నా తార!!' అని పలవరించే హృదయం చదవడములో లీనమవుతుందంటారా? ఏమో?' అని ఆసలే లోతుకువెళ్లిన కనుగుడ్లను పూర్తిగా కన్నీటితో నింపేవాడు. ఎదురుగా నవ్వలేకపోయినా, తలదన్నే అతని భావనాశక్తికైనా నవ్వుకొనే వాణ్ణి పరోక్షంగా. కాని నాకు యిప్పుడు తెలిసివస్తూ ఉంది పేరులో వున్న మాధుర్యం. అతడన్నట్లు తగిలితేనే తెలిసింది ఆ బాధ!—జయలక్ష్మి! ఒక్కటే ఒక్క అక్షరం వ్రాస్తే చాలు 'వి' అని ఆ పేరుముందు. 'విజయలక్ష్మి' అవుతుంది. విజయలక్ష్మి నా హృదయసామ్రాజ్యలక్ష్మి!

మత్తుమందుచల్లి మంత్రముగ్ధుణ్ణిచేసి యేదో వేడి పుట్టించగల వాడిచూపులు...వాటితో పోటీ పడుతూ చిరునవ్వులు...నవ్వితే అరుణరాగరంజితముల జవురుకొనే బుగ్గలమీది సొట్టలు...వీటన్నిటినీ కాలతన్నే అంగసౌష్ఠవము—ఆమె ఒక్కసారి అలా విలోకిస్తే చాలు! మానవుడు అమాంతంగా పైకెగిరి పోతాడు ఊహాలోకంలో పౌరసత్వపు హక్కు సంపాదించుకోవడానికి.

అలాంటి విజయలక్ష్మికి నాకు పరిచయం కలిగింది చాల విచిత్రంగా. మా ఆఫీసుకు వెళ్లేదారిలో రామాలయముంది. ఆఫీసుకు పోతూ పోతూ ఆలయం ముందు నిలబడి చేతులెత్తి నమస్కరించేవాడిని. కాళ్లల్లో చెప్పులు తీసివేయడం...చెంపలు 'ఫెళఫెళ'వాయించుకోవడంలాంటివి పొరపాటునకూడ మరచేవాణ్ణికాదు ఆ సమయంలో. అది రామునిమీద భక్తితో మాత్రం అవునో కాదో తెలియదుకాని, మాఆఫీసరుగారి తిట్లపై భయంతోమాత్రమని నిస్సందేహంగా చెప్పవచ్చు. పది పైసల టీ, లేదంటే పావలా కాఫీతో మా హెడ్ గుమాస్తాగారి హెడ్ సరిచేయవచ్చునేమోకానీ, ఆఫీసరు మాత్రం అసాధ్యుడు. అందుకే రాముని శరణు వేడాను. అతడుకూడ ఒక్కొక్కప్పుడు పెడచెవిని పెడుతున్నాడు. వాని కెన్నిపనులో మరి!—

ఆ రోజు భక్తిమోతాదు—కాదు భయం మోతాదు కాస్తమించింది. 'ఈ రోజుకు నన్నెలాగైనా రక్షించురామా!' అని మనసార వేడుకొన్నాను. అంతవరకు నెలసరి లెక్కలు పైవారికి పోలేదు. ఆ నాడు ఎలాగూ ఆఫీసరువారి వడ్డనలు తప్పవని నాకు బాగా తెలుసు. నా సంకటాన్ని ఆ సర్వేశ్వరునికి నివేదించుకొంటూ ఎంత సేపువున్నానో తెలియదుకానీ, కన్నులు తెరచిచూచేటప్పటికి నేను నమ్మలేని దృశ్యం!...ఎదురుగా దివినుండి భువికి దిగిన సౌందర్యరాశి!!—ఆమెకూడ అంతవరకు రామునితో యేమని విన్నవించుకొనిందో తెలియదుకానీ, తరమోడ్పు కన్నులతో, మొక్కుతున్న చేతులతో ఈ లోకంతో ప్రమేయాన్ని కోల్పోయిన పరిస్థితిలో—నా ఎదురుగా ఆమె! ఆమె ఎదురుగా నేను!! నా స్థితిలో ఆమె! ఆమె స్థితిలో నేను!!...అరవిరిసిన మొగ్గల్లాగ విచ్చుకొంటున్నాయి ఆమె పెదవులు. మెరపులాంటి ఓ చిరునవ్వు తళుక్కుమనింది ఆ పెదవులమధ్య. నా తల మెల్లిగా వాలింది. సిగ్గుతోకాదు—ఆనందంతో నిండిపోయిన హృదయాన్ని చూచుకోవాలని! ఆమె మెల్లగా కదిలింది. నేను అంతే!—

అయితే చిన్నబజారంతా కదిలినట్లుంది ఆమెతో కలిసి. అత్తరు అమ్ముకొనే అబ్దుల్లా సాహెబ్, బేరాన్ని అవతలికినెట్టి, ఆమెవైపు ఒదోలా పోజుపెట్టి, మెల్లగా సవరించుకొంటున్నాడు మేకపోతు గడ్డాన్ని, అంతకుమించిన గాంభీర్యాన్ని! 'పేవ్‌మెంటు' మీద పాతబట్టలుకుట్టి పొట్టపోసుకొనే 'సత్తారు భాయి' సత్తువకొద్దీ తొక్కుతున్నాడు కుట్టుమిషను; 'బలె బలె కత్తులు! పదునైన కత్తులు!! పావలా కత్తులు!!!'—అని అరుస్తూ వీధివీధి తిరుగుతూ కత్తులమ్ముకొనే కసిలేని ముసలికూడ అదోరకంగా చూస్తూ, 'బలేకత్తి!' అని అరుస్తున్నాడు. నేన్ను మాత్రం చాల జాగ్రత్తగా దాచుకొన్నాను గుండెల్లో ఆమె చిరునవ్వును. మనసు ఎటువైపో తేలిపోతూ ఉంది. ఆఫీసులో పనికూడ హుషారుగా సాగుతూ ఉంది. ఆ ముందువాడు ఎంత ప్రయత్నించినా తలాతోక లేకుండా తయారైన లెక్కలన్నీ చెప్పిన మాట వింటున్నాయి, తోకముడుచుకొన్న నమ్మకమైన నౌకరువలె. అది రాముని అనుగ్రహమో? ఆమె చిరునవ్వుల ప్రభావమో? ఆ రామునికే యెఱుకకానీ, ఆ రోజు దొరగారి దీవెనలు తప్పడం నా అదృష్టం!

ఆ రోజునుండి అంతే! చిన్న బజారులో నేను ఆఫీసుకువెళ్లే సమయంలో యెదురుపడుతుంది ఉదయమో, సాయంత్రమో కనీసం ఒక్కసారైనా కనుపిస్తుంది తప్పని సరిగ. చూడబోతే ఆమెకూడ నాలాగ పొట్టచేత పట్టుకొని వో ఆఫీసుచుట్టూ కాదుకానీ, ఆఫీసులో గడియారంచుట్టూ తిరిగేటట్టుగా వుంది. ఎదురుపడ్డప్పుడంతా ఒక్కసారి నావైపు

చూస్తుంది. అతి జాగ్రత్తగ చిరునవ్వు దోచుకొంటాను. యధాలాపంగా నాతల వాలిపోతే మనస్సు ఊహాలోకాల్లో తేలిపోతూ ఉంటుంది. దుర్భరమ్మైన బ్రతుకులో దినం ఓయుగమనిపిస్తే, ఈ ఆనందానుభూతిలో ఆరు నెలల జీవితం అరదినం'లాగ గడచిపోయింది.

ఆనాడు సాయంకాలం. అయిదు గంటలై ఉంటుందేమో! ఆఫీసు పనిమీద చిత్తూరువెళ్ళి తిరిగి రావడానికి బస్సుస్టాండుకు వచ్చాను. పనులన్నీ సవ్యంగా జరిగిపోయినా, మనస్సు మాత్రం పరితపిస్తూనే ఉంది. ఆ తపనలో కలిసి ఆలోచన!—కొంపలు కూల్చేది, నిలబెట్టేది కోమలాంగుల చిరునవ్వులే! ఆశావాదుల పాలిట వరప్రసాదం చిరునవ్వే!—మరి ఆ చిరునవ్వు ఆ రోజు నాకు దూరమయ్యేసరికి ఏదో ధారపోసుకొన్నంత తపన.—'బస్సుస్టాండు'లో అడుగుపెట్టాను. ఎటు చూచినా యేదో కంపు!... అంతా కలగాపులగంగా కలిసి, అదొక ప్రత్యేక ప్రపంచంలా, నేటి రాజకీయ వాతావరణానికి దర్పణంలా ప్రతిబింబిస్తూ ఉంది. సాధారణంగా బ్రతిమలాడించుకొనే 'కండక్టరు' మహాశయుడు...కొన్ని కొన్ని సమయాల్లో పలుకును పెడచెవిని పెట్టగల కాకిగుడ్డల ధీరుడు...సాదరంగా ఆహ్వానించాడు ఒక్కటంటే ఒకటే సీటు మిగిలిఉందని. బస్సు ఎక్కాను. నాకంటే ముందువచ్చినవాళ్ళు ఆక్రమించుకొన్నారు సీట్లన్నిటినీ; లేదంటే—ఒక్క వరుసలో యిద్దరు స్త్రీలు కూర్చునివున్నారు. ఆ ఖాళీగావున్న ఒక్క సీటు నాకు యివ్వడం సమంజసముకాదు. ప్రక్కన కూర్చున్నవాళ్ళ ఆడవాళ్ళుకదా మరి! పరిష్కార మార్గానికై అన్వేషిస్తూ ఆలోచిస్తున్నాడు కండక్టరు. అతని ప్రక్కన నేను. కూర్చున్న సహృదయు లెవ్వరో బోలెడు ఉచిత సలహాలిస్తున్నారు. ఈ అలజడిలోనేమో తిరిగి చూచింది ఆమె!—నా కన్నులు నేనే నమ్మలేకపోయాను. ఇంతసేపు దేనికోసం పరితపించానో అవే చిరునవ్వులు! అరవిరిసిన మల్లెలై నాకు అభిషేకం చేస్తున్న పువ్వులు! యధాలాపంగా నాతల వాలిపోయింది.

'అరె! మీరా? ఎప్పుడు వచ్చారేమిటి? రండి! రండి!!'— అని సాదరంగా ఆహ్వానించింది ఆమె.

'మీ వాళ్లండీ వాళ్ళు?' కండక్టరు ప్రశ్న.

'అవునండీ!' అన్నాను అనకపోతే బావుండదని.

'అయితే అదే సీట్లో కూర్చోండి'—అతని నెత్తి బరువు నేలపడినట్లుంది.

'రైట్' అని గొంతుచించుకున్నాడు. ఆమె ప్రక్కన కూర్చోవలెనంటే యేదోగా అనిపించి నసుగుతూ నిలబడ్డాను ప్రక్కన.

'బాగుందండీ? అసలు సిగ్గుపడవలసింది మేము. మా పని మీరు చేస్తున్నారు కాబట్టి, మీ పని మేము చేయవలసివస్తుంది. రండి! రండి!! యిలా కూర్చోండి!' ఆమె ఒత్తిడిచేస్తూ ఉంది. ఒదిగి కూర్చున్నాను. నారెక్క పట్టిలాగి సరిగ్గా కూర్చోపెట్టింది. బస్సు కదిలింది. నా హృదయం అక్కడవుందో లేదో ఒక్కసారి తడిమిచూచుకోవలసి వచ్చింది. ఉంది. లేదంటే కాస్తవేగంగా కొట్టుకొంటూ వుంది. బస్సు అంతకంటె వేగంగా పరుగులిడుతూ వుంది.

పేరు విజయలక్ష్మి. నేను ఊహించిన తీరుగానే ఆమెకూడ ఓ గుమాస్తా. చిత్తూరులో ఆ రోజు బంధువుల యింట్లో యేదో కార్యం జరుగుతూ ఉంటే చూచిపోవడానికి వచ్చిందట. ఈ పరిచయంతో ప్రారంభమ్మైన సంభాషణ బస్సు గమ్యస్థానం చేరేసరికి ఎక్కడికోవెళ్ళి నిలిచింది. నిజంగా ఆ నాటి బస్సు ప్రయాణం జీవితంలో ఓ మరపురాని సంఘటన. ప్రభుత్వము వారి ధర్మమా! అని ఎక్కడ చూచిన 'రిపేరు' పేరులో గుంతలుగుంతలుగావుంది బాట. బస్సు ఆ గుంతల్లోపడి గల్లంతు చేస్తూంటే, మాకు తెలియకనే మా శరీరాలు ఒకదానితో వొకటి 'ఢీ' కొంటూంటే, ఇది గమనించనట్లు యిద్దరమూ మాటల్లో పడినట్లు నటిస్తూంటే, ఎప్పుడో నలభై మైళ్ళ ప్రయాణం జరిగిపోయింది. నలభైయేళ్ళు కలిసి బ్రదికినంత ఆనందాన్ని అందిస్తూ!

ఆ రోజు 'బస్సు'లో 'సీటు' యిచ్చిన 'కండక్టరు' మహాశయునికి, బాటంత గుంతలు గుంతలు చేసిపెట్టిన ప్రభుత్వానికి కృతజ్ఞత తెలుపడం నా కనీస కర్తవ్యం. లేకపోతే నా విజయలక్ష్మి!...నా అనందాల ప్రోవు!! నాకు దొరికేది కాదేమో? ఆ నాటి నుండి నాలుగేండ్లు నాలుగు దినాల్లాగ గడచి పోయాయి. ఆ నాలుగేండ్లలో ఎన్ని సినిమాలు... ఎన్ని చిత్తూరు ప్రయాణాలు...ఎంత చిత్తుగా తిరగడము...ఓహ్! తలచుకొంటే గుండె మధురానుభూతితో నిండి మాటలు పెగిలిరావు. ఇంతకూ అనుకున్నది అనుకొన్నట్లుగా జరిగితే యింత ఆలోచన అనవసరము. అనుకోని విధంగా జరిగినపుడే ఈ నెమరు వేయుడాలు...నీళ్ళు మింగడాలూ!...

నాలుగేళ్ల తరువాత ఓ ఉదయం. అవసరమైన పని యేదో తగిలింది. అయిందనిపించేటప్పటికి దాదాపు పదికావస్తూ ఉంది. ఇంకనూ ఆలస్యమైతే నా ఆరాధ్య దైవదర్శనం లభించదేమో అని తొందర తొందరగ పోతున్నా! పెద్ద మతం దాటిపోయింది. రామాలయం...పోలీస్‌స్టేషన్...... దాటిపోతున్నాయి. ఈ రోజు శ్రీరామచంద్రుడికి నామీద చాల కోపంవచ్చి ఉంటుంది. అసలు రోజూ పెట్టే నమస్కారమే చిత్తాన్ని ఎక్కడో పెట్టి మరీ ఈ రోజు అంతంతమాత్రంగా తయారయింది. పరుగు నడకగా దూసుకుపోతున్నాను. ఏదో పుట్టిమునిగినట్టు, ఊరి పొలిమేరలు దాదాపు సమీపిస్తున్నాయి. ఇంకో పదిబారల దూరంలో మా ఆఫీసు ఉంది. ఆమె కనుపించలేదు. నడుములు విరిగినంత పనిగా, 'బహుశా ఈవేళ తొందరగ ఆఫీసుకువెళ్లి ఉంటుందేమో?' అని నా మనసును సమాధానపరచుకొంటూ కుర్చీలో కూలపడ్డాను.

'అయ్యగారేమో యీ వేళ...'— హెడ్‌క్లార్కు గారి పరామర్శ ప్రారంభమయింది. అసలే విసుగ్గా వున్నాను. ఎంతో సౌమ్యంగా అడిగినట్టున్నా పుండు మీద కారం చల్లినట్టు వినిపిస్తున్నాయి మాటలు. 'కాస్త పని వుండిందిలే సామీ!' అని నాలో నేను సణుక్కొంటూ, బల్లమీద కాగీతాలు సర్దుకొంటున్నాను. అంతలో ఆఫీసు జవాను తపాలా అందరికీ బట్వాడాచేస్తూ నాకు ఒక కవరు అందించాడు. విప్పాను. అది శుభలేఖ. అందంగా అచ్చువేయబడిన ఆ లేఖ సారాంశం నన్ను పెళ్లికి ఆహ్వానించడం... ఎవరో కాదు నేను 'నా' అనుకొంటూ ఉండిన విజయలక్ష్మి!

గుండె ఆగిపోయినట్లయింది. కానీ తలమాత్రం తిరుగుతూ ఉంది. రంగుల రాట్నంలో కూర్చుంటే ప్రపంచమంతా తిరుగుతున్నట్లు కనిపి[illegible]ది. నాకేమో ఆఫీసంతా తిరుగుతూ ఉంది. ఎంత ప్రయత్నించినా తేరకు నిండుకొంటున్నాయి కండ్లు. ఆస్థితిలో ఎట్లో నాలుగంటే నాలుగు వాక్యాలలో ముగించాను సెలవు చీటి. 'హెడ్‌క్లార్కు టేబిలు'మీద పడవేసి మారు మాట్లాడకుండా బయటకు నడిచాను. పాపం! ఆ ముసలాడు నన్ను, నా పరిస్థితిని అర్థంచేసుకోలేక అవస్థపడుతూంటే ఎటు పోవడానికి తోచలేదు. 'ఛీ! ఈ ఆడవాళ్లంతా యింతే! నవ్వుతారు. నవ్విస్తారు. ఆపైన కవ్విస్తారు. కమ్మగా అంతకంటే నమ్మకంగా పలుకుతారు చిలుక పలుకులు. తీరా దగ్గర చేరితే దవడపళ్లురాలగొడతారు!—లేకపోతే యేమిటిది? రెక్కపట్టిలాగి ప్రక్కన కూర్చోబెట్టికొనింది తానే! పరవశుణ్ణి చేసింది తానే! తానులేకుండా బ్రదుకలేనస్థితికి తెచ్చింది తానే! మరి ఎందుకింత నిర్దాక్షిణ్యంగా, మాటమాత్రం నాతో అనకుండా ఈపని చేయగలిగింది. పైగా సాయంకాలము అయిదు గంటలకు కపిలతీర్థంవద్ద కలుసుకోవాలట!...సిగ్గులేకపోతేసరి!—ఆఫీసుబయటపడి, అమీదట తడబడి, మార్గం తెలియనికాళ్లు యిష్టమొచ్చినట్లు తిరుగుతున్నాయి. మనస్సు మరుగుతూ ఉంది ఆలోచనలలో!

మంచి వయసులో మార్గం తప్పిన మగువ కోరికలవలె అంతవరకు నన్ను తపింపచేసిన సూర్య కిరణాలు అయిదుపదులుదాటిన అమ్మ చల్లదనాన్ని ఆహ్వానిస్తున్నవేళ. ఉదయం ఎప్పుడో త్రాగిన కాసిని

కాఫీ నీళ్ళు...ఉదయంనుండీ దారితెన్ను లేకుండా చెడ తిరిగిన వాళ్ళు...ఒళ్ళువశంతప్పి పోయేస్థితి—ఆ చోటు చల్లగావుంది. మలయ పవనాలు మెల్లగా మధురాతి మధురంగా వీస్తున్నాయి. పోయినప్రాణం లేచివచ్చి నట్లనిపించి కూర్చున్నాను. బైర్లు కమ్ముతూండిన కళ్ళుకూడ కాస్త తెరపి చిక్కినట్లనిపిస్తూ ఉంది. పరిసరాలు ప్రస్ఫుటంగా కాకపోయినా కనుపిస్తున్నాయి. నిదానించిచూశాను. అది కపిలతీర్థం! నేను కూర్చున్నది ఓ మండపములో. నాకు నాకే ఆశ్చర్యం వేసింది. ఇకమీద విజయలక్ష్మి మొగమే చూడకూడదనుకొన్నాను. కానీ నాకు తెలియకనే నాకాళ్ళు నన్నక్కడికి చేరవేశాయి. అందుకేనేమో ఆడవాళ్లకంత అహం!

మండపములో ఓ స్తంభానికి చేరగిలబడి వున్నాను. తిరుమలకొండనుండి వస్తూపోతూవున్న బస్సులు...కార్లు...ఒకటేరొద చేస్తున్నాయి. అలవికానన్ని అన్యాయాలను అక్రమాలను చూచిచూచి విసిగిపోయాడేమో సూర్యుడు—అతని మొగంకూడ పాలిపోయివుంది నాలాగానే! 'ఇక చూడలేను బాబూ!' అంటూ కనులు మూశాడు పడమటికొండచమాటున. ఇక ఆలోచించలేనంటూ మనస్సు అలసిపోతే కన్నులు మూతలుపడ్డాయి నాకు తెలియకుండానే!—

అలా ఎంతసేపు గడిచిందో తెలియదు. ఏదో చల్లనిస్పర్శకు అదిరిపడింది ఒళ్ళు. మెల్లగా కళ్ళు తెరచాను. ఎదురుగా...అవే చిరునవ్వులు!—అంత నీరసములోకూడ ఒళ్ళు రగిలింది. లాగి ఓ చెంపదెబ్బ కొడదామన్నంతకోపంవచ్చింది. కానీ అదేమివిచిత్రమో ఆ చిరునవ్వుల తాకిడికి మనస్సు చిత్తయిపోతే, శరీరము చేతనారహితమైనచిత్తరువులా అయిపోయింది. అది నా బలహీనతనా, వాంఛనా, ప్రేమా యోజుగలేని స్థితిలో తల వాలిపోయింది.

'కిలకిల' నవ్వింది ఆమె!

కోటి వీణియలు మీటినట్లు, కోయిలలు కూసినట్లు ఎంతో మధురాతిమధురమైన అనుభూతినిచ్చే ఆ నవ్వు! నరాలను జివ్వుమనిలాగే ఆ నవ్వు!! సౌగంధ్య సౌరభాలలో నన్ను ముంచియెత్తే ఆ నవ్వు!!!—మరొక్కప్పుడైతే నా బాహువలయంలో ఆమెను యిరికించుకొని ముక్కోటిముద్దులతో మురిపించి, ఉక్కిరిబిక్కిరిచేసివుండేవాణ్ణి. కానీ యిప్పుడేమో కోతి యికిలించినట్లు, కొవ్వెక్కినగుర్రం సకిలించినట్లు కృతకంగా వినిపిస్తూ వుంది. నాకేమీ పట్టింపులేనట్లుగా కూర్చున్నాను మూతి ముడుచుకొని.

రెక్కపట్టి పైకి లేపడానికి యత్నించింది. ఇంకనూ అదే చొరవ. అదే సాహసము. నాకేదో ఎబ్బెట్టుగా తోచి విదలించుకొన్నాను, కనీసం ఆమెను చూడడానికి కూడ మనస్కరించకుండా తల వాల్చుకొని. సున్నితంగా, మొనదేలిన మునివ్రేళ్ళు నా గడ్డాన్ని పైకి లేపాయి. అబ్బ! మళ్లీ అవే చిరునవ్వులు... హృదయాన్ని గిలిగింతలుపెట్టే చిరునవ్వులు! చూడలేకపోతున్నాను. వాలిపోలేని తల, ఆమె మునివ్రేళ్ల మీద తలపులలో తేలియాడుతూంది. 'నా మాట వినవూ?...రావూ?...' అని దీనంగా బ్రతిమలాడుతున్నట్టున్నాయి చూపులు. 'ఇదో యిటు రా!' అని సూదంటురాయిలా ఆకర్షిస్తున్నాయి చిరునవ్వులు. ఆమె ముందు, నేను వెనుక. అమ్మ వెంట బిడ్డలా! ఆవువెంటి దూడలా!!—చీర కుచ్చెళ్ళు సవరించి కోనేటిలో దిగింది. మొదటి మెట్టు మీద నిలబడింది. మడమలను తడుపుతున్నాయి నీళ్ళు. కనుచీకటి ఆవరిస్తున్నవేళలో నల్లటి నీళ్ళలోని తెల్లటి పాదాలతో చెప్పలేనంత సంతోషంలో ఆడుకొంటున్నాయి చేపపిల్లలు ఆమె చిరునవ్వుల వలె. ఆ పై మెట్టుమీద నేను నిలబడి వున్నాను. కాళ్ళు చేతులు మొగము కడుక్కొనింది. ఒక్కసారి తిరిగి నా వైపు చూచింది. గత నాలుగేళ్ళుగా చదువుతూనే వున్నాను ఆ చూపులను. 'ఇంకనూ అలా నిలబడ్డావేం? నీవూ కానీ!'—అన్నట్లు ఆజ్ఞాపిస్తున్నాయి. నేనూ అదేపని చేయక తప్పలేదు. అయితే ఆమె నవ్వుతూ మొగం కడుక్కొనింది. నేను అంతసేపు యేడ్చి మొగం కడుక్కొన్నాను.

కొండ క్రింద కోనేరు. కోనేటి గట్టుమీద

కొండ చరియపై గుడిలో కపిలేశ్వరుడు. బిల్వ దళార్చనచేస్తూ విప్రోత్తముడు! ధ్యానమగ్నులై సట్లు నిలబడివున్న ఓ గుంపు. ఆ గుంపులో కలిసి మేము— ఆ దేవుని యేమని విన్నవించుకొందో విజయలక్ష్మి, నాకు మాత్రం యేమీ తోచలేదు. ఎండి బీటలువారిన చవిటి నేలలో విత్తనాలు మొలుస్తాయా!

బయట పడ్డాను. బాధలోనుండి కాదు గుడిలో నుండి. ఆమె నడుస్తూ ఉంది. ఆమె వెంట నేనూ నడుస్తూనే వున్నాను. అలయాని కళ్లంత దవ్వులో, ఆలనా పాలనా లేకుండా పెరిగిన పొడి చెట్ల మధ్యలో, నలుగురి కంట్లో పడనిచోట ఆమె కూర్చొనింది. ఎదురుగా నేనూ కూర్చున్నాను, కాదు – ఆమే కూర్చో బెట్టింది. అంతవరకు ఎట్లో ఆగి, ఎదలోనేరొద చేస్తూ ఉండిన ఆ వేదనాస్రవంతి కట్టలు త్రెంచు కొని పొంగి పొర్లితే ముందుకు సాగనీయకుండా అడ్డు పడింది ఆమె వక్షస్థలి.

కనుచీకటి ఆవరించింది. దానిని పారద్రోల డానికి వ్యర్థప్రయత్నం చేస్తున్నాయి విద్యుద్దీపాలు. అంతవరకు 'కిచకిచ'మని అరుస్తూ, ఎగిరెగిరి గంతు లిడుతూ, ఒకదానితోనొకటి పోటీపడుతూ స్వేచ్ఛగా తిరుగుతున్న కోతులుకూడ ఆశ్రయంకోసం వెదు క్కొంటున్నాయి. అల్లంతదవ్వులో కపిలేశ్వరాలయ ప్రాంగణములో విప్రోత్తముల వేదపాఠం వీనులవిందుగ వినిపిస్తూఉంది. ఎదమీద చెవిపెట్టి ఎంతప్రయ త్నించినా విజయలక్ష్మి హృదిలో యేముందో వినిపించ లేదు. అలా ఎంతసేపు గడిచిందో తెలియదు. ఆమె తొడమీద నా తల వాలిపోయివుంది. కన్నీళ్లు అవిచ్ఛి న్నంగా కారుతూనేఉన్నాయి. ఆమె వ్రేళ్లు ఆడు కొంటున్నాయి నా వెంట్రుకలలలో!

'ఏడుస్తున్నావా?'—లాలనగా అడిగిం దామె.

తెలిసి అడుగుతూఉంటే బదులు అనవసరమని పించింది.

'పిచ్చీ! ఈ నా మాటలు జాగ్రత్తగా విను. అంతకంటే జాగ్రత్తగా ఆలోచించు. అర్థం చేసుకో గలిగావా అంతకంటే ఆనందంలేదు. అర్థంకాకపోతే నన్ను క్షమించు.'

అమెవైపు చూస్తున్నాను ఆశ్చర్యంగా.

'అపును పిచ్చీ! నీకు ఆశ్చర్యంగా కనుపించ వచ్చు. 'ఏమిటీపిల్ల యింత బరితెగించి మాట్లాడు తూందే'అని అనిపించవచ్చు. కానీ యివి నేర్చుకొన్న మాటలుకావు. చదువుకొన్న మాటలు అంతకంటే కావు.'

తొందరగాకానీ నీ సొదె అన్నట్లు చూశాను ఆమెవైపు. కారణంకోసం తహతహలాడే మనసు సహ నాన్ని కోల్పోతూఉంది.

'చెబుతున్నా విను. ప్రేమ వేరు. కర్తవ్యం వేరు. ఒకదానికొకటి ఆమడలదూరాన నిలబడి వుంటాయి. ప్రేమలో కర్తవ్యం యిమిడినా, కర్త వ్యంలో ప్రేమ కుదిరినా సంతోషమే! కానీ పరి స్థితుల ప్రభావంతో రెండు రెండుగా ఈనె పుల్లలా చీల్చబడినపుడు దీనికోసం యేడవడం పిచ్చిరా పిచ్చీ! నిన్ను నేను ప్రేమించాను. నీవూ ప్రేమించావు. దీనిలో కర్తవ్యం ముడివడివుంటే బాగుండేది. కానీ మనం మానవులం. విధి చేతుల్లో బానిసలం. ఏటికి యెదురీదడ మెందుకు? ఎదురుదెబ్బలు తినడమెందుకు? ఈ మధురాతిమధురమైన అనుభూతిని నెమరువేసు కొంటూ మన కర్తవ్యాన్ని మనం నెరవేరుద్దాం. లే!' అంటూ తానులేచి, నన్నుకూడలేపి, అక్కడే ఆ చీకటి లోనే వదలివెళ్లిపోయింది. ఆ రోజునుండి 'ఆలో చిస్తూనాను అర్థం చేసుకోవడానికి. చిక్కినట్లే దక్కి నట్లే శ్రీరాముడిపాలిట బంగారులేడిలా నన్ను ఎక్క డికో మరెక్కడికో తీసుకొనివెళుతూనే వున్నాయి ఆ మాటలు.

ఆ తరువాత ఎవరూ చూడనిచోట యేకాం తంగా కూర్చొని యేడ్చాను. ఓపిక వున్నంతవరకు రోజూ ఏడ్చాను. ఓపిక సన్నగిల్లిందో—లేదు, కన్నీళ్లు యింకిపోయాయో తెలియదు కానీ, ఆపై కూర్చున్న చోటంతా ఆలోచించడానికి ఆరంభించాను. ఇటు యింట్లో అటు ఆఫీసులో నా ఏకాగ్రధ్యానానికి తగిన

ప్రాయశ్చిత్తం జరిగేసరికి కాస్త తెలివిగా వ్యవహరించడానికి పూనుకొన్నాను ప్రయత్నపూర్వకంగా. గత అనుభవాలు అప్పుడప్పుడు కనుల ముందు సొదలుతూ, 'కలలేమో?' అనిపిస్తూ ఉన్నాయి. రోజులు దొర్లు తున్నాయి భారంగా.

ఆ రోజు. ఈనాటికి సరిగ్గా యేడాది క్రిందటి రోజు. ఈ యింట్లో అడుగుపెట్టిన మొదటి రోజు. జయలక్ష్మి నా యెదుట పడ్డరోజు!— నిజంగా నన్ను నేను మరచిపోయాను. గత స్మృతులన్నీ మనసులో మెదిలి నన్ను అచేతనుణ్ణి చేశాయి కాసేపు. దీనికి కారణం—జయలక్ష్మి దాదాపు నా విజయలక్ష్మి లాగే వుంది !

అవే కండ్లు ! అవే చిరునవ్వులు !... నవ్వితే అరుణరాగరంజితాలను జవురుకొనే అవే బుగ్గల మీది సొట్టలు. 'నా అదృష్టదేవత, ఆరాధ్య దైవము మళ్లీ ఈ రూపంలో అవతరించిందా ?' అని విస్తు పోయాను. అందుకే ఆరు నెలలు తిరిగాను ఆమె యింటి చుట్టూ. ఆరు నెలల్లో అరవైసార్లు చూశాను ఆమెను. చూచినపుడంతా ఏదో తెలియని ఆనందం! ...పలుకరించినపుడంతా మోయలేనంత అనుభూతి!... ముగ్ధుణ్ణి చేస్తే బయటు పడేవాణ్ణి. మనసు కాస్త తేలికపడితే, ఆనందం కరగిపోయేవరకు, అనుభూతి యింకిపోయేవరకు తిరిగేవాడిని లహరిగా. మళ్ళీ వెళ్లే వాడిని. మళ్ళీ అంతే ! అదొక పిచ్చి. అదొక వ్యామోహము !

అయితే ఆనందము, అనుభూతితోపాటు కలిగిన అనుభవాలు కూడ అద్భుతమైనవే !

'ఏమండీ! ఏదో 'బోర్' కొట్టేస్తుంది. పొద్దు పోవడమేలేదు.'

చికాకుతో చిరునవ్వును మేళవించి, చిలిపిగా పలికేది జయలక్ష్మి. 'అయితే నన్నేం చేయమంటారు?' అన్నట్లు చూసేవాడిని ఆమె వైపు ఆత్రంగా.

'ఏవైనా కొన్ని నవలలైనా తెచ్చిపడవేస్తే...'

నోటిమాట నోట్లో వుండగానే బయటపడే వాణ్ణి. ఆ పెద్ద గ్రంథాలయములో నా 'చిన్న ఉద్యోగి' మిత్రుని కాళ్లా వేళ్లా పడి బతిమలాడే వాడిని. ఓ సంచెడు పుస్తకాలతో ఆమె సమక్షమున వాలేవాడిని రోజు తిరుగకముందే !

పందెములో గెల్చినంత సంబరముతో 'థేంక్స్' అనేది ఆమె ఆ పుస్తకాలను అందుకొంటూ.

అదో! మళ్ళీ అదే చిరునవ్వులు!...చంద్రోదయంలో వికసించిన కలువపువ్వులు!...అబ్బ ఎంత సంతృప్తి!...మరెంత ఆనందము!!...

'చూడండీ! అందరూ స్నేహితులమంటారు. చల్లగా కబుర్లు చెబుతారు. మీకోసం ఏమైనా చేస్తామని ప్రగల్భాలు పలుకుతారు. తీరా సమయం వస్తే అందరి బుద్ధుల్ని ఒకే త్రాసులో తూచ వచ్చండీ!' వాపోతుంది ఆమె.

'ఇంతకూ యేం జరిగిందండీ?' కొంప మునిగినంత ఆత్రంతో కారణంకోసం అడుగుతాను.

'లేకపోతే చూడండి. రెండురోజులుం దనగానే చెప్పాను. 'దసరా బుల్లోడు' ఫస్ట్ షోనే చూడాలనీ, నా నాలుగు టిక్కట్టు కొనితెచ్చిపెట్టమని; 'అదెంత పని?'అంటూ వెళ్లాడండీ! ఇంతవరకు మనిషి పత్తా లేదు.'

'పిక్చరే'మో ఈ వేళే ప్రారంభమవుతూంది. ఛ ఛ! ఏం మనుషులో?...'

'వాడిముగం వాడు లేకపోతే నేను లేనా?'అన్న భావన మనస్సులోపలే గూటానికి కట్టబడ్డ గొడ్డు లాగ తిరుగుతూంటే, పైకి లేచేవాడిని హుషారుగ. ఏదో పొడిచి గెలుద్దామన్న సంబరంగ !

'ఆఁ! అన్నట్టు మరచిపోయాను. మరో యిద్దరు మా 'ఫ్రెండ్స్'కూడ వస్తారట. మొత్తం ఆరు టిక్కట్లండీ! అన్నీ రిజర్వుడే!...మరచి పోయ్యేరు' అంటూ హెచ్చరించేది నేను బయలు దేరుతూఉంటే !

ఇక ఆపై నావి కుక్కతిప్పలు!

ఇలా ఎన్ని వెట్టిచాకిరీలు?...తలచుకొంటే మనసు సిగ్గుతో కుంచించుకపోతుంది. 'ఎందుకు నేనింత పతనమైపోయాను? ఏమయింది నా వ్యక్తిత్వం?'అని మనసు పరిపరివిధాల ఆలోచిస్తూ ఉంది. ఎంత ఆలోచించినా పిడుక్కూబియ్యానికి ఒకటే మంత్రమన్నట్లు అంతటికీ ఒకటే సమాధానం!—నా విజయలక్ష్మి యిలా కోరివుంటే చేయలేనా? అని. అయితే విజయలక్ష్మి ఎన్నడైనా యిలా ప్రవర్తించిందా? నన్ను వదలి ఒక్కటంటే ఒక్క సినిమా చూడగలిగిందా?...పోనీ. ఒకటికి ఆరు 'రిజర్వుడు' టిక్కెట్లు తెచ్చియిస్తే, మాటవరుసకైనా 'మీరూ రండి!' అని పిలువకుండావుండేదా?—అసలు నక్కకు నాగలోకానికి సామ్యం కుదర్చడానికి యత్నిస్తున్నట్లున్న ఆలోచనలు నాకే ఎబ్బెట్టుగా కనిపిస్తున్నాయి. తెల్లనివన్నీ పాలని భ్రమించినందుకు తగిన శాస్తి జరిగింది.

అసలు జయలక్ష్మినుండి నేనెలాంటి ప్రతిఫలాన్ని అపేక్షించలేదు. ఆమె కన్నుల్లో విజయలక్ష్మి... ఆమె నవ్వుల్లో విజయలక్ష్మి కనుపిస్తూంటే కేవలం నా తృప్తికోసం గూడుచుట్టు గువ్వలా తిరిగినమాట వాస్తవమే! అయితే మాత్రం అంత సంకుచిత తత్వమా?...అంత కార్యసాధకత్వమా?...

'ఏం గురూ? పెద్దగా ఆలోచిస్తున్నట్లుంది.'—పెద్ద గ్రంథాలయములో చిన్న ఉద్యోగి మిత్రుడు అడుగుతున్నాడు. చెప్పకొంటే తీరుతుందట బాధ. ప్రయత్నించాను.

సూదిలాంటి మనిషి. ఇంతయి, యింతై, యింకెంతో అయినంత నవ్వు నవ్వాడు. 'తగిలితే తెలిసిందా!' అన్నంత కసి వున్నట్టుంది ఆ నవ్వులో. 'క్షణ క్షణముల్ జవరాండ్ర చిత్తముల్' అన్న భావన మిళితమైనట్లుంది ఆ నవ్వులో.

'చూడు బాబూ! శాస్త్రాలు వలికి పనికి బల్లి కుడితిలో పడట్టున్నాయి నీ మాటలు. లేకపోతే పది పన్నెండు రూపాయలు సెలవు. ఓ రెండు గంటల జీవితకాలం వృథా!—దీనితో జరిగిన నష్టం వెరశి—ఆరు సినిమా టిక్కట్లు!—అంతేనా? దీనికే యింత బాధ పడిపోతున్నావే? మరి ఆడదాని చిరునవ్వులంటే సామాన్యమా? సామ్రాజ్యాలు అస్తమించింది వాటితోనే! కోటలు మొదలు కొంపలవరకు నిలువునా కూలింది వాటితోనే!

ఎందరో అందాల బరిణెలు, పాపం! ఎవరో అజ్ఞాత వ్యక్తులను చిరునవ్వులతోనే ఖైదుచేసి, వాళ్ళను బాదిచేసి, వన్నెల విసనకర్రల్లా విహరిస్తూ వున్నారంటే ఆ చిరునవ్వుల ప్రభావమే!—ఇంకెందుకు గురూ!—గాంధీ రోడ్డులో 'పేవ్‌మెంటు' మీద ఓ పాత గోనెపట్టి మరుగులో ఓ రెండు జాకెట్లు నాలుగు డ్రాయర్లు కుట్టుకొని బతికే దర్జీవాడు, కాళ్ళుఆడితేగానీ కడుపు పూడని దర్జాగాడు...రోజంతా కష్టపడ్డ సంపాదనకు మరో రెండు రూపాయలు చేబదులు కలిపి, 'టెరికాట్' గుడ్డ కొంటాడు. ఒర్పు నేర్పునంతా వినియోగించి 'జాకెట్టు' కుడతాడు. ఆపై ఎప్పుడో ఆరున్నొక్క అడుగుల దూరంలో భాసించిన చిరునవ్వులను వెదుక్కొంటూ వెళతాడు ఎండమావులను వెదుక్కొని వెళ్లినట్టు.

'ఎందుకండీ? నేనేదో మాటవరుసకన్నాను. మీకెందుకీ అనవసరమైన ఖర్చు. ప్రయాస!' చిరునవ్వులు చిరుకోపాన్ని సంతరించుకొని కడప కవళల నిలబెట్టుతుంది దర్జీవాడిని. పాపం! అప్పుడు చూడాలి వాడి మథన. పది రూపాయల తేడాతో 'టెండరు' కోల్పోయిన కాంట్రాక్టరు వాడి కంటే ఎంతో నయం.

'అబ్బే! దీనికోసం నయాపైసా వెచ్చించలేదంటే నమ్మండి. ఎవరో నాలుగు గౌన్లకోసం కాస్త యెక్కువగానే కొన్నారు. నేను చేసిందంతా ఆ కాస్త యెక్కువను, మరి కాస్త యెక్కువ జాగ్రత్తతో కత్తిరించడమే!'

చాల చాకచక్యంగా కత్తిరిస్తే, అది పచ్చిఅపద్ధమైనా కానట్లే కనుపిస్తుంది. అయితే 'థేంక్స్' అంటుంది ఆమె. ఆ జాకెట్టును అందుకొంటూ ఒక్కఅడుగు ముందుకువేస్తుంది. రెండడుగులు వెనక్కువేస్తాడు దర్జీవాడు. అప్పుడు వాళ్లిద్దరు ఎక్కడవుంటారో తెలుసా?— ఇంటిబయట ఒక్క అడుగుదూరములో ఆమె. మూడడుగుల దూరంలో వాడు!—'అయ్యో! అలా నిలబడిపోయావే?' అని వాపోతుంది క్రీగంట అతనిని చూస్తూ. ఇప్పుడు చూడాలి దర్జీవాడి దర్జా! — ముసిముసినవ్వులలో మూడువంకరలుగతిరిగి, చేతులు నలుపుకొంటూ తిరుగు ముఖం పడతాడు, 'గుర్‌గర్'మని అరిచే పెళ్లాం, పిల్లల పేవులమీద తడిపి తడిగుడ్డవేయడానికి!'— అని, ఆపి, 'ఎలా వుందంటారు లోకం?'అని అడుగుతాడు. ప్రయత్నపూర్వకంగాకాకుండా ఏదో పరాశక్తి ఆవరిస్తే పలికిన పలుకుల్లా ఉంటాయి అతని మాటలు. వింతగా అతనిని చూస్తూ వినడమే నా వంతు!—

ఆ పై చిరునవ్వుల మాయలో పడకూడదనుకొన్నాను. ఇష్టమొచ్చినట్లు పరుగిడుతున్న మనస్సుకు ముక్కుదారం కుట్టాను. స్వార్థులైన వారిచుట్టు తిరుగడమంత నామూషీ మరొక్కటి లేదన్న పాఠం నేర్చుకొన్నాను. తత్ఫలితం ఆ యింట్లో అడుగు బెట్టడం మానుకొన్నాను ప్రయత్నపూర్వకంగా!

*  *  *

చెప్పినపని కాసంత పొల్లుపోకుండా తన పనేమో తానేమోగా ముందుకుపోయే సేవకుడితో కాలపురుషుడు పోటీపడితే, ఎవరు జయిస్తారో, ఎంతకాలం ఈ పోటీ నెగ్గిస్తామో, చూద్దామని ఓ యజమాని జాగ్రత్తపడి 'క్యాలెండర్లో' దినము ఓ కాగితాన్ని చింపుతూవస్తే ఆరునెలలు దాటినట్లే తెలియలేదు. వేసినచోటనున్న గొంగళిలానే వున్నాడు సేవకుడు. 'కానీ చూద్దాం నీ కథ!'అని కాలపురుషుడు వాడిపై కాలుదువ్వుతూనేవున్నాడు. యజమాని 'క్యాలెండరు' మార్చాడు, దాంతోపాటు యింట్లో మరో యినప్పెట్టె చేర్చాడు!

ఆ రోజు జనవరి **మొ**దలుతేది!

ఆ మొదటితేదికి మనకు అమావాస్యకు పీర్ల పండుగకు వున్నంత సంబంధం. అయినా దినము కనబడుతూ, కనబడినపుడంతా పలుకరిస్తూ, అవసరాన్ని ఆదుకోగలిగిన పరాయివాడు దగ్గరిచుట్టాన్నికూడ చాప చుట్టలా చుట్టివేయగలడు. అందుకే మనదికాని ఆ మొదటిరోజుమీద అంత వ్యామోహం! —ఆత్మీయులకు అభినందనలు...దైవదర్శనాలు...ఏదో తెలియని కలకలము...కలవరము! —

ఆ ముందటి నాలుగేళ్లు నేనూ వూరేగాను విజయలక్ష్మితో కలిసి మొదటి తేది మూడురోజులుం దనగానే బజారుమీద పడేవాళ్లం. బజారు అంతా కొన్నంత సంబరం. తీరా కొనేది జత బట్టలు. ఆ మొదటి తేదీన యిద్దరు తొడుగుకొనేవాళ్లం. ఆపై తిరుమలకు వెళ్లడం...దైవదర్శనం...అదొక జాతర!—మధ్యాహ్నం 'డిన్నరు'పేరుతో ముక్కువరకు మెక్కడం...తినింది అరిగేవరకు యిష్టమొచ్చినట్లు సాయంకాలం వరకు తిరగడం...తరువాత సినిమా. ఆనాటి కార్యక్రమంలో కడపటి అంశం—**ఓహ్**! ఆ రోజులన్నీ ఎంత సందడిగా జరిగాయో, ఈ రోజు అంత మందకొడిగా వుంది. విజయలక్ష్మి లేనిలోటు కొట్టవచ్చినట్టు కనిపిస్తూ ఉంది.గతకాలపు తలపులన్నీ మనస్సును కలచివేస్తున్నాయి. తిరిగాను. తిరగనిచోటు లేదనుకుండా తిరిగాను. కాళ్లు అలసిపోయేవరకు తిరిగాను. ఆపై తీరిగ్గా కూర్చొని, ఓ ఏకాంత ప్రదేశములో కూర్చొని యేడ్చాను కంటతడి ఆరిపోయేవరకు. ఇంకను యేదో బాధ. ఎందుకో జయలక్ష్మినైనా చూద్దామనిపించింది. అందుకే ఆరు నెలల తరువాత ఆ యింట్లో అడుగుపెట్టాను.

జయలక్ష్మి చాల చిత్రమైన మనిషి! ఆమె అర్థంకాని వో సమస్య. నేర్పుగా వల విసరుతుంది. తగులుకొన్న పక్షిలాంటి మానవుణ్ణిచూచి 'పకపక' నవ్వుతుంది తన ప్రతిభకు తానే మురిసిపోతూ!—

సాధారణంగా నావలన కావలసినపని అంటూ లేకపోతే జయలక్ష్మితీరే వేరుగా ఉంటుంది. ఏదో పనిలో మునిగివున్నట్లు నటించడం...అథవా తప్పని సరిగా యెదుటపడవలసివస్తే వో చిరునవ్వు తరగను విసరడం...ఏమమ్మా! పాపం! ఆయనను బెల్లం కొట్టిన రాయిలా కూర్చోబెట్టావే?—అని ఎవ్వరైన ప్రశ్నిస్తే, 'ఏదో పత్రిక చూస్తున్నట్లుందే! చూడనీ!—పాపం. 'డిస్టర్బు' చేయడమెందుకు?' – అని చాకచక్యంగా సమర్థించడం...లేదా ఏదో పని కల్పించుకొని ప్రక్కయింటికి మకాం మార్చడం...ఇవి వేరైన తీరులోని ఆమె లీలలు!...అలాంటి జయలక్ష్మి ఈనాడు నా అలసటను గుర్తించింది. వద్దని వారిస్తున్నా వినిపించుకోకుండా 'కాఫీ' చేయడానికి వెళ్లింది. అదే ఆలోచిస్తున్నాను, ఇది ఆరు నెలలుగా కనబడని ఫలితమా? లేక షరా మామూలైన కార్యసాధకత్వమా? అని.

అంతలో ఆమె వచ్చింది. కాఫీ తెచ్చింది. 'ఏమిటండీ? ఆ పరధ్యానం!' అంటూ కమ్మగా పలికింది. కాఫీలో కమ్మదనము ముక్కుపుటాలను, మాటల్లో కమ్మదనము కర్ణేంద్రియాలను మృదు మధురంగా పరామర్శిస్తున్నా, అంతవరకు నన్ను పరామర్శిస్తున్న ఆలోచనలకుమాత్రం అంతరాయము కలుగలేదు.

కాఫీ అందుకొన్నాను. చాలవేడిగాఉంది. ఆమె చిరునవ్వులు చాల వాడిగావున్నాయి. కాస్త చల్లారనీ అని కాఫీ మేజామీద పెట్టాను. వో కుర్చీ లాక్కొని ఆమె కూర్చుంది నా ఎదురుగా!

'ఇప్పుడు చెప్పండి. మా శాంత అన్నట్లు 'స్ట్రైక్' చేశారేం?'

'దేనిని'—ఆంగ్లభాషలో 'స్ట్రైక్'అన్నపదానికి కొట్టడంఅనే అర్థంకూడవుందని స్ఫురించి అడిగాను.

'మీ పద్ధతిని.'

'ప్రత్యేకించి నాకు పద్ధతిఅంటూ యేమీ లేదు. ఆ పద్ధతిని నేను కొట్టనూలేదు.'

'అనవసరమైన వాదన అనర్థాలకు దారి తీస్తుందికానీ వస్తూవస్తూవుండి వున్నట్లుండి రాకుండా మానివేశారేం!'

'ఏముంది? వీలున్నప్పుడంతా వచ్చాను. వీలు లేకపోయేసరికి రాలేదు. దీనిని వో పద్ధతిక్రింద జమ కట్టవలసిన అవసరమేమీలేదే!'

'మీరు చెప్పిందే కారణమైతే ఫరవాలేదుకానీ, కారణంమాత్రం అది కాదనిపిస్తూఉంది నాకెందుకో! సరేలేకానీ, రాత్రి వో నాటకం ప్రసారమయింది రేడియోలో విన్నారా?' మాట మార్చింది జయలక్ష్మి.

'లేదండీ!'

'అరెరె మంచినాటకం! చక్కని అవకాశం జారిపోయిందండీ!...ప్చ్...మీరూ వినివుంటే!...' తేలిపోతూఉంది జయలక్ష్మి.

'మీలో మీరే అనుభవిస్తే యెలా? ఆ యితివృత్తమేదో...'

'నిజంగా ప్రతిమనిషిని చక్కగా ఆలోచింపచేసే కథావస్తువు...ప్రతివ్యక్తినీ బాధావిముక్తుణ్ణి చేయగల సన్మార్గోపదేశము...పైగా పాత్రచిత్రణ...సమర్పణ చక్కగా కుదిరాయి.'

తినబోయే పదార్థాల రుచినిగూర్చి ఎక్కువగా వింటే తీరా తినబోయేటప్పటికి **మొ**గం **మొ**త్తినట్టవుతుందని తెలియకకాదుకానీ, ఈ ఉపోద్ఘాతంతో మళ్లీ నాకోసం ఏదైనా పల్లం త్రవ్వుతుందేమో అన్న సందేహంతో చూపులు అదోరకంగా మారుతున్న మాట వాస్తవం. గ్రహించినట్లుంది ఆమె!

'అతడొక నిరుపేద కార్మికుడు. కుటుంబ నియంత్రణోద్యమాన్ని కాలదన్ని కుచేల సంతానోత్పత్తి గావించిన ధార్మికుడు. చాలీచాలని సంపాదన...ఆ యిల్లాలి అగచాట్లు...ఆపిల్లల ఆకలి మంటలు...ఆశా నిరాశా వాదాలమధ్య ఆలుమగల కొట్లాటలు...ఆ సంసారం నల్లేరుపై నడక!... తగిలినకాలికే తగులుంది. అతని తల తగులుకొనింది

వో యంత్రంలో ఒకనాడు...ఇక చూడండి! చేతికందని బిడ్డలతో ఆ యిల్లాలి అగచాట్లు...'

'ఇలాంటివి చాల వింటున్నాము. అంతకన్నా ఎక్కువగా చూస్తున్నాము. ఇందులో...'

'చెబుతున్నా వినండి. అతడు పోయాడు. పుట్టిన ప్రతి వ్యక్తీ పోతూనేవున్నాడు. ఇది సహజం. కానీ అతనిలాగ దూరదృష్టి కలవారుమాత్రం సంఘంలో చాల అరుదుగా కనుపిస్తారు.'

'ఏమంటారు?' అన్నట్లు చూసింది నావైపు. అసలు విషయం తెలియకుండానే నేనేమీ చెప్పలేని స్థితిలో మూగనోము నవలంబించాను.

'మొదట అందరు అతనిని నిరుత్సాహపరచిన వాళ్లే. గొర్రెతోక బెత్తడని జ్ఞాపకం చేసినవాళ్లే. దీనిని లక్ష్యపెట్టకుండా అతడు చేసిందిమాత్రం చాల మంచిపని!'

'ఏమిటండీ ఆ మంచిపని?' నాకు తెలియకనే విసుగు ధ్వనించింది నాప్రశ్నలో.

'తన తాహతుకుమించినపని అని తెలిసికూడ అతడొక పాతికవేలకు యిన్సూర్ చేశాడు!'

ఇందులో క్రొత్తదన మేమిటో నాకేమీ అర్థం కాలేదు. తెలుసుకోవాలన్న కోరికవైపుకూడ నా మనసు సుముఖంగాలేదు. ఆ కార్మికుడు తాను చనిపోతానని ముందుగానే కలగని 'యిన్సూర్' చేశాడా? లేక జలగల్లాగ తగులుకొనే ఈ యేజంట్లవాత పడ్డాడా?' ఆలోచిస్తున్నాను.

'భర్త చనిపోయినవార్త ఆమె చెవిని పడడము... ఆ పిల్లల కాకిశోకము... అబ్బ! తలచుకొంటే ఒళ్ళు జలదరిస్తుంది! కానీ ఆ 'యిన్సూర్'మాట చెవిని పడడము... ఆ డబ్బు చేతికందడం... ఎంత తేలికైపోతుందనుకున్నారు మనసు!' పరవశించి పోతుం దన్నట్లు తోచింది. ఆమె పొందిన అనుభూతిని అర్థం చేసుకోలేక తికమకలు పడడంతో నోట మాట రాలేదు.

'అప్పుడనిపించింది నాకు, ప్రతి ఒక్కరు యిన్సూర్‌చేసి తీరాలని! మీ రేమంటారు?'అడుగుతూ ఉంది ఆమె.

'నేనంటాను మీతో యేకీభవించలేనని!'

'కారణం?'

'అన్నిటికీ కారణాలు దొరకవు.'

'అంటే!'

'అంటే, ఆత్మవిశ్వాసం లేనివాళ్లే ఈలాంటి వాటిమీద పడుతూఉంటారు. లాటరీలు, రేసులు కూడ ఈ కోవలోనివే...ఎందుకో వీటన్నిటిపైన నాకేమో తగనిమంట!'

'అయితే యింతవరకు మీరు యిన్సూర్ చేయ లేదన్నమాట!'

'అన్నమాటేమిటి?...లేదు.'

'చాలా విచిత్రంగావుంది.'

'ఉంది.'

'ఉన్నదేమిటి? దీనికేమైనా నామకరణ ముందా?'

'ఉంది. నామీద నాకు నమ్మకముంది. కాబట్టి యిలాంటివాటిమీద అపనమ్మకముంది.'

'అయితే యికమీదటకూడ యింతేనా?'

'అంతే! — అయినా యిదేమిటండీ? మీరే ఏజంటు అయినట్టు, లేదా వకాలత్ పుచ్చుకొన్నట్టు వాదిస్తున్నారు.'

'అబ్బే! అదేమీలేదండీ! మాటవరుసకి అడుగు తున్నాను. అయినా మీకోసం మీ భవిష్యత్తుకోసం 'యిన్సూర్' చేయడం మంచిదండీ! ఇందులో తప్పు కూడ ఏమీకనుపించలేదు. ఇప్పుడుమాత్రం మించి పోయిందిలేదు. ప్రయత్నించి చూడండి!'

'అది జరుగదులెండి.'

'అదేమిటండీ? అలా అంటారు. మీరేమీ యిలానే వుండబోరుగా? పెళ్లిచేసుకొంటారు. తరు వాత పిల్లలు...కనీసం వాళ్లకోసమైన మీరు కాస్త

వెనుకేయాలి. పోనీలే ఈ సోదెందుకు? ఒకవేళ నేనే ఏజంటునైతే...మిమ్మల్నే 'ఇన్సూర్'చేయమని అడిగితే..!

అదో మళ్లీ అవే చిరునవ్వులు...నన్ను పిచ్చి వాణ్ణిచేసి ఈ లోకాన్ని మరపించగల మత్తుమందు లాంటి రవ్వలు ..

సమాధానంకోసం మనస్సుతోపాటు నోరు తడ బడుతూఉంది. అదే చిరునవ్వుతో ఆమె అవనత శిరస్కయై, నన్ను క్రిగంట విలోకిస్తూ... టేబిలు సొరుగు తీస్తూమూస్తూఉంది. పిచ్చుకలు అరు స్తున్నాయి. పంచన నామాల ఆసామి కళ్లద్దాలతో అన్వేషిస్తున్నాడు దేనికోసమో? నట్టింటిగూటిపైన నలుగురు దేవుళ్లు నన్నుజూచి నవ్వుతున్నారు జాలిగా.

'చెప్పండి!'

జయలక్ష్మికాదు—నా విజయలక్ష్మి నన్ను నిల దీసి అడిగినట్లుంది. ఈమాత్రం నాకోసం చేయ లేవా? అని బ్రతిమలాడుతున్నట్లుంది.

వ్యక్తం చేయలేని అనుభూతి నన్ను వివశుణ్ణి చేస్తూఉంటే, మాటవరుసకి అడిగినప్పుడు యింత సందేహ మెందుకని? మనస్సు నోవైపు మందలిస్తూ ఉంటే, నాకు తెలియకనే వూగింది నాతల అడ్డంగా మాత్రంకాదు ఔనని! కిలకిలా నవ్వింది ఆమె!

ఆనందపరవశురాలైన నా విజయలక్ష్మి కంటి నిండుకు కనుపిస్తూ ఉంటే, అలానే చూస్తూవుండి పోయాను. ఆ అనుభూతి కొన్నిక్షణాలు మాత్రమే!

'మీరు మంచివారు. మాట తప్పనివారు. మాటవిలువ తెలిసినవారు. . .'

ఆమె చెబుతూవుంది. ఆ మాటలు నాకు అర్థంకానిమాట వాస్తవం. అందుకే అర్థరహితంగా ఆమెను చూడడం నావంతు అయింది.

అంతలోనే బయటకులాగిన టేబిలు సొరుగు ఆగిపోయింది. అందులోనుండి ఆమె బయటికి తీసింది వో కాగితాన్ని! నా చేతి కందించింది. ఆ కాగితం స్వరూపం కంటబడేసరికి కంటిలో నలుసుపడినట్లు యింది. కడుపులో రాయిపడినట్లుయింది.! బైర్లు కమ్మిన కండ్లు ఆ కాగితాన్ని చదువలేక పోతున్నాయి! —ప్రయత్న పూర్వకంగా పరిశీలించాను. జీవిత భీమా సంస్థవారు ఆమెను 'ఏజంటు'గా నియమించిన అధికార పూర్వక పత్రమది!

'మంచి మనసు కలిగిన మీ లాంటివాళ్ళు మొదట బోణీచేస్తే—బిజినెస్ బ్రహ్మాండంగా జరుగు తుందట! ఏమంటారు?'—చిలిపిగా అడుగుతూ ఉంది ఆమె!

ఒళ్లు చల్లబడింది. అంతకంటే చల్లబడి పోయిన టేబిలుమీద కాఫీనీళ్లు ఎండినగొంతులో ఎటూపోలేక కనుకొలకుల్లో నిండగా, అంతకంటే నిండుగా నవ్వుతూ ఉంది ఆ భామ జీవిత భీమా విజయంలో!

---



# కవిత్వము - కావ్యవస్తువు - కావ్యకథ

శ్రీ కేతవరపు వేంకటరామకోటి శాస్త్రి

కవిత్వము పాఠకుల హృదయాలను స్పందింపజేయగలుగుట, ఆలోచనలను ప్రేరేచి మనస్సునకు పని గల్పించుట అన్న రెండు లక్షణములను కలిగియుండవలయును. హృదయము అందమువైపు, మనస్సు ఆలోచనవైపు మొగ్గును. సాధారణముగా కవు లధికముగా అందమును సమకూర్చు ప్రయత్నమును చేయుదురు. మన మన్నివిషయములను ఇంద్రియములద్వారా అనుభవించుచున్నాము. అందము మూర్తములయిన కళల యందు చక్షురింద్రియ విషయము. అమూర్తము లందు మరియు శబ్దముతో చేయబడిన కవితా కళ విషయమున అందము శ్రోత్రేంద్రియ విషయము. దాని ద్వారముననే అది మనోనేత్ర విషయమగును. మనోనేత్రము ముందు సర్వాంగ సుందరముగా ప్రత్యక్షమగుటకే ఉపమా రూపకా ద్యలంకారము లుపయోగింపబడును.

కవిత్వమున నెక్కువపాలు హృదయావర్జక లక్షణమునే కలిగి కనిపించుచున్నది. మానసికమైన ప్రేరణ ముఖముగా ఎక్కువ కవిత్వము కనిపించుట లేదు. మానవజాతి పూర్వ నాగరకతల యందు హృదయావర్జకతయే కవిత్వ లక్షణముగా భావింపబడినది. అందువల్లనే మన సాహిత్యవిద్యాశాస్త్రమంతయు అలంకారశాస్త్రము నాబడినది.

అలంకార్య వస్తు విచారణమునకంటె అలంకార సామగ్రి వివరణమునందా శాస్త్రకారుల చొరవ ఎక్కువగా పనిచేసినట్లు ఆయా గ్రంథములే నిదర్శనము పల్కుచున్నవి.

కవిత్వము తన అందచందములచేత మాత్రమే కాక, తన అద్భుత గుణములచేతను ప్రజల నాకర్షించుట పెట్టుకొన్నది. ఒక్కొక్కసారి ఈ రెండు గుణములును ఏకాకారమున ప్రత్యక్షమగుటయు కలదు.

సర్వభాషా కవులకును కవిత్వము వ్రాయుటకు కావలసిన ప్రథమ గుణము సర్వద్వంద్వముల నల్లని తాకిడికి చలించి రేగు భావోద్రేకము. దానిని పాఠకుల హృదయముల నాకర్షించునదిగాచేసి ప్రదర్శించుటకు కవిచేయు ప్రయత్నమంతయు రచనా శిల్పము.

కవిత్వము పాఠక హృదయావర్జకము కావలయునన్నచో ముం దందుకైన రచన అట్టిది కావలయును. రచనమనగా శబ్దసంయోజనము. శబ్దమనగా నర్థముకూడ. శబ్దార్థ రచనా విశేషము ప్రథమాకర్షకము. దాని విషయమున కవి జాగరూకుడై గట్టి ప్రయత్నము చేయవలెను. ఆ ప్రయత్నమున నాతని కృతార్థతనుబట్టి అతని కవిత్వము పాఠకుల అంతఃకరణముల కెక్కును.

మామూలు వచనమునలేని అంతర్లయ ఒకటి కవిత్వమునందు శ్రవణేంద్రియముద్వారా బుద్ధి కెక్కుచుండును. ఆ లయ శబ్దరచనారీతివైలక్షణ్యముచేతనే సంపాదింపబడుచున్నది. లయలేకుండ కవిత్వములేదు. ఇట్లనుటకంటె రీత్యాత్మకము కాకుండా కవిత్వము లేదనుట మంచిది. శబ్దసంయోజనాప్రయత్నము వల్లనే రీతి యేర్పడుచున్నపుడు, కవిత్వాభివ్యక్తి యెల్లను తద్రీతిమయమే అయినప్పుడు రీతిరాత్మా కావ్యస్యఅన్న వామనాచార్యుడు లెస్సగా నాలోచించియే అన్నాడనవలయును. ఈ కావ్యాత్మ సిద్ధాంతము దేశకాలములతో నిమిత్తములేకుండా సర్వభాషాకవుల కవిత్వమునకును నిరాక్షేపముగా వర్తించునది. శబ్దమైత్రి, శ్రవణసుభగత్వము, ఛందోవైచిత్రి ఈ మొదలయిన కావ్యలక్షణముల పేర్ల నంగీకరింపకపోయినను

కవియైనవాడు తాను వ్రాసినది కవిత్వముగా – వచనమునకంటె భిన్నముగా—కన్పించుట కేమిచేయుచున్నాడనగా పదముల నెంచుకొనుచున్నాడు. తన యర్థముల నందింపగల పదములనెన్ని వానిని అందముగా ధ్వనించుట నుద్దేశించి వచనక్రమముకాని తన కుచితమని పించిన ఒకానొక విలక్షణక్రమమున పాదనియమములు పెట్టి సంయోజన చేయుచున్నాడు. ఈ పాద నియమము తోడి విలక్షణమైన శబ్దరచనయే కవిత్వమును కవిత్వముగా గుర్తింపజేయుచున్నది. నిజము చెప్పినచో కవిత్వము కనిపించదు. ఇచ్చట కవిత్వమున్నదన్న విషయము నెరుకపరచునది రచనారీతి. కవిత్వమునకు రూపములేదు. అందువలన వాని రూపము రచనారీతి యగుట కభ్యంతరములేదు. కవిత్వమును రీతిరూపమున దర్శించి రసరూపముగా ననుభవింపవలయును. అందువల్ల ప్రతిభాషాకవియు శబ్దసంయోజనము మీదనే పనిచేయుచున్నాడు. పద్యరచయితలు—గేయ రచయితలు – వచనపద్యరచయితలు—చివరకు అకవితా రచయితలు—ఈ అందరును—కవులయినవారు—శబ్దసంయోజనము విషయమున శ్రద్ధగలిగి పనిచేయుచున్నారు.

మానవ మనఃప్రపంచమును తీవ్రసంచలనమునకు గురిచేసి ఆవేశములను, ఆలోచనలను ప్రేరేపించు విషయములు మతతాత్త్వికక, సాంఘిక రాజకీయములు. కవిత్వమున కేదేనొక ప్రేరణ మవసరము. ఒకప్పుడు మతతాత్త్వికక విషయములు కవిత్వమునకంటె వేరుగా లేనేలేవు. ఆనాడు కవిత్వము మతతాత్త్వికక విషయములనే వెలయించెడిది. ఆనా డవియే ఆలోచనా విషయములు. మరియు ఆనాడు ఆలోచన అన్నది అందరకు సంబంధించినదికాదు. ఆలోచించుట కొక వర్గము నా సమాజ మేర్పాటు చేసికొన్నది. వాటి నాలోచించిన మేధావివర్గము సాధారణ జనతండమునకు తద్విజ్ఞానము ననేకరూపముల నందించినది. కాలము మారినది. మానవుల మనుగడలు మారినవి. మతతాత్త్వికక విషయముల నాలోచించు మానవు లీనాడు లేరు. నేటి మానవుని ఆలోచన ఎంతసేపటికిని సాంఘిక—ఆర్థిక—రాజకీయ విషయముల చుట్టు బరి తిరుగుచున్నది. ఈనా డివియే ఆలోచనలను ప్రేరేపించు విషయములు. ఆలోచన ప్రేరణము కవిత్వలక్షణమనినచో ఒక కాలమున మత తాత్త్వికక విషయములును, నేటికాలమున సాంఘికార్థిక రాజకీయ విషయములును కవితావస్తుసంభార మని చెప్పవలయును. అగుచో వస్తుసంభారమునందు కవిత్వములేదు. ఈ వస్తుసామగ్రి తన పని తాను సలక్షణముగా చేయుటకు యోగ్యతగలదిగా నొనర్పబడ వలయును. ఆ యోగ్యతాసంపాదనము పాఠకజన హృదయావర్జక లక్షణముకలది. అది శబ్దసంయోజనము విషయము. అది రచనారీతి విశేషము. ఈ రచనారీతి విశేషలక్షణలక్షితముకాని మతతాత్త్విక, రాజకీ యార్థిక సాంఘిక విషయములన్నియు వట్టి నీరసమైన మతతాత్త్వికక రాజకీయార్థిక సాంఘిక విషయములు మాత్రమే. అవి కవిత్వముకావు. మత తాత్త్వికక విషయములతోనున్న దొకప్పుడు కవిత్వమైనట్లే ఇంకొకప్పుడు రాజకీ యార్థిక సాంఘిక విషయములతోనున్నది కవిత్వ మగుచున్నది. ఇందులో మంచిచెడ్డలులేవు. హెచ్చుతగ్గులులేవు.

మరి కవిత్వమున కవితావస్తువుస్థితి యెట్టిదని విచారింపవలయును.

## 2

కావ్యరచనా సందర్భమున కాస్పదమైన భావము కావ్యవస్తువు. భావము అది దేనిని గురించినదైనను కావచ్చును. మరియు నది ఏ రూపమున నుండినను ఉండవచ్చును. కథారూపమున నుండవచ్చును. వట్టి వర్ణనగా నుండవచ్చును. కేవల మొక చిత్తవృత్తి విశేషముగా నుండవచ్చును. నైతికధర్మ స్వరూపాత్మకముగా నుండవచ్చును. జిజ్ఞాసా విషయ రూపమున నుండవచ్చును. భగవద్గుణ సంకీర్తనముగా నుండవచ్చును. సాంఘిక రాజకీయ చైతన్య లక్షణ లక్షితముగా నుండవచ్చును. అది యిట్లే యుండవలయునన్న నియమము లేదు. అందువల్లనే కావ్యవస్తువునకు నానాప్రకారలక్షణ మాత్మ గుణముగా నున్నది.

కావ్యపరమార్థము రస్యమానము కావలయును. అనగానది ఆస్వాదింపబడవలయును. అందువల్లనే ఆట్లాస్వాదింపబడు పరమార్థము రసమనబడు చున్నది. రసమును భావించునది భావము. మరియు భావింపజేయునదియు భావమే. కవి రసమును భావించును. తన భావించిన దానిద్వారా ఇతరులను భావింపజేయును. ఇతరులను భావింప జేయుటకు కవి ఏమి చేయుచున్నాడనగా తాను భావించిన భావమును అనేక రూపముల రచనా విధానములచేత సందర్భపరచుచున్నాడు. అందువలన కావ్యవస్తువు మొదటిదశ భావదశయే.

భావములేక రసము లేదు. రసముగా పరిణమించజాలని భావమును లేదు. విభావ అనుభావ వ్యభిచారిభావ సంయోగముచేత రసము నిష్పన్నమగుచున్నది. ఈ రస నిష్పత్తి సూత్రమున ఉపసర్గలను తొలగించినచో రసనిష్పత్తికాస్పదముగా నొక్క భావమే నిలబడును. అదియే కావ్యవస్తువు. రసమును నిష్పన్నము చేయుట కది దశాంతర్దశామార్గమును పట్టి అంతర్వేగముచేత నొకగతి విశేషమును పొందును. ఆ గతి ముఖమునుండియే రసము నిష్పన్నమగును. కేవల భావము భావమాత్రముగానుండి రసమును నిష్పన్నము చేయలేదు. అది విభావముగా, అనుభావముగా, వ్యభిచారిభావముగా దశాంతర్దశావస్థలను పొంది ఏతదవస్థాసన్నికర్షణముచేత అపుడు రసనిష్పన్నసామర్థ్యము కలది యగుచున్నది.

భావ మదియొక్క చిత్తవృత్తి విశేషము. అన్ని చిత్తవృత్తులును రసములుగా పర్యవసించునా? కావలయునని సమర్థత కలిగి పర్యవసింపజేసినచో పర్యవసింపవచ్చును. రసముగా పరిణమింపజాలని భావము లేదనియే చెప్పుచున్నాము.

కవియొక్క చిత్తవృత్తివిశేషము నుండియే కావ్యవస్తువు సముత్పన్నమగుచున్నది. చిత్తవృత్తులన్నియు మహోదాత్తములు కావు. అయినచో చిత్తవృత్తి నిరోధక రూపమైన యోగ మంత శాస్త్రముగా ప్రసిద్ధి కెక్క నక్కరలేదు. అందువలన చిత్తవృత్తి విశేషరూపములైన అన్ని భావములును మహోదాత్తములు కావు. కావ్యము బహుశార్థసాధక లక్షణము కలది కావున అది ఉదాత్త భావములనే ఆదరింపవలయును. ఉదాత్తత యనగా విశ్వశ్రేయ లక్షణము. అదియే కావ్యలక్షణముకూడ. విశ్వశ్రేయస్సనగా విశ్వప్రయోజనమని. కావ్యము ప్రయోజనము విశ్వజనహితము నభిలషించి ప్రవర్తించుట. అగుచో కావ్యవస్తువైన భావము విశ్వజనహితాభిముఖమైనదై యుండవలయును. తాదృశమైన హితమును కవి భావించి తన రచనా సందర్భముచేత విశ్వజనముచేత నాహితమును భావింపజేయవలయును. ఏది ఎంతగా భావింపబడునో అది అంతగా సిద్ధించును.

మరి వస్తుగౌరవము కావ్యగౌరవమునకు తోడ్పడుటలేదా? తోడ్పడుచునేయున్నది. కాని సరిగా తోడ్పడుటలేదు. శక్తిమహితుడైన కవికి తోడ్పడుచున్నది. అశక్తునకు తోడ్పడుటలేదు. దానికి కారణమిది: శక్తిమహితుడా వస్తువును విశ్వజనహిత తాత్పర్యముతో జోడించినాడు. అశక్తుడు జోడించుటలేదు. కవియొక్క శక్తి తన కావ్యవస్తువును విశ్వశ్రేయ స్సంపాదన సామర్థ్యముకలదిగా తీర్చిదిద్దును. ఇట్టి సమర్థత నెవడు తన రచనా సందర్భమునందిము డ్చునో వాడు నిజముగా కవి.

కవి సుందరములైన భావములనే వ్రాయవలయునను వారు ఒక్క ఆనందమే కావ్యప్రయోజనముగా భావించిన వారు. ఆ యానందము కాలాంతరమున కాదు. అది సద్యఃపరనిర్వృతి. విశ్వజనహితతాత్పర్యమునందానందములేదా? ఉన్నది, కాని దీని యనుభవమున కమితమైన మానవతాసంస్కారము కావలయును. వట్టి సుందరములైన వస్తువులను చూచి ఆనందించుటకు సాధారణబుద్ధి చాలును. వెనుకముందు లారయని ప్రాపంచిషయము వెంటబడిపోవు చిత్తవృత్తియే సాధారణబుద్ధి. ఇది ప్రబలమైనప్పుడు సంపూర్ణముగా కావ్యవస్తువు నధ్యయనము చేయుట పోవును. కవి సుందరములైన వస్తువులనే వర్ణించవలయునను వారొకవిధముగా సోమరులు. కావ్యమెక్కడ తీసిన

అక్కడ సుందరవస్తువర్ణనముండి వారి కానందమును సమకూర్చవలయును. ఆద్యంతములుగా వ్యాపించియున్న కావ్యపరమార్థమును గ్రహించి ఆనందించుటకు శ్రమ చేయవలయును. వారు చేయరు. అట్లు శ్రమ చేయ లేనివారు వారి కనువైన సిద్ధాంతము నొకదానిని లేవదీసి ప్రచారము చేసిరి.

ఇంతకును కావ్యవస్తువు ఈ ఫలానా విధము గానే ఉండవలయునన్న నియతిలేదు. అది దాని యిష్టమువచ్చినట్లుండవచ్చును. అది సప్రయోజన ముగా నుండవలయును. విశ్వశ్రేయస్సే ప్రయోజనము. ఇంతకుమించి కావ్యవస్తులక్షణమును నిష్కర్షించుటకు కుదురదు. కావ్యకథారూపమున దీని నింకను విచారింపవచ్చును.

### 3

కథా మహితముకాని కావ్యమును కవులు భావింప లేదు. భరత మహర్షి ఈ కథనే ఇతివృత్తమని చెప్పెను. అది పంచసంధులతోకూడి దృశ్యశ్రవ్య కావ్యములయందు ప్రవర్తించును. భరతుడు మొదట అన్ని విషయములను దృశ్యకావ్యములకు సంబంధించినవి గనే విచారించి నిష్కర్షించెను. ఆ పిమ్మట ఆ నిష్కర్షలే శ్రవ్యకావ్యములకును వీలైనంతవరకు సమకూర్పబడుట ఆచారమైనది. అందువలన కావ్యకథ యందు ఆధికారిక ప్రాసంగిక భేదములును ఏర్పడినవి. ఉత్కృష్టమైన ఫలప్రయోజనముకలది ఆధికారికేతివృత్తము. ఆ ఫలప్రయోజన నిరూపణ మెప్పుడును అందుకు తగిన ధీరోదాత్తాది నాయక పురుషులలో ఒకనికి సంబంధించినదిగా నుండును. ఈ విధముగా కథకును కథానాయకునకును అవినాభావ సంబంధమేర్పడుచున్నది.

కావ్యమున కథకు నొక విశిష్టమైన ప్రయోజనముండవలయును. మరియు దాని పెశేష లక్షణములను నన్నయగారిట్లు పరిష్కరించిరి. 1. అది ముందు హృద్యముగా నుండవలెను 2. అపూర్వ విషయముగాకూడ నుండవలెను. 3. దానివలన శ్రోతలకు సంపూర్ణమైన జ్ఞానము కలుగవలయును. 4. పాపములను పటాపంచలు చేయగలదిగా నుండ వలయును.

నన్నయగారి సిద్ధాంతము కావ్యము విశ్వమునకు శ్రేయోమార్గములను ప్రబోధించునది కావలయునని. ఈ ప్రయోజనము ఈడేరవలయునన్నచో ఆ ప్రబోధము ప్రజల కందవలయును. ప్రజలను తనవైపు ఆకర్షించుకొనుటయు దాని యందుండవలయును. ఏతత్ప్రబోధమును ప్రధానమైన ప్రయోజనముగా కావ్యము వ్రాయపడినప్పుడు దానినందజేయుట సాధనముగా గ్రహింపడినది. కథ—ఇతివృత్తము—మొట్ట మొదట అది హృద్యముగా నుండవలయును. ఆ కథ ప్రజాహృదయములను ఆకర్షింప గలిగినదిగానుండ వలయును.

ప్రజాహృదయము లెట్లువైపు ఆకర్షింబడును? అపూర్వ విషయములవైపాకర్షింపబడును. అందువలన కావ్యముస కథ జనాకర్షకముగా నుండవలయునన్నచో, అది ప్రజాహృదయముల నాకట్టుకొనవలయునన్నచో అది అపూర్వముగా నుండకతప్పదు. ఎప్పుడును అపూర్వమైనది ఆశ్చర్యకరముగా నుండును. జనసామాన్యముగా నాకర్షించుటకు వారి నాశ్చర్య చకితులను చేయవలయును. తాదృశమైన శక్తిగల వారినే జనత గౌరవముగా చూచును. వినయవిధేయత లతో మెలగును. చెప్పినట్లు చేయును. జనసామాన్య మేవిషయము నండైనను అట్లే ప్రవర్తించును.

ఇంతగా కవి అపూర్వకథాసంవిధానములచేత తన కృతిని పాఠకులకు—శ్రోతలకు—హృద్యముగా నేల చేయవలయును? అది కవి బాధ్యత. ఎందుకనగా ప్రజాసమూహమున కవసరమైన విజ్ఞానమును సంపూర్ణముగా కవు లందింపవలయును. అజ్ఞానులను విజ్ఞానులుగాచేసి వారి యఘపంకజీవితముల నుద్ధరింపవలయును. కవి ఆశించెడి ప్రయోజనమదియే. కవి కృషియంతయు తత్ప్రయోజనసిద్ధి నభిలషించియే సాగును. అఘనిబర్హణ మాచరించునదిగా కావ్యమున కథ యుండవలయును. కావ్యకథాశ్రవణమువలన మానవుడు తాను దిగబడుచున్న అఘపంకము నెరిగి దాని

నుండి వెళ్లగించుకొని బయటకురావలయును. మానవుని జీవిత మఘపంకమయ మెందుకగుచున్నది? పాపములు చేయనిది మానవజీవితము వెళ్లదా? వెళ్లక పోవుటయే కనిపించుచున్నది. పాపములుచేయక తప్పని పరిస్థితులను తొలగించుకొనుటకు ప్రజలకు కావ్యము మార్గములను నిర్దేశింపవలయును. అనగా కవులు కావ్యమున కథల నట్టి మహోదాత్తమైన ప్రయోజనముల నాశించి కల్పించవలయును. లేదా ఎన్నిక చేయవలయును.

మొట్టమొదటి ఆంధ్రభాషాకవి నన్నయగారు కావ్యమున కథాస్వరూప మెట్టిదిగా నుండవలయునో దానిని పైవిధముగా నిరూపించిరి.

కావ్యకథకు హృద్యత—అపూర్వత రెండును ప్రధానమైన స్థూలవిషయములు. పాఠకుల కెరుకను సమగ్రపరచుట దాని పరమప్రయోజనము. ఆ యెరుక వలని లాభము అఘనిబర్హణము. మానవుడు తనను తన పరిసరములలో తన పరిస్థితులలో తన ప్రవృత్తులలో తానెరుగుకొనుటయే వాని యెరుక సమగ్రమైన దనుటకు గుర్తు.

కవి తన కావ్యకథను తాదృశమైనదిగా గ్రహింపవలయును. బుద్ధిమదగ్రేసరులైన వారట్టి కథలనే విందురు. అవే వారి కిష్టము. వారు శౌనకాది మహర్షులు. ప్రజాక్షేమమున కభిముఖులై వాఙ్మయమును ప్రవర్తింపజేసిన మహానుభావులు.

కావ్యమున కథ ఎట్లుండవలయునో నన్నయ్యగారు చెప్పినది పరమార్థభూతముగా నున్నది. కథాలక్షణము—కథాప్రయోజనము రెండును ఆయన స్పష్టముగా చెప్పనే చెప్పెను. కావ్యమున కథ యనగా కథాత్మకత్వముచేత వ్యవహారమునకువచ్చిన కావ్యము. కథాలక్షణమే కావ్యలక్షణము. కథాప్రయోజనమే కావ్యప్రయోజనము.

అపూర్వత్వముచేత హృద్యముగానుండి, విజ్ఞానమును సమగ్రముచేసి మానవతను పాపకర్మాచరణమునుండి నిగ్రహించు పరమప్రయోజనమును సాధించువది కావ్యము.

మానవజాతి పాపకర్మ లెందుకు చేయుచున్నది? కామక్రోధాది అంతశ్శత్రువులు బలవంతములై చేయించుచున్నవి. అంతశ్శత్రువర్గమంత బలవంతమై విరుచుకొని మీదబడుటకు కారణము? సంఘజీవన విధానము. అది మారినచో మిగిలిన వన్నియు మారును. మానవజాతి పాపకర్మాచరణమునుండి వైతొలగవలయునన్నచో వారి సంఘజీవనవిధానము వారి నందుకు ప్రేరేపించునదిగా నుండరాదు. అట్టి సమాజమును రూపొందించు బాధ్యత నీడేర్చునదిగా కావ్యముండవలయును. సమాజమట్లు రూపొందుటయనగా జనత సంపూర్ణమైన సామాజికచైతన్యమును పుంజుకొన్నదగుట. సంఘ మిట్లగుటను కవిత్వమే సాధించవలయును. ఇంత బాధ్యత కవిత్వమున కుండుటయే సోషలిస్టు లక్షణము.

సంఘశ్రేయము నభిలషించిన పనులన్నియు సంఘప్రజాసమూహమున కెరుకపడియుండుట ముఖ్యము. మనము మనము చేయు కవిత్వరచనారూపమైన కర్మవలని ప్రయోజనమును ప్రజాసమూహము చైతన్యమునందు చూడదలచినప్పుడు మన కృతి వారిని ప్రభావితులను చేయునట్లుగా చూచుకొనవలయును. మనము చెప్పునది వారి కర్థమైనప్పుడుకదా దాని ప్రభావము సంగతి? అందువలన ముందు మనము ప్రజాసామాన్యమున కవగాహన కాగలిగెడు సాధారణ భాష నవలంబించి రచన చేయవలయును. నన్నయగారు విశ్వశ్రేయము నభిలషించినందుననే తెనుగు నవలంబించి రచన చేసినది.

ఆనాడు తెనుగులో నొక కావ్యము రచించుటయే పెద్దవిషయము. మహాభారతబద్ధనిరూపితార్థమది తెనుగుదేశము ప్రజలభాషలో నుండవలయుటను రాజరాజనరేంద్రచక్రవర్తి అభిలషించుటయే ఆయన సామాజిక దృక్పథమునకు నిదర్శనము. సంఘశ్రేయము మహాభారతమునందున్నది. అది తన వారికందరకు తెలియవలయును. అందుకని వారి భాషలో సంస్కృత మహాభారతమునందున్న సంఘశ్రేయోవిధానమైన సర్వార్థమును నన్నయగారిచేత

ఆయన వ్రాయించినాడు. కవియం దింతటి బాధ్యతను పెట్టుటయే – తెనుగున రచింపుమధిక ధీయుక్తి మెయిన్—అని అన్నదాని యర్థము.

4

కావ్యమున కథ ఉండి తీరవలయునన్న నియమేమన్న కలదా? లేదు. అట్లన్నాము కదాయని అది లేక పోలేదును. నాట్యశాస్త్రమునందున్న ఇతివృత్తము విషయము మనకు తెలియును. సక్రమమైన భావాభివ్యక్తికి కావ్యప్రపంచమున అత్యంతము మూలహేతువైనది కథావస్తు నిర్మాణ మర్మజ్ఞతయే. ఏ భావము యొక్క అభివ్యక్తి అభిలషింపబడినదో దాని కనుకూలములైన పాత్రలు—సన్నివేశములు సంఘటనలు సమకూర్చబడవలయును. ఆ సమకూర్చుటపేరే కథావస్తు నిర్మాణ మర్మజ్ఞత. సమకూర్చబడునవన్నియు బహిర్విషయములు. అనుభవ మది యాంతరంగికము. బహిర్విషయముల సమకూర్పు అంతర్విషయమును ప్రేరేచును. ఏది కవిచేత అనుభవింపబడుచున్నదో అదే అభివ్యక్తికగుచున్నది. కవి యనుభవ మనుభవముగా వితరులయందు ఫలించుటకు కథావస్తు నిర్మాణ మవసరమగుచున్నది. కథావస్తువనగా కవి శబ్దముద్వారా అభివ్యక్తము నేయుచున్న స్వానుభూతమైన అర్థ విశేషము. ఇదే కావ్య పరమార్థము. ఈ పరమార్థము పాత్రములద్వారా, సన్నివేశములద్వారా, సంఘటనల ద్వారా సుష్ఠుగా ప్రతీయమానము చేయబడినప్పుడు సహృదయులైన పాఠకుల హృదయములయందు సుప్తములట్లు పడియున్న వాసనలు తత్స్పర్శనమున మేల్కొని తాదాత్మ్యమును భజించును. ఈ విధముగా కావ్యమున కథ పాఠకులను కవి హృదయమునకు దగ్గరగా లాగుచున్నది. కవికి పాఠకులతో పని యున్నదనుకొన్నంతకాలము కావ్యమునకు కథ యుండితీరవలయును.

అయినచో కావ్యమున కథకింత ప్రాముఖ్యమున్నదా? ఈ ధోరణినిబట్టి చూడగా కథయే కావ్యముగా కనిపించుచున్నది. అప్పుడు కథా కావ్యములే కావ్యములగును. కానికావు. ఏమనగా : కథా కావ్యములయందు కథకు ప్రాధాన్యము. కావ్యకథయందు భావాభివ్యక్తికి ప్రాధాన్యము. అభివ్యక్త్యుద్భవమునబడి భావము చిత్రచంక్రమణముచేసి రసముగానగును. వట్టికథ రసముకాదు. కథకు ప్రాధాన్యమనగా రసమునకుకాదని యర్థము. కావ్యమున కాత్మరసముగాని కథకాదు. అందువలన కావ్యమున కుదాహరణ కథా కావ్యముకాదు. భావకావ్యమే కావ్యము. అనగా అభివ్యక్తివైచిత్రి కలదని యర్థము. ఈ వైచిత్రివలననే ఆ భావము రసముగానగును. ఈ వైచిత్రి సంపాదనమునకే కథావస్తువరణము. కావ్యకథయనగా నది. కవి చేత ఉద్దేశింపబడిన భావము—అనగా అర్థవిశేషము—పాఠకులచేత తాదాత్మ్యముమై అనుభవింపబడుకొరకు సమకూర్చబడిన పాత్రలు—సన్నివేశములు — సంఘటనల పరంపరలు ఈ మొదలుగాగల వస్తుసామగ్రి ఏది కలదో అదంతయును ఏకరూపమున కావ్యకథ యనిపించుకొనును.

అయినచో మరి పాత్రలు లేకుండ ఏవో సన్నివేశములు, ఏవో సంఘటనలు ఆధారముగా మనస్సున పెట్టుకొని కావ్యరచన చేయకూడదా? కూడదని లేదు. ఈవేళ రేపువచ్చు ఆధునిక కావ్యములన్నియు నట్లే యున్నవి. పాత్రలు లేవందున అభివ్యక్తి విధాన మయోమయముగా నైనది. అభివ్యక్తి అయోమయమైనందున అనుభవతాదాత్మ్యము పాఠకులయందు కలుగుట లేదు. కవి తన యనుభూతిని పాఠకుల కందీయ గలిగిన అభివ్యక్తిరీతిని అనుసరింపకుండుటచేత ఈ యిబ్బంది కలుగుచున్నది.

పాత్రలు లేకుండ అభివ్యక్తి విధానము అయోమయముకాకుండ రచించుట కవకాశము లేదా యన్నచో ఉన్నది. లేదని మనమేల అనవలె. ఎవడో నూటికొకడట్టి వాడుండును. మరి మిగిలిన వారిమాట?

అందువల్ల కవులు కావ్యకథల నెన్నుకొనియే రచింపవలెను. ఆధునికులైన అభ్యుదయ కవులు 'ఇతిహాసపు చీకటికోణం/అట్టడుగునపడి కన్పించని/కథల' నెంచుకొని 'చారిత్రక విభాత సంధ్యల/మానవ కథ వికాసమెట్టిది'యో చూపవలెను. ఈ ప్రయత్నమున ఇది ప్రఖ్యాతము. ఇది ఉత్పాద్యము. ఇది మిశ్రకథ—అనిగాక ఇది కావ్యకథయని యగును. అన్ని లక్షణములును దీని యందుండును. విశ్వశ్రేయము పరమార్థము గనుక సామాన్యుని జీవనమును చుట్టుకొనియే కావ్యకథ రూపుగట్టుకొనును. అదే కావ్యవస్తువు. అది ఎట్లైనను ఉండవచ్చును.

# అనుభూతి

## శ్రీ పోచిరాజు శేషగిరిరావు

అది యొక దివ్య సుందర సమంచిత
సౌధ శిఖా ప్రవేశ — మ
య్యది రమణీయ పుష్పిత
లతావళి — యల్లది దాని చెంగటన్
బొదలెడు నిర్మలస్ఫటిక నూత్న
జలావృతమౌ తటాక, మిం
పొదవగ నందు హంసలు
సముత్సుకతన్ విహరించు చుండగన్.

ఆకయినన్ జలింపదు లతావనిలో
నవ యామినిన్, రహో
త్సేకమునన్ గదల్పదు ఖుషీగను
కోకిల బాల కంఠమున్,
నీ కనుపన్నె నే మెలఁగి
నీడజముల్ రవమున్ ఘటింప, నే
నాకలిగొన్న వాఁడనయి
యుద్ధృతి నిద్ర నుపక్రమించితిన్.

నిద్దురయందుఁ బల్కెను
ఘనీభవమ్మై పరమాత్మ శక్తియే
నిద్దపు రూపు దాల్చె నవనిర్మల
నిస్తుల శాంతి మూర్తమై
యద్దెరి నిల్పెడన్నొక మహో
రుచిరమ్మగు పుష్పశయ్యలో

సిద్ధుఁబోవ నాజ్ఞయిదె—
నే శయనించితి నందు పొందుగన్

సురుచిర తావకీన సుమసుందర
నవ్య మరంద మాధురీ
భరిత దృగ్గంధలోద్గత నవ
ప్రభలన్ దిలకించుఁ గోర్కి సం
బరముం బ్రాలితిన్ లలిత
మంజుల మార్దవమౌ పదద్వయిని
గరములు మోడ్చి - భక్తి
మొంకి మ్మెరఁగన్ నయనాందలమ్ములన్.

నవనవకాంతు లుజ్జ్వల
మనగి ప్రకృతిన్ రమణీయ పుష్ప వా
టి విధమున్ జిగుర్చుచు నటింపఁగ
నీదు పదాంకి ముద్రలన్
సువిలసితమ్ములౌ వెలుఁగు చూపెడు
దారులు కానవచ్చె-న
య్యవి గన నా హృదిన్ విడు
సమగ్ర పరిమళ భావసూనముల్.

నీ లలిత ప్రసూన రమణీయ
ముఖోద్గత గానవాహినీ
జాలమున్ ధ్వనించును—రసాంచిత
భవ్య మృదంగ నిస్వనో
ద్వేలములౌ శ్రుతుల్ ; భువన
దీపక దివ్యదనంతి కాంతి రే
ఖాళినిఁ జూపు సత్కవి
సుకావ్యమునుంబలె శాశ్వతమ్ముగన్

తడవులఁబట్టి భక్తిరతిన్
నినుఁగొల్చు తలంపుగల్గి నే
తడవు కొనంగ, సుప్తజంతా
కలితమ్మగు చిమ్మచీకటిన్
బొడమెను వెల్గు, నాకద
యపూర్వ మనవ్య మనామయమ్ముగానె
కడచితి దుఃఖవార్ధి; చిలుకింబడె
నాపయి ప్రేమ బిందువుల్
విడువ తలంపురాదు—విడలేనిది—
స్వర్గ విభమ్ము నాకు—నే
విడువఁగనోప నీపద పవిత్ర
రజోలవ లేశ మేనియున్.

---



కలగూరగంప:

# దేశి సాహిత్యం - తెనుగు ఇంద్రసభ

ఒక మిత్రుని ఇంటియందు చిత్తుకాయితములగుట్ట యందుబడి యుండిన, 'తెనుగు ఇంద్రసభ' యను నీ వీథినాటకము, పూర్వ ముద్రిత ప్రతి నా కంటబడి—అది కొన్ని దినముల క్రిందట నా స్వంత గ్రంథాలయమునందు జేరినది. కాని యా గ్రంథమును దెచ్చి నా గ్రంథాలయమునందు భద్రపరిచితినేగాని—దానిని ఇటీవలివరకు పరిశీలించక ఉపేక్షించితిని—పనుల తొందరవలన, తీరుబాటు లేనందున.

ఇటీవల మరికొన్ని పాతగ్రంథముల కొఱకు నా గ్రంథాలయమునందలి ప్రాచీన పుస్తక పరిశీలన జేయునపుడు, యీ 'తెనుగు ఇంద్రసభ' నా కంటబడి, నన్ను గుఱించి రాయవూ? అన్నట్లుంది, మరోసారి నా కంటబడి, పరిశీలించడం దాని ఫలితము గానే, యీ కాస్త రాయడానికి తయారైనాను.

మా గురువర్యులు స్వర్గీయ శ్రీ చింతా దీక్షితులు గారుగనీ, దేశి సాహిత్యమును పరిశోధించి 'దేశి' యను గ్రంథమును బ్రకటించిన శ్రీ కోరాడ రామ కృష్ణయ్యగారుగానీ; యక్షగానములను గుఱించి పరిశోధించిన శ్రీ డా॥ యస్వీ జోగారావుగారుగానీ నాకు గుర్తు తెలిసినంతవరకు 'భారతి' పత్రికయందు గానీ, మరొక పత్రికయందుగానీ-తెనుగు ఇంద్రసభ'ను గుఱించిన పరామర్శ యింతవరకు వెలువడ నందువలన—భారతి, ముఖమున పరిచయముజేయ సాహసించితిని.

'తెనుగు ఇంద్రసభ'యను నీ వీథి నాటకమునకు, 'జగన్మోహన చందన మహారాజా చరిత్రము' అను నామాంతరము గలదు.

నాకు లభించిన పూర్వ ముద్రిత ప్రతి యొక్క ముఖపత్రము (Title page) గాక, మరి రెండు మూడు పుటలు సైతము నష్టమైనవి. అరగా కనిస్తుతి మొదలైనవి మాత్రము ఖిలమైనవి. కథారంభము మాత్రము ఉన్నది. గ్రంథాంతమందలి గద్యవలన, కవి నామధేయాదులు ఇట్లు దెలియు చున్నవి:

'తెనుగు ఇంద్రసభ'' అను చందనమహారాజా చరిత్రము కంచిభొట్ల కృష్ణంభొట్ల పౌత్రుడు; గంగాధరభొట్ల నప్త, రామకృష్ణయ్య పుత్రుడు—సహజపాండిత్య సుకవిజనమిత్రుడుఅయిన సీతరామయ్య నామధేయుడైనకవి, రచితంబైన—శ్రీ జగన్మోహన చందనమహారాజా చరిత్రము సంపూర్ణము.

ఈ సీతారామయ్యగారు ఒంగోలుజిల్లా (ఇది నేను చేర్చినది) 'కారుమంచి' గ్రామస్థుడని దెలియు చున్నది. మన యాంధ్రప్రదేశమునందు మరియొక 'కారుమంచి'—గ్రామము కలదేమో?- నాకు తెలియదు.

తెనుగు ఇంద్రసభ – వీధినాటకమునందు, ద్విపదలు, వచనములు; తోహరలు, కీర్తనలు, దరువులు, కందములు, జావళులు మొదలైన ఛందోరీతులయందు వ్రాయబడినది.

ఇది మహాభారతకథయందలి పురూరవచక్రవర్తి ఇంద్రసభ కేగినపు డచటనున్న రంభను మోహించి నట్లు—అచ్చెరకాంతయైన, ఊర్వశి చెలికత్తెఅయిన, మదనవల్లి రాకకొరకు నిరీక్షించుచు కథానాయకుడైన, చందనమహారాజాచేత కవి జెప్పించుటవలన,—రంభాపురూరవుల ప్రేమఘట్టమునకు, యీ 'తెనుగు ఇంద్రసభ' — స్వకపోలకల్పితమైన స్వేచ్ఛానుకరణ మనిపించుచున్నది. కారుమంచియందలి కేశవస్వామి వారికి అంకిత మీయబడినది.

తెనుగు ఇంద్రసభ నాటకమునందలి, జావళులు

మొదలైనవాటికి, యీ క్రింది రాగతాళములను ఉదాహరించినాడు. అవి యివి:—

ఆనందభైరవి—ఏకతాళం
శంకరాభరణము—ఏకతాళం
మధ్యమావతి—ఆదితాళం
ఝంఝూటి—రూపకతాళం
హిందూస్థానీ – కాఫీ—ఆదితాళం
కమాసురాగం – రూపకతాళం
గుల్ రోజ్ రాగం—రూపకతాళం
కురింజిరాగం — రూపకతాళం
భ్యాగ్ రాగం – ఆదితాళం
తరోబోధిరాగం — ఆదితాళం
నాట కురంజి—ఆటతాళం
ఆనందభైరవి – ఏకతాళం

## తెనుగు ఇంద్రసభ నాటకకథ

## తీరుతెన్నులు

చందనమహారాజు, చోళదేశమునందుగల, చంద్రగిరి పట్టణమును పరిపాలించుచుండును.

ఒకనాడు చందనమహారాజు కొలువుదీరియుండగా—మృగోపద్రవమువలన తమతమ పొలముల పంటలు నష్టమైపోయిన కాపులు (రైతులు) తమ కష్టములను మహారాజునకు విన్నవించుకొనుటకై, సభకు ఏతెంతురు.

చందన మహారాజు అడవి మృగములవలన వారికి గలిగిన ఉపద్రవములను గురించి విని — వారిని ఓదార్చి; వారి భయముదీర్చి; వారికి కొంత ధనము నిప్పించి పంపి—కొంతమంది వేటకాండ్రను.మంత్రిని వెంటబెట్టుకొని వేటకొరకు బైల్దేరును.

మహారాజు వేటవలన అలసి, దాహపీడితుడగును. దాహము దీర్చుకొనుటకు, సమీపమందలి, వనమునకుబోయి నీరు ద్రావి వచ్చెదనని మంత్రి మొదలైన వారికిజెప్పి—మంచినీటి జలాశయముకొరకు వెదకుచుబోయి—చందన మహారాజు ఒక ఉద్యానవనమునందు ప్రవేశించి—అచటి జలాశయమునందలి నీరు ద్రావి, వనపాలకుడు యిది దేవకాంతల ఉద్యానవనము గనుక మానవులెవరును యీ వనమునందు ప్రవేశింపరాదని—మోహిని వనమను పేరుగల ఆ వనముయొక్క కాపరి - వలదని వారించుచున్నను—యాతనితోటి తర్కించుచు నచటనే యుండును ఆ సమయమునందే, యీ వనమునకు యజమానురాలైన, మదనవల్లియను దేవసుందరి రాగా — చందనుడామెనుజూచి మోహించి — మదనవల్లివలన తిరస్కరింపబడు సమయమునందు—ఊర్వశి యచటికివచ్చి పుష్పములు గోయుచుండగా—చందనుడామెనుజూచి మోహించి—ఆమెచెంతజేరి తన కోరిక దెల్పును. కాని ఊర్వశి యాతనిని, తన మాయా విద్యచేత వంచించి దేవలోకము జేరును. చందనుడామెను గానక యామెవలని విరహమునకు తాళజాలక యచటనే మూర్ఛిల్లును.

మరునాడు ఊర్వశి మరల ఆ ఉద్యానవనమునకు వచ్చినపుడు — మూర్ఛిల్లియుండిన చందనునిజూచి ఊర్వశి, యాతని మోహించి—తన భటులవలన యాతనిని తన భవనమునకు గొని పోవును. అచట ఇరువురు హాయిగా ప్రొద్దు పుచ్చుచుందురు.

ఇంతటితోటి, యీ నాటకం మొదటిభాగము పూర్తియగును.

ఇక రెండవభాగమునందు ఇంద్రుడు సభజేసి-యీ సభయందు నాట్యమొనర్చుటకొరకు ఊర్వశిని బిలువనంపును.

ఇది తెలిసి చందనుడు తానుగూడా ఇంద్రసభకువచ్చి యచట నాట్యమొనర్చెడి మిగిలిన మువ్వురు అప్సరస్త్రీలను జూడగోరుచుంటినిగనుక—నన్నుగూడ నీవెంట యచటికి గొనిపొమ్మని ఊర్వశిని ఒత్తిడి జేయుటవలన యామె చివరకు విధిలేక యాతని నొక పూలమాలగామార్చి తన మెడయందు ధరించి సభకు బోవును కాని యచట చందనుని ప్రచ్ఛన్నత విఫలత్వమందుటవలన, యామె యతనిని భువినుండి

దివికి గొనివచ్చుటయేగాక—దేవసభకు గొనివచ్చినందులకు నేరస్థురాలగును.

అశ్వనీదేవతల శాపమువలన, ఆమె కిట్టి కీడు కల్గినదిగనుక,—ఆ శాపవిమోచనము అగునంతవరకు—ఊర్వశి చందనునితోగూడి భూలోకమునందుండునట్లు సభ తీర్మానించును.

ఊర్వశీచందనమహారాజులు చంద్రగిరి పట్టణమును చేరుదురు.

ఊర్వశి తమ యనుబంధము విఫలము గాకుండుటకుగాను చందనుని కొక నియమము నేర్పరచును. ఏనాడు చందనుడు పవలు నిదురించునో... నాటితో వారి యనుబంధము కాస్తా విడిబడుటయు... ఊర్వశి యాతని విడిచి—దేవలోకమునకు బోవునట్లు కోరగా—చందను డామెకు యా నియమమును తాను పాలించగలనని వాగ్దానము జేయుటతో తెనుగు ఇంద్రసభ - నాటకము సమాప్తమగును.

దేశి సారస్వత రంగమునందు కనుమరుగై యున్న నీ తెనుగు ఇంద్రసభ పరిశోధక మహాశయుల దృష్టికి గొనివచ్చుటకొరకే, యీ చిన్నివ్యాసమును వ్రాసితినని మనవి.

—శ్రీ సోమరాజుపల్లి చెంచయ్య

## భాషాశాస్త్రము — తెలుగు ధాతువులు

'క్రియార్థో ధాతుః'—అని ప్రాచీనార్యుల లక్షణము. ధాతువనగా ప్రాచీనుల వ్యవహారములో క్రియా సామాన్య వాచిగా వ్యవహృతము. ఒక భాషలో అర్థవంతమగు పదము లనేకముండును. అవి కొన్ని నామ వాచకములుగను, మఱికొన్ని క్రియా వాచకములుగను, కొన్ని విశేషణములుగను, నింక ననేక విధములుగ వ్యవహృతమగుచున్నవి. అశేషమైన యీ పదజాలములో కొన్ని పదముల అర్థములలో కొంత సారూప్యముండును. అనగా పదములు నామవాచకత్వ క్రియావాచకత్వాది ధర్మములలో భిన్నములయ్యు తత్ప్రతిబోధితార్థములలో కొంత సామ్యమును నిరూపింపవచ్చును. ఉదాహరణకు 'నడచు, నడక, నడవడి' అన్న పదములను గైకొందము. ఇందు మొదటిది నడచుట యను క్రియను బోధించునదియు, క్రియా ప్రత్యయములు చేరుటకును యోగ్యమగు వ్యాకరణ ధాతువునై యున్నది. మిగిలిన రెండును నామపదములు. అందు 'నడక' అనునది గమన మను కర్మను బోధించుచున్నది. 'నడవడి' అనునది నడచు (ప్రవర్తించు) విధానము - శీలము — అను నర్థమును నిచ్చుచున్నది. ఇప్పు డీ మూడిటి యర్థములను పరిశీలింపగా వానిలో నడచుట యను నర్థము ప్రధానముగానైనను, నప్రధానముగానైనను అంతర్భూతమై యున్నదని తెలియును. ఈ యర్థమే యీ మూడిటిలోను సామాన్యముగా నుండుటచే నా మూడు పదములకు అర్థసారూప్యము గలదని మన మెంచవచ్చును. ఇట్టి అర్థ సారూప్యమును, రూప సామ్యమునుగల కొన్ని పదముల నేర్చి వాని యన్నింటిలో సామాన్యముగాగల భాగము నేర్పఱచినచో నదియే తులనాత్మక వ్యాకరణముతో (Comparative Grammar) ధాతువనబడును. దీనినిబట్టి పైమూడు శబ్దములలో సామాన్యభాగమైన 'నడ్' అనునది ధాతువనబడును. ఈ సామాన్యభాగముపోగా ప్రతిపదములోను మిగిలిన భాగము ప్రత్యయ మనబడును. ఇదియు తులనాత్మక వ్యాకృతి విషయమే. కావుననే పై పదములలో '—అచు,—అక,—అవడి' అను భాగములను ప్రత్యయము లనవలెను. అట్లే 'కలఁచు, కలఁత, కలియు, కలుపు' అను నర్థసామ్యము, రూపసామ్యమునుకల పదసమూహములో మార్పును పొందకయున్న 'కల్'—అను భాగము మూలధాతువు — 'అఁచు,—అఁత,—ఇయు,—ఉపు' అను మాఱెడి భాగములు ప్రత్యయము లగును. కావున పై విచారణమువలన తులనాత్మక వ్యాకరణములో ధాతువనగా నర్థసామ్యమును, రూపసామ్యమునుగల పదముల సమూహములో మాఱని భాగమనియు, ప్రత్యయ మనగా నట్టి పదములలో మాఱెడి భాగమనియు చెప్పవచ్చును.

సమానోచ్చారణ, సమానమైన అర్థము కలిగిన సదృశ శబ్దరాశిలో మారనిభాగము ధాతువు. అనగా నొక పదములలో కనిష్ఠమైన యర్థవంతమైన భాగము. (Minimum Meaningful Lexical Unit). ప్రత్యయమనగా నొక పదములో నా పదమునకు నామవాచకత్వార్థములను కలిగించుటకు చేర్పబడిన కనిష్ఠమైన యర్థవంతమైనభాగము (Minimum Meaningful Functional Unit). వీని రూపమును పైన నిరూపింపబడినవిధమున నర్థసామ్యమును, రూపసామ్యమునుగల పదజాలములో మాఱని భాగమును ధాతువనుటవలనను, మాఱెడిభాగమును ప్రత్యయము లేక రూపోత్పాదకధాత్వనుబంధమనుట వలనను నిరూపింపవచ్చును.

ఇక మనవారి వర్ణనాత్మక వ్యాకరణములలో (Descriptive Grammar) ధాతు ప్రత్యయములకు వారిచ్చిన లక్షణములు వేఱు. తులనాత్మక వ్యాకరణములో '—గు,—చు' మొదలైన ప్రత్యయములతో కూడి పద మనబడునదియే యిందు ధాతువగును. ఈ ధాతువుపైననే వ్యాకరణ ప్రత్యయములు కూర్పబడును. ఈ ధాతువునకు సందర్భానుసారముగా నర్థము కల్పితమగును. దీనిపై భిన్న వ్యాకరణ ప్రత్యయములు చేరునపుడు లోపాదేశాది వివిధ వ్యాకరణ కార్యములు జరుగుచుండును. కాని తులనాత్మక వ్యాకృతి ధాతువులలో నట్టి మార్పేమియు జరుగదు. అన్ని రూపములలోను మార్పు నొందనిదే యందు ధాతువగును. ఇక తులనాత్మక వ్యాకృతిలోని ప్రత్యయములకునుగూడ భేదము కలదు. వర్ణనాత్మక వ్యాకృతిలో ప్రత్యయములు అవి చేరిన శబ్దమునకు వాక్యములోని యితర శబ్దములతోగల సంబంధమును తెలుపును. తులనాత్మక వ్యాకరణములో మూలధాతువునకు చేర్చబడు ప్రత్యయములు నామవాచకతాద్యర్థములు నేర్పఱచుట కుపయోగించును.

ఇట్లర్థసామ్యమును రూపసామ్యమును గల శబ్దములనుండి మూలధాతువు నేర్పఱచిన తరువాత నిట్టి కొన్ని మూలధాతువులను బరిశీలించి వాని నిర్మాణమును సామాన్యీకరింపవచ్చును. అట్లు చేయగా ద్రావిడ భాషలలో రెండు రకముల ధాతువులు గలవని తేలినవి.

1. హలంత ధాతువులు కొన్ని.
2. అజంత ధాతువులు కొన్ని.

వీని యన్నింటిలోను అచ్చొకటే యుండును. ఆ యచ్చునకు ముందు హల్లు కొన్ని ధాతువులలో నుండును, మఱి కొన్నిటిలో లేకపోవచ్చును. ఈ రెండు విధములగు ధాతువులలో అచ్చుయొక్క దీర్ఘత, హ్రస్వత యనువానిచే మఱి రెండేసి యవాంతర భేదము లేర్పడి మొత్తము ద్రావిడ భాషా ధాతువులు నాలుగు విధములగుచున్నవి.

అచ్చునకు 'అ' అనియు, హల్లునకు 'హ' అనియు సంకేతము లేర్పఱచుకొని యీ నాలుగు రకముల నిట్లు చెప్పవచ్చును.

1. హ అ హ
2. హ అ̄ హ
3. హ అ
4. హ అ̄

1. ఇందు మొదటి రకము ధాతువుల కుదాహరణముగా 'కలఁగు, కలఁత' మొ॥ వానిలోని 'కల్'—అనుదాని నీయవచ్చును. అట్లే అజాది ధాతువునకు 'అడఁగు అడఁచు' మొ॥ వానిలోని 'అడ్' అనుదాని నొసగవచ్చును.

2. రెండవ రకమునకు 'కాలు, కాలుచు' మొదలగు వానిలోని 'కాల్' అనుదానిని, అజాదులకు 'ఆఱు, ఆఱుపు' మొ॥ వానిలోని 'ఆఱ్' అనుదాని నొసగవచ్చును.

3. మూడవ రకమునకు 'నొచ్చు, నొప్పు' మొ॥ వానిలోని 'నొ' అనునది యుదాహృతి.

4. నాలుగవ రకమునకు 'పోవు, పోక మొ॥ వానిలోని 'పో' ఉదాహరింపవచ్చును. అట్లే వీని కజాదిధాతువులకుకూడ లక్ష్యములుగా జూపవచ్చును.

ఇక నీ ధాతువుల పై జేరు ప్రత్యయముల స్వరూపమునుగూడ నిట్లే నిరూపింపవచ్చును. హలంత ధాతువులపై అజాది ప్రత్యయములును, అజంతధాతువులపై హలాది ప్రత్యయములును చేరు చుండును. హలంతధాతువులపై చేరు నీ యజాది ప్రత్యయముల యాద్యచ్చు ప్రాయికముగా 'అ, ఇ, ఉ' లలో నేదియో యొకటియై యుండును. ఇది తెలుగు భాషా విషయమున కాల్డ్వెలు (Caldwell) పండితు డును వీనిని గుర్తించి, వీనికి తన గ్రంథమున Particles of Specialisation అని నామకరణ మొనర్చెను. అతడు వీనినిగూర్చి యిట్లు అభిప్రాయ పడెను.

"The illustrations given above prove that the second syllable of the various verbs now adduced have not been added merely for purposes of enphony, but have been appended in order to expand to restrict or some manner to modify and specialise the signification."

ఈ యచ్చులు కేవల ముచ్చారణ సౌకర్యము కొఱకే యేర్పడినవికావనియు, నవి సందర్భమును బట్టి ధాత్వర్థమును బరిమిత మొనర్చుట, విస్త రించుట, ప్రత్యేకించుట మొదలగు పనుల కుపయో గించుననియు పై వాక్యమునందలి యభిప్రాయము.

ఇట్లీతడు వీనికి ప్రత్యేకార్థము కలదనుటయే కాక వీనిని ధాతువులోభాగముగానే నిరూపించెను. కాని వీని యర్థమును మన మెఱుగజాల నప్పుడేదో యర్థముగలదని దూరాన్వయముచే నిరూపింప యత్నిం చుటయు ప్రతిపదములోను మాఱెడి వీనిని ధాతు భాగములుగా పేర్కొనుటయు అవిచారితరమణీయము లనియే చెప్పనొప్పును. మఱియు నివి యజంతధాతు వులపై మృగ్యము లగుటచేగూడ వీని ప్రత్యేకార్థాభి దాయకత్వము గగనకుసుమాయమానమనియే యెంచ వచ్చును. కావున పైన జేర్కొనిన విధమున నివి ప్రత్యయ భాగములుగానే యున్నవనుట యుక్త తరము.

ఈ యచ్చులతరవాత నున్న ప్రత్యయ భాగ నిర్మాణమును గూడ మనము నిర్ధరింప వచ్చును. దీనితరువాత ప్రత్యయ భాగమేమియు లేక పోవచ్చును. స్పర్శాక్షర ముండవచ్చును. అనునాసికము స్పర్శాక్ష రము నుండవచ్చును. ద్విత్వమైన స్పర్శాక్షర ముండ వచ్చును. అట్లే యజంత ధాతువులపై నీ యచ్చుం డదు కాన తరువాత ప్రత్యయమే లేకుండుట, స్పర్శాక్షరముండుట, అనునాసిక పూర్వక స్పర్శాక్షర ముండుట, ద్విరుక్త స్పర్శాక్షర ముండుట యను నైదు రకములుగా నీ ప్రత్యయముండును. మఱియు హలంత ధాతువులలో నీ యచ్చులును ప్రత్యయమును కూడ లేని వేఱొక యవాంతర భేదముండుటచే తత్ప్రత్యయము మూఁడువిధములుగ నున్నది. ఈ విధానము అన్యాదులలో ద్రష్టవ్యము.

ఇక నీ మూల ధాతువులకును నేమైన యర్థ ములు గలవా ? అను విషయము విమర్శనీయము. Particles of Specialisation అను వాని కర్థ నిర్ణయము చేయజాలుట యసంగతమని ముందే వివరింపబడినది. అట్లే ధాతుప్రత్యయములకు నిద మిత్థమని యర్థనిర్ణయ మొనర్చుటయు దుష్కరమే. 'పచ్చ, పసిఁడి, పసిమి; పసి; పసుపు; పసరు; పయిఁడి' అను పదసమూహములో మూలధాతువగు 'పచ్, పస్' అనుదానికి వీనియన్నింటికి సరిపోవునట్లుగా నర్థమును నిర్ణయించుట సుకరముకాదు. పసుపుఁ బచ్చదనమునకు, ఆకుఁ బచ్చదనమునకు నీ ధాతువు సూచకమని యెట్లో యొక విధముగా దీనికర్థము సరిపెట్ట యత్నింపవచ్చును. కాని అది దూరా న్వయముతో గూడి యుక్తిదూరమగును. కావున మూల ధాతువుల కిదమిత్థముగా నర్థమును నిర్ణ యింపలేమనుటయే లెస్స. అట్లే యీ ప్రత్యయమున కీ యర్థమని నిరూపింపజాలుటయు అసంభావ్యమే. 'పసిడి'లోని '—ఇడి' ప్రత్యయమునకును, బంగారు నకు 'పసిమి'లోని '—ఇ' ప్రత్యయమునకును [పచ్చ తనమునకును నేమి సంబంధముకలదో మనము నిరూ పింపనేరము. ఇవి యే యర్థములకైన సంకేతములుగా

నుపయుక్తములా యన్నదియు వి[ప్రతిపన్నమే. కాని యిది మొదట నేదోయొక యర్థమునకు సూచక మయ్యెననుటమాత్ర మపరిహార్యము.

ఈ ధాతువులలో మఱల మొదటితరపు ధాతువులు (Primary Roots) రెండవతరపు ధాతువులు (Secondary Roots) అని రెండురకములు గలవు. అర్థసామ్యమును, రూపసామ్యమునుగల పదములలో సామాన్యాంశమైన ధాతుభాగమే వేఱు. ధాత్వనుబంధములు (Formation of Suffixes) చేరక యిప్పటి భాషలో క్రియా[ప్రత్యయాదివ్యాకరణ ప్రత్యయములు చేరుటకు ప్రాతిపదికమైనచో నది మొదటి తరపు ధాతువనబడును. దీనినే వ్యాకరణ ధాతువులో నేకదేశమునకు ప్రవృత్తిలేనిచో నది ప్రాథమికధాతు వని వేఱువిధముగ చెప్పవచ్చును. 'అను, తిను' మొ॥ ధాతువులపై ధాత్వనుబంధములు లేకయే 'అనెను, తినెను' మొ॥ అవ్యాకరణ ప్రత్యయవిశిష్టపదము లేర్పడినవి.

ఇందు ధాతువులగు అను (అన్) తిను (తిన్) అను వానిలోని ఏకదేశములకు భాషలో ప్రవృత్తి లేదు. కావున వీనిని ప్రాథమిక ధాతువులని యన వచ్చును, అన్వాదులన్నియు ప్రాథమిక ధాతువులే. ఇక '—ట్టు' అంతమందుగల 'కట్టు, కొట్టు' మొదలగు నవియు ప్రాథమిక ధాతువులుగానే పరిగణనీయములు. '—లు, రు, ఱు, యు' — అంతమందుగల ధాతువులు కూడ ప్రాథమిక ధాతువుల జాబితాలోనికే చేరును.

'పిలుచు' మొ॥ వానివలె '—ఉచు—ఉవు' మొ॥ ధాత్వనుబంధములతో కూడిన మూల ధాతువుకు వ్యాకరణ ప్రత్యయములు చేరుటకు యోగ్యములైనచో నవి రెండవతరపు ధాతువు లనబడు. 'నడచు, నడక' మొ॥ సరూప శబ్దములలోని మూలధాతువగు 'నడ్' అనునది —అచు' మొ॥ ధాత్వనుబంధములతో గూడికాని, వ్యాకరణ ప్రత్యయములు చేర్పదగినదికాలేదు. 'నడచు' మొ॥ రూపము లీ ధాత్వనుబంధరహితములుగ సిద్ధింప లేదు. కావున నిట్టివి రెండవతరపు ధాతువు లనబడును. ఇవియే భాషలో నధిక సంఖ్యాకములు. అన్ని ప్రత్యక్ష ధాతువులును రెండవతరపు ధాతువులే. 'తిరుగు' మొ॥ ద్వ్యక్ష ధాతువులలో పైని పేర్కొన బడినవిగాక (—లు, రు, ఱు, యు అంతములు గాక) మిగిలినవన్నియు రెండవతరపు ధాతువులే. వీనిలో ధాత్వనుబంధములు చేరినతరవాతనే వ్యాకరణ (కాలపురుష బోధకు) ప్రత్యయములు చేరుచున్నవి.

— ఎన్. ఏ. రామశాస్త్రి.

## కుంతీసుత మధ్యముఁడు—
## అర్జునుఁడు

సింగం బాకటితో గుహాంతరమునన్
జేడ్పాటు మైనుండి మా
తంగ స్ఫూర్జిత యూథ దర్శన
సముద్యత్క్రోధమై వచ్చు నో
జం గాంతార నివాస ఖిన్నమతి
నస్మత్సేనపై వీడె వ
చ్చెం గుంతీసుత మధ్యముండు
సమరస్థేమాభిరామాకృతిన్.

ఈ పద్య ముత్తరగోగ్రహణ సందర్భమున నడచి యున్నది. కౌరవసేనచేఁ గొనిపోఁబడుచున్న గోవులను మరల్పఁగడంగిన యుత్తరునకు సారథిగ వచ్చిన బృహన్నలా వేషధారియగు అర్జునుని గనినంత నాచార్యుడు ద్రోణుఁడు 'ఆకటితోనున్న సింగముతో సమానుఁడగు కుంతీసుత మధ్యముఁడు మనసేన పైకి ఇదిగో వచ్చుచున్నాడ'ని పలికెను.

ఉత్తర గోగ్రహణము విరాటపర్వము లోనిది. ఆన కవిత్రయమున మిన్నగా నెన్నఁదగిన వాఁడును, విక్రమసింహపురీనివాసుడును, హరిహరారాధనా తత్పరుఁడును, అగు తిక్కన సోమయాజి రచనలో మొదటిపర్వము. మహనీయుఁడగు నీతఁడు అర్జునునకు 'కుంతీసుత మధ్యముఁడు' అను విశేషణమును (పర్యాయపదమును) వాడెను. అది ఎట్లు పొసగును?

కుంతీపుత్రులు కర్ణుడుగాక ముగ్గురే. (1) యుధిష్ఠిరుడు (2) భీముడు (3) అర్జునుడు. కుంతీసుతులలో మధ్యముడు భీముడగునేకాని యర్జునుడు కాజాలడు.

కొందఱు 'కుంతివలననేకదా మాద్రికి సంతానము వచ్చినది. అందుచే మాద్రికుమారులు కూడ కుంతీపుత్రులనియే చెప్పుకొనవచ్చును. అపుడు కుంతీసుత మధ్యముడు అర్జునుడుగాక తప్పదుకదా?' అని యందురు. కాని యది పొసగదు. ఏలయన దుర్వాస మహర్షి కుంతికి మంత్రోపదేశ మొనర్చెను. అట్టి మంత్రముచే తాను పుత్రులగని పాండుమహారాజు కోరకచే మంత్రప్రభావమున మాద్రికిని కుమారులను గల్గించినది. మంత్రప్రభావముచే మాద్రికి సంతానము కల్గించినంతమాత్రముననే కుంతియును నకులసహదేవులకును తల్లియయ్యెడు పక్షమున నట్టి మంత్రోపదేష్టయగు దుర్వాసమహర్షి పాండవు లందరకును తల్లియో, తండ్రియో అయి వారు దౌర్వాసేయులనియు పిలువఁబడవలసి వచ్చును. కుంతి యందరిని పెంచినది కావున తల్లియైనది. పెంపుడుతల్లిగా గైకొనవచ్చునుకదా అని తలచినను ఇచట నది యసందర్భము. అర్జునుడు వచ్చెను అని చెప్పక ఇట్టి వివరణముతోకూడినపదమును తిక్కన యూరకవాడియుండడు. అదియునుగాక 'సుత' అను పదమునకు 'కనబడినవాడు' అని వ్యుత్పత్తి కలదు. మాద్రీసుతులు కుంతికి పుత్రులయిన గావచ్చునుగాని సుతులు కాజాలరు. అందుచే మాద్రి కుమారులును కుంతీ కుమారులే యనిచెప్పి దానిమూలమున కుంతీసుత మధ్యముడన అర్జునుడే యన వీలులేదు. మఱి తిక్కనసోమయాజి ఎట్లాపదమును వాడియుండును? పదములను తూచి వేయుగల ప్రతిభాశాలి యంత తేలికగా పొరపడునా? పడఁడు.

'కుంతీసుతః మధ్యమ ఇవ' అను వ్యుత్పత్తిని గైకొని మధ్యమునివంటి అర్జునుడు,— మధ్యముఁడనగా భీముడు. చేతయందు భీమునివంటివాడు భీమునివంటి భయంకరుఁడు— అర్జునుఁడు అనిచెప్పిన బాగుగనుండును.. కాని డొంకతిరుగుడు.

వేదం వేంకటరాయశాస్త్రిగారు 'మధ్యమ' పదమునకు మూడు అను నర్థమును గ్రహింపవచ్చు ననిరి. అట్టి సంప్రదాయము మనలోకలదు. పంక్తి కంధరుడు అనునపుడు ఇరువదియారు ఛందస్సులలో 'పంక్తి' పదియవయది. అందుచే పంక్తి కంధరుడు అనగా పదిశిరస్సులు కలవాఁడని యర్థముకలదు. ఇచ్చట మధ్యమ ఛందస్సు మూడవది. అందుచే కుంతీపుత్రులలో మధ్యముడు (మూడవవాడు) అర్జునుడని చెప్పకొనవచ్చును. ఒకరు సంగీత శాస్త్రమున మధ్యమస్వరము నాల్గవది. అందుచే కుంతీపుత్రులలో నాల్గవవాడు అర్జునుడు అనతగియున్నది అని పల్కిరి. కావున ఇట్టుల చెప్పకొనుచు పోయిన ఎచ్చటనయిన మధ్యమ పదమునకు వేఱొక్కైన సంఖ్యవచ్చిన ఇబ్బంది కలుగును.

తిక్కన యభిప్రాయమున నీ క్రిందిరీతి నుండవచ్చును.

యుద్ధ మొనర్పఁబోవువాడు అతిశాంతుఁడుగఁగాని, అత్యావేశపరుఁడుగఁగాని యుండరాదు. అటులున్న నాతనికి నపజయము తథ్యము. ప్రపంచ ప్రసిద్ధుఁడగు Shakespeare చే వ్రాయబడిన Antony and Cleopatra' అను నాటకమున Octavious Ceasar తన యనుచరులతో యుద్ధ సంబంధి విషయముల చర్చించుచుండ నాతని యనుచరులలో నొకఁడగు Mecaenas ఈ క్రిందివిధముగ చెప్పచున్నాడు.

'Ceasar must think, when one so great begins to rage, he is hunted even to falling....never anger, made good for itself'

పై వాక్యము లలో కోపము పనికిరాదనియు అదియున్న పతనము తప్పదనియు చెప్పబడియున్నది. శాంతినే కోరుచు చాలమంచివాడుగనుండినను క్షత్రియ కర్మ చేయుట కష్టము. అత్యావేశపరత్వము లేక నతి శాంతత్వమో, అతిభీరుత్వమో లేకుండుట మధ్యమ గుణము.

ఈ 'మధ్యమ'అను పదమునకు 'ఆప్టే'గారి Dictionary యం దర్థము ఆంగ్లమున నిట్లున్నది—

ం derate—To restrain from excess of any kind—ఒక గుణముయొక్క అల్పత్వమునందు గాని, ఆధిక్యమునందుకాని 'అతి' లేకుండుట! To reduce in intensity (rage, passion, desire, and joy) కోపతాపములు, మోహము, కోరిక, సంతోషము దీనిని తగ్గించుట యనగా అదుపులో నుంచుటఅని యర్థము.

కాళిదాస విరచితమగు రఘువంశమునను ఈ మధ్యమ శబ్దప్రయోగ మీయర్థముననే కలదు.

'తేన మధ్యమశక్తీని మిత్రాణి స్థాపితాన్యతః'
17 వ సర్గ. 58 వ శ్లోకము.

ఇచట మధ్యమ శబ్దమును వ్యాఖ్యాకర్త మల్లినాథుడు న+అతిక్ష్ణ+ఉచ్ఛ్రితాని అని వివరించి యున్నాడు. భావావేశములను, ఉద్రేకములను అదుపులో నుంచుకొని అవసరమగుచో తీవ్రముగ వెలికి తెప్పించి కార్యజయము సాధించువాడే మధ్యముఁడు.

మధ్యమ గుణము కలవాడు మధ్యముఁడు. కుంతీసుతులలో మధ్యముఁడు—కుంతీసుత మధ్యముఁడు అని విగ్రహవాక్యము చేయవలయును. యుధిష్ఠిర భీమార్జునులలో ఎవఁడు మధ్యముఁడు? ధర్మజుఁ డతిశాంతుఁడు. భీముడుదగ్రకోపి. అర్జునుఁడే మధ్యముఁడు. ద్రౌపదీ వస్త్రాపహరణ సందర్భమున భీముని శాంతపరచినాడు. శ్రీ కృష్ణ దౌత్య సందర్భమున ధర్మజు నుత్తేజపరచినాడు. ఉత్తరగోగ్రహణ సందర్భమునను పిఱికియై వెనుదిరిగి పరువిడు నుత్తరునకు ధైర్యవచనముల పలుకుచు స్థిరచిత్తుఁడై యుద్ధమునకు వెడలుచున్నాడుకాని, కౌరవులను (తలచిన) చూచిన వెంటనే 'నీ వెటులయినఁ బొమ్ము. ఏఁబోయి వారి యుక్కడగించెద'నని భీమునివలె పలుకలేదు. ఈ సందర్భమున ధర్మజుఁ డెట్లుండునో వాన మూహింపవచ్చును. యుద్ధమునకు వచ్చిరని తెలిసిన వెంటనే పదుమూడు సంవత్సరములు గడచినవని నిశ్చయించి దుర్యోధనుని యొద్దకు నేఱుగ వెడలి తను రాజ్యభాగము నడిగి యుండును అర్జునుఁడు విదిర్చిన శత్రువుల నూరక పంప నిష్టములేక తన బాహుబలమును ప్రదర్శించెను.

పైవిధముగ నర్జునుడు కుంతీసుత మధ్యముఁ డయినాడు. 'అర్షత్వాత్ సాధుః' అని కొట్టివేయక ఋషితుల్యుఁడగు తిక్కన యొక్క పదప్రయోగ సారస్యమును గ్రహించిన బాగుగనుండును.

—మాడభూషి.

# ఆధునిక వ్యవహారంలో అన్య దేశ్యాలు

'బుక్స్ చదవాల్సినవి చాల వున్నాయ్'
'పెన్స్ ఇక్కడ దొరుకుతాయా ?'
'పేపర్స్ భాగా అన్సరు చేశావనుకుంటా'
'టిక్కెట్సివ్వడం మొదలుపెట్టారు'
'అంగట్లో ప్రస్తుతం స్టాక్సులేవు'

—ఇలాంటి వాక్యాలు మనం తరచూ నిత్య వ్యవహారంలో వాడటంవినటం పరిపాటే. బుక్కులు —పెన్నులు—పేపర్లు — టిక్కెట్లు — స్టాకులు— అనడం వాడుకవున్నా అంతకన్నా వాడుక పైవాక్యాల్లో ఉంది. అంటే లు-బహువచన ప్రత్యయం కాకుండ ఇంగ్లీషు బహువచన ప్రత్యయం 'యస్' తోనే వాడుక విస్తరించిందన్నమాట. అన్యదేశ్యపదాలు సాధారణంగా ఆధునిక తెలుగు వ్యవహారంలో బాగా ఇరుక్కొని పోయినట్లు వెంటనే గమనింపగల్గుతాము. విచ్చల విడిగా అన్యదేశ్యపదాలను, అందునా ఇంగ్లీషు పదాల నుపయోగించడం వ్రాతల్లోగూడ బహుళమయింది.

అక్షరజ్ఞానంలేని పల్లెజనం సయితం ఈ ఇంగ్లీషుపదాలను విరివిగా వాడుతూండటం మనం సాధారణంగా గమనిస్తుంటాము.

తెలుగుపైన మొదటినుండియూ ఏదో ఒక భాషాప్రభావం విపరీతంగా వున్నట్లు తెలుగు భాషా చరిత్రవల్ల బోధపడుతూఉంది. సంస్కృత ప్రాకృత ప్రభావం తర్వాత, మహమ్మదీయులతో గల్గిన సంపర్కంవలన హిందూస్థానీ పదాలు (అరబిక్ పర్షియన్) తెలుగులోకి బాగా చొచ్చుకొనిపోయాయి. నేటి వ్యవహారంలో ఈ హిందూస్థానీపదాల సంఖ్య

కంటె ఆంగ్లపదాల విస్తృతి ఎక్కువ. అయితే ఇక్కడ ఒక విషయం చెప్పకోవలసివుంది. హిందూస్థానీ పదాలు ఆధునిక తెలుగు వ్యవహారంలో స్థిరపడిపోయాయి. ఆధునికయుగంలో హిందూస్థానమునుండి కొత్తపదాలేవీ వచ్చిచేరడంలేదు. ఇంగ్లీషునుండి విచ్చలవిడిగా పదాలు వ్యవహారంలోకి ప్రవేశిస్తున్నాయి. కనుక ఆంగ్లంనుండి ఎరువుతెచ్చుకొన్నపదాల్లో అనేక రీతుల్లో ఉచ్చారణవైవిధ్యం కనబడుతూవుంది, వారి వారి విద్యాసంస్కారాలనుబట్టి.

హిందూస్థానీ, ఇంగ్లీషునుండి తెలుగులోకి ప్రవేశించిన పదాల ప్రవృత్తి యెట్టిదో కొంత పరిశీలిద్దాం. కొన్నిపదాలను అన్యదేశ్యాలని గుర్తించడం కష్టం. అలాంటివి :

1. తాగాణి ('నేలబావులపైవేయు అడ్డ కొయ్య'). ఇది 'తగార్' అను అరబ్బీ పదమునుండి వచ్చింది. అలాగే

2. నవారు—నివార్. ('—'=నుండి వచ్చిందని అర్థం).

3. భడవ—భడ్వా.

4. కూలి—కులి.

5. కొత్తిమిరి—ఖోత్‌మీర్.

6. గచ్చు—గచ్.

7. సబ్బు—సాబున్.

8. గుమ్మటం—గుంబద్.

9. రైతు—రఇయత్.

10. తరగతి—తరహత్.

11. తతిమ్మా—తత్మిమ్.

12. కొసురు—క్వసిర్.

పైన పేర్కొన్న పదాలన్నీ అయా మూల భాషలనుండి తెలుగులోకివచ్చి స్థిరపడ్డాయి. ఆ మూల భాషలన్నీ ఇండో—ఇరానియన్ భాషా కుటుంబమునకు చెందినవి. కొన్ని మరీ విచిత్రంగా వుంటాయి.

'పొట్లాం' : ఇది హిందూస్థానీనుండి వచ్చింది గాదు. ఫ్రెంచిలోని 'boutalle' పదంపైనుండి వచ్చి చేరింది.

'గిడ్డంగి' : మలయా భాషలనుండి వచ్చిన పదం.

(గిడ్డంగి—gaclong, 'Malayan')

'కాఫీ' : ఇంగ్లీషునుండి మనలోకి వచ్చింది. అసలిది అరబ్‌దేశంలో పుట్టిన పదం. అరబ్బుల నుండి యూరోపియన్ భాషలకు పాకింది.

ఇక ఇంగ్లీషు పదాలనుచూస్తే,

'పేపర్లో న్యూస్ చదివాను'

'సిన్సియర్‌గా' 'ట్రయల్సేయడం—'ట్రై' జేయడం.

'మాంచి' మ్యూజిక్' వుందిగాని 'పిక్చర్లో గ్లామర్లేదోయ్'

'ర్యాంకు' చేరాలంటే 'స్లోగా' నడిస్తే లాభం లేదు బాగా 'రన్'' చేయాలి'

'దీని 'ప్రైసెం'త? ఓస్! ఇంత 'చీపని' తెలిస్తే ఆర్డరిచ్చుండే వాణ్ణిగాదే ఆ షాపులో'

ఇంగ్లీషు పదాలను తెలుగు పదాల్తో జోడు చేసి చెప్పడంలో ఒకతమాషా కనబడుతూవుంది. ట్రయల్సేయడం—ట్రై చేయడం—రన్ చేయడం—ఆర్డరివ్వడం. వీటికి సమానార్థాలలో ఇంగ్లీషులో making trails-trying-running placing-order పదాల్ను వ్యవహరిస్తారు. ఇంకో ఉదాహరణ : 'బెల్ కొట్టడం'—'ringing the bell' అనడానికి, 'కొట్టు' అన్న ధాతువుకు సమానార్థకంగా ఆంగ్లంలో 'Strike' అన్నది. కాని జాతీయ ప్రయోగం 'ringing the bell' అనే. అట్లే 'హారన్ కొట్టడం. హారన్ కొట్టడం='giving horn' అనే కాని 'Striking horn' అని లేదు వ్యవహారంలో, సమానార్థకంగా ప్రయోగాల్ని చూస్తే! అంటే ఆంగ్ల పదాల నువయోగించేటప్పుడు ఇంగ్లీషు పదవ్యవహార జాతీయాన్ని సరిగ్గా అనువదించి ఎరువు తెచ్చుకోడం లేదు. ఆ ఇంగ్లీషు పదాలను తీసికొని తెలుగు జాతీయ వ్యవహారంతోనే కలిపి చెబుతున్నాం అన్నమాట. ఈ కింది పదాలను చూడండి.

1. ప్రైవు కొట్టడం.
2. సేల్ చెయ్యడం.
3. హిం టివ్వడం.
4. ఫోటోలో పడటం.
5. క్వశ్చిన్ చేయడం.
6. ఆన్సర్ చేయడం.
7. ఫోన్చేయడం.
8. వెయిట్ చేయడం.
9. మీ టవడం ('మీట్ చేయడం'—రాయల సీమ మాండలికం)
10. ప్లానువేయడం.

మనం వ్యవహారంలో సమానార్థక పదాలను పక్కపక్కనే వుంచి వాడుతూవుండటంగూడా వుంది.

పక్కసైడు; జర్నల్ మామూలుగా; పేపరు కాగితం; వరుసలైను; బంట్రోతు (బంటు + రౌతు); లేబర్కూలి; గైలుపట్టా;

బాగా వ్యవహార ప్రసిద్ధాలయిన కొన్ని పదాలకు మూలపదాలేమిటో చూద్దాం.

1. తాహతు—తాఖత్.

2. హోదా - హౌదా. ఏనుగు పైభాగానికి హౌదా అని పేరు. ఔన్నత్యానికి చిహ్నం. 'హౌరా' దీనిపైనుండి వచ్చిందే,

3. డేయిసా—దెగ్చా.
4. తుపాకి—తుపక్.
5. ముక్తసరి—ముఖ్తసార్.
6. ఎకాయెకి—యాకాయక్.
7. వాకబు --వుకుఫ్.
8. పద్దు—పర్దా.

ముఖ్యంగా ఇంగ్లీషు పదజాలం గ్రామీణ ప్రాంతాల్లో చొరవజేసుకోడం, స్పీడుగాలగెత్తు, అవుడియాకాలేదు' ప్రోగ్రామ్లు, శానంగాజిగ అయిపోవడం, సిన్మాఆక్టర్లు, రెస్టులేని బిజినెసు, మున్నగు పదాలగుండా వ్యక్తమౌతుంది.

ఇప్పటికీ చాలవరకు వున్న ఉద్యోగాల పేర్లన్నీ అన్యదేశ్యాలే. ఉద్యోగధర్మాన్నిబట్టి ఆపేర్లు వచ్చినా, తమిళంలో నేడు చేస్తున్నట్లు, తెలుగుసేత ఆపేర్లకు చేయటంలేదు, వాటిని యథావిధంగా వాడు కొంటూన్నాం. ఉదా: పేష్కారు, తహశీల్దారు, ప్లీడరు, గుమాస్తా, ప్యూను, ప్రిన్సిపాలు, కలెక్టరు, గవర్నమెంటు, పోలీసు, ఛైర్మన్, మాష్టరు, సెక్రటరీ మున్నగునవి.

ఇప్పుడొస్తున్న కథానికల్లో, నవలల్లో నాటికలలో గేయరచనలలో వ్యవహారభాషను వాడుతున్నారు గనుక దీంట్లో ఆంగ్లపదాలు వాటంతటవే దొర్లుతున్నాయి.

వ్యవహారంలో రూఢముల్తైన పదాలను మనం యథాతథంగా గ్రహించడంలో తప్పేమీలేదు. తెలుగు భాషా స్వభావం ఏమంటే నూతనపదాలను అవసరాన్ని బట్టి ఇతరభాషలనుండి గ్రహించుకొని తనలో ఇముడ్చుకుంటూండటం. ఇటువంటి భాషను 'borrowing language' అంటారు. ఇంగ్లీషుకూడ ఇటువంటి భాషకు ఉదాహరణం. కొన్నిభాషలకు పదాలను ఎరవుతెచ్చుకోడంఅంటూ గిట్టదు. ఆయానూతనార్థాలను బోధించడానికి కొత్తకొత్తపదాలను సృష్టించుకొంటాయి. తమిళం, జర్మన్భాష ఈ కోవకు చెందినవి.

అన్యభాషాపదాలను ఎరవు తెచ్చుకోవచ్చుగదా అని నియమరహితంగాచేస్తే అదీ బాగుండదు. శిష్టవ్యవహారంలో రూఢముల్తైన రూపాలను గ్రహించడం సమంజసం. రానురాను వ్యవహారంలో అర్థాన్ని స్పష్టం మరింత చేయవలసివచ్చినప్పుడు ఇంగ్లీషుపదాల ఆవశ్యకత ఇనుమడిస్తూండటం మనం అందరం నిత్యం గమనిస్తూన్నాం.

—ఉప్పలపాటి శ్రీరామమూర్తి.

# గ్రంథ విమర్శలు

## ఫ్రీవెర్స్ కథలు — శ్రీ శీలా వీర్రాజు (హృదయం దొరికింది)

[ ఫ్రీవెర్స్ కథల సంపుటి : ప్రతులకు ఉదయా ప్రింటర్స్, 4 2—297. సుల్తాన్‌బజార్—హైదరాబాదు. ]

రాగల కాలంలో వచన కవిత్వానికి ఒక సుస్థిర స్థానం లభించాలన్నా లేదా నాలుగు కాలాలపాటు వచన కవిత్వం బ్రతకాలన్నా—అందులో కథా కావ్యాలు రావాలని కుందుర్తి చిరవాంఛ. 'ఎందుకంటే కావ్య వస్తువులో స్పష్టతలేక, ఊహలో సౌందర్యంలేక, కవి యిస్తున్న సందేశం అసలులేక ఇటీవల ఆధునిక కవిత బాగా దెబ్బతిన్నట్లు నాకు అనిపిస్తున్నది. దాదాపు ఏదిచదివినా అంతం ఒకే మూసలో పోసిన దానివలే కనిపిస్తున్నది. తీరా యింత శ్రమపడి చదివితే అన్వయం కుదరదు; 'దానినుండి నేర్చుకోవలసింది వుండదు.' పైగా 'వస్త్వాశ్రయమైనప్పుడే కవిత్వం విజృంభించి కవిప్రతిభ బయట పడుతుంది. బృహత్కావ్య నిర్మాణానికి అవకాశ ముంటుంది. అంతేకాదు, ఆనాడు అభ్యుదయ కవితాదశలో కవితా వస్తువు పరిమితమై పోయినట్లు కన్పించింది. ఈనాడు సర్వరసపోషణకు అనువుగా వచన కవిత అభివృద్ధి చెందింది. దీనిని సద్వినియోగం పరచుకోవటానికి కథాశ్రయ కవితామార్గము అనుసరణీయము.' ఇవి కుందుర్తిగారి మాటలు.

ఇటీవల సాహిత్య అకాడమీ అవార్డుపొందిన 'మైనా' నవలలోని వర్ణనాత్మక వైభవం, కవితా సౌరభం అనుభవించాక కుందుర్తిగారు వీర్రాజుగారిని ఫ్రీవెర్స్‌లో కథలు రాయమని ప్రోత్సహించారు. ఆ ప్రోత్సాహపు ఊపుతో, ఉత్సాహంతో ఇప్పటికి రెండు సంపుటాలు వెలువరించారు వీర్రాజుగారు—అందులో మొదటిది— 'కొడిగట్టిన సూర్యుడు'. రెండవది 'హృదయం దొరికింది.' మొదటిదానిలో మూడు కథలు, రెండవ దానిలోనూ మూడు కథలు వున్నాయి.

అసలు ఒక ఖండికగాని, ఒక కావ్యంగాని, వర్తమాన సామాజిక, రాజకీయ స్పృహతో కూడుకుని ఉంటాయి. ఈ వర్తమానం పొరను చించుకుని రేపులో నిలువగలిగిన, అంటే త్రికాలాల్లోనూ అన్వయించగల్గిన మానవ స్వభావ వైవిధ్య వర్ణనతోనూ— మానవాంతరంగంలో నిబిడీకృతమై వున్న గుణగణాల—మంచి చెడులు—ప్రదర్శనతోనూ కూడుకున్న కథావస్తువులో కావ్యాలు రాయటమే ముఖ్యం. కాలం మారుతుంది. కాలానుగుణంగా సామాజిక వ్యవస్థలూ మారవచ్చు. కాని మానవునిలోని కొన్ని మౌలికమైన గుణాల విషయంలో ఎప్పుడూ మార్పు లేదు - ఉదాహరణకి, ప్రేమ, ద్వేషం, పగ, మమత, కరుణ—ఇలాంటివి.

అనాదినుండి ఈ గుణాలు మానవుని అంటిపెట్టుకునే ఉంటున్నాయి. వాటికి శైథిల్యంలేదు. ఏ రచయిత అయితే—ఈ గుణాల ప్రభావాలు మానవుల మీద ఎలా ప్రసరిస్తాయో—ఒక మానవుని మౌలిక గుణానికి—అతని ప్రవర్తనకు ఎంత అవినాభావసంబంధం ఉందో—చిత్రీకరిస్తాడో, అతను శాశ్వతంగా నిలువగల్గుతాడు. నిన్నటిది నేడు చదువుతున్నాంఅంటే ఇదే కారణం. భౌతికమైన సమస్యలు అశాశ్వతమైనవి. ఒక సమాజంలో ఒక ఆకలిసమస్య ఉందనుకుంటే—అది తాత్కాలికమే—తగిన నివారణోపాయం ఆలోచించి ఆచరణలోపెడితే, ఆ సమస్య అంతటితో తీరుతుంది. **Elizabethan Period**—లోని సామాజిక వ్యవస్థలోని భౌతికమైన లోటుపాట్లను ప్రస్ఫుటంగా, ప్రతిభావ్యుత్పత్తులతో చిత్రీకరించిన కవీశ్వరుడు బెన్ జాన్సన్—**Ben Jonson** అదేకాలంలో నివసించి **'Human Emotions and feelings, Nature'** ని గురించి రాసిన కవి **Shakespheare** మహాశయుడు

కాని ఈనాడు Ben Jonson తెరమరుగున పడి పోయాడు. షేక్స్పియర్ ఇంకా జీవించేఉన్నాడు. కారణం పైన చెప్పినదే. రాను, రాను మరీ పేల వంగా, నెత్తురులేకుండా తయారవుతుంది వచన కవిత్వం. నినాదాలకు, రాజకీయానికి అంకితమై పోతున్నట్లు కన్పిస్తుంది. ఈ జాడ్యం నేటి యువ రచయితలమీద బాగా ప్రసరిస్తున్నది. రాజకీయాన్ని గాని, సంఘాన్నిగాని, త్యజించమనికాదు దీని ఉద్దేశ్యం. కేవలం రాజకీయమే కవిత్వం అనుకుంటున్న అధో గతికి దిగజారకుండా ఉండాలన్నదే ఆశ.

ఒక అనుభవాన్నిగాని, అనుభూతినిగాని వ్యక్తీ కరించటానికి ఖండిక చాలా ఉపయోగపడుతుంది. దానియొక్క పరిధి తక్కువే. సమాజ స్థితిగతులను వర్ణించినా పరిమితంగానే. అదే ఒక ఇతివృత్తం ఎన్ను కుంటే విస్తృతపరిధిలో విపులంగా చెప్పటానికి అవ కాశముంటుంది. కథకికూడా జీవితంలో బలమైన సంఘటనే ఆధారభూతం. నవల సంఘటనల సంపుటి. హత్తుకొనేటట్లు ఒక సంఘటనను చెప్పటమే కథ యొక్క ముఖ్యోద్దేశం—లేదా ఆ సంఘటనద్వారానే వ్యక్తి జీవితాన్ని మొత్తం ప్రతిబింబింపచేస్తుంది ఛాయారూపంగా !

కావ్యంగాని, నవలగాని వేరు. వాటి కాన్వాస్ పెద్దది. అందుకని కథ రాసే రచయిత ఎక్కువ నేర్పు, జాగ్రత్త, ప్రతిభ చూపించి దాన్నొక కళా ఖండంగా తీర్చిదిద్దాలి. కర్ర తిరగటానికి మాత్రమే వీలున్న గదిలో ఒక వ్యక్తిని కర్రసాములో తనకున్న ప్రావీణ్యాన్ని చూపెట్టమనటం ఎలాంటిదో—కథరాసి గాని ప్రీవెర్స్ కథరాసిగాని మెప్పించటం అలాంటిది. విశాలమైన మైదానంలో కర్రసాములో తనకున్న ప్రావీణ్యం చూపటం లాంటిది నవల రాసిగాని,కావ్యం రాసిగాని ఒప్పించటం, రసహృదయాలూపటం.

పోతే ఈ సంపుటిలో మూడు కథలున్నాయి. మొదటిది అద్దాల గుహ. ఇందులో ఈనాటి నాగరి కతా ప్రపంచంలోకూడా, సంస్కారం పొంగి పొరలి పోతుంది అని అనుకుంటున్న ఈ రోజుల్లోకూడా స్త్రీల శీలసంరక్షణ లేకపోవటం సూచితం. సభ్యత, సంస్కారం, అనే ముసుగుల్లో కొందరు తడిగుడ్డల్తో గొంతునెలాకోస్తారో వ్యంజిత. ఇంత చేసినా వాళ్ళు పెద్దమనుషులే. సంఘంలో అగ్రాసనం వారిదే—ఇతివృత్తం ఇది. ఒకానొక మంత్రిగారి ఇంటి ముందు సెంట్రీ తాతబ్బాయి. ఒకనాటి కాళరాత్రి తాతబ్బాయి, డ్యూటీలో ఉన్నప్పుడు, ఒక యువతి, రోడ్డుమీద, చెట్ల కీనీడల్లో తోడేళ్లు తరుము తుండగా బెదురుతూ నడుస్తుంటుంది. ఆపదలో ఉందని తాతబ్బాయి గ్రహించాడు. రక్షించాలని నిర్ణ యించుకుంటాడు. తర్వాత ఆమెకు నమ్మకం కల్గి స్తాడు—తానూ ఒక తోడేలునుకాదని—ఆమెకథ వివరిస్తుంది. హైదరాబాదు కొత్తని, ఆమె బంధు వులతో 'ఎగ్జిబిషన్'కువెళ్లి జనసముద్రంలో తప్పి పోయిందని. బంధువుల ఇంటి అడ్రసు తెలియదు. ఓ గుర్తుమాత్రం చెబుతుంది అది ఓ పాత సినిమాహాలు, అందులో బి. సి. నాటి సినిమాలే ఆడతాయని. తాతబ్బాయి గ్రహిస్తాడు. అది అమీర్ పేటని. తన డ్యూటీ ఇంకొకరికి అప్పగించి, ఆమెను వెంటబెట్టుకువెళ్లి, ఇల్లు, ఆ గుర్తు ఆధారంతో వెదుకుతాడు. ఫలితం శూన్యం. విసిగివేసారి, దరి దాపులో 'స్త్రీల సదనం' ఒకటుంటే, అచట రక్షణ అర్థిస్తే—అక్కడా వీలుపడక, తిరిగి మంత్రిగారిం టికే చేరుకొంటారు. అంతకుముందే తాతబ్బాయి ఆలోచిస్తాడు, ఆమె కచటే ఆశ్రయం కల్పించాలని.

ఓ గది ఖాళీగాఉందికూడా! ప్రక్కగది తలు పులు కొడితే ఓ చిరపరిచితవ్యక్తి తలుపుతీస్తాడు. అతనెప్పుడూ ఆ మంత్రిగారింటిలోఉండే పక్షి. అతన్ని వేడుకుంటె, రెండోగదిలో పడుకోమని చెప్తాడు. తల మీద బరువుదించినట్లు ఫీలవుతాడు తాతబ్బాయి. ఆ రేయి హాయిగా నిదురిస్తాడు. తెల్లవారుతుంది. తెల్లవారుతూనే రాత్రి ఆశ్రయం ఇచ్చిన వ్యక్తి తాతబ్బాయిని నాలుగు దులుపుతాడు. ఉద్యోగం పీకేయిస్తానంటాడు. కారణం ఆమె పోతూపోతూ, అతని వాచీ, పర్సూ టేబులుమీదఉంటే పట్టుకువెళ్లి పోతుంది. ఎలాగో తాతబ్బాయి, ఆయన కాళ్లుగడ్డాలు పట్టుకుని సర్దుబాటుచేసుకుంటాడు. రెండోనాడు ఓ 'టీ స్టాల్'లో 'టీ' త్రాగుతూ, పేపరు తిరగే స్తుంటే—ఓ వార్త ఇతన్ని ఆకర్షిస్తుంది. అది

ఓ అమ్మాయి ఆత్మహత్య. హుసేన్‌సాగర్‌లో దూకి చస్తుంది. గుర్తుల్లో—ఆ అమ్మాయి ముఖంమీద మచ్చ ఉంది. లోగడ తాతబ్బాయి ఈ మచ్చని చూస్తాడు. అపుడే గ్రహిస్తాడు తాతబ్బాయి, ఇది ఆత్మహత్యకాదని హత్యేనని; కానీ పాపం! ఏంచేస్తాడు.

రెండోది : 'హృదయం దొరికింది.' ఇందులో రచయితే కథను చెప్పుకుంటూపోతాడు. రచయిత స్నేహితుడు పాణి ఓ స్కూల్లో టీచరు. వీళ్లిద్దరికి ఆప్తుడు, మిత్రుడు రాజు. చక్కగా పాడగలడు. వీరు ముగ్గురూ, మరో అరవైమందితో కలసి అజంతాయాత్రకు బయల్దేరుతారు. స్కూలుపిల్లలు, వాళ్లకితోడుగా టీచర్లు—వారి మిత్రులు—బంధువులు—మొత్తం అరవైమందిపైగా ఉంటారు. వీరి తొలిరాత్రి మజిలీ చిరాగ్‌పల్లి. సమితిస్కూల్లో పడక. స్కూలు ఊరికిదూరం. బయట చలి; అయినా వెన్నెలకురుస్తూ, అందానికి పందిరివేస్తూఉంటుంది. పట్నంవాసులు వెన్నెలకు ముఖంవాచిఉంటారుకదా! పాణి, రాజు, రచయిత వెన్నెలని మేద్దామని, కొంత దూరం నడచి, చెట్లమొదళ్లలో కూర్చుంటారు. రాజు అష్టపదులు, పిళ్లారిగీతాలు పాడుతుంటాడు. తర్వాత తిరిగి వస్తూఉంటారు. మధ్యలో రాజుకి ఓ గులాబిపువ్వు దొరుకుతుంది. అది తత్తిమ్మా ఇద్దరికీ చూపుతూ, హృదయం దొరికినంత ఆనందపడుతూ ఆ పూవు వాళ్ల గ్రూపుకిచెందిన ఎవరో అమ్మాయి సిగనుండి రాలినపూవే నంటాడు. పైగా అతని పాటలు వినటానికీ వచ్చిందంటాడు.

పల్లెపడతులు, బంతులు, చేమంతులుతప్ప, గులాబుల తురుమరని, ఖచ్చితంగా ఎవరన్నాగాని వారి గ్రూపుకు చెందిన అమ్మాయికే ఆ గులాబి అని నిర్ధారణ చేస్తాడు. నిజంకన్నా కల్పన చాలా అందమైంది. గొప్పవరంకదా. ఊహలో మనిషి హాయిగా జీవించగలడు. ఇక్కడే రచయిత మనతో నిజం చెబుతారు. ఆ గులాబి ఏ అమ్మాయి ధమ్మిల్లం నుండి జారలేదని, తనే, తన జేబులో అంతవరకూ ఉన్న గులాబిని గుచ్చుకొంటుంటే—పారేశానని చెబుతారు. కథ జరుగుతుంది. రెండోనాడు ప్రొద్దుటే రాజు ఓ అమ్మాయిని చూపిస్తూ ఆ అమ్మాయి సైన్సు టీచరు రమాదేవి చెల్లెలు—ఆ గులాబి ఈ అమ్మాయికి చెందిందేనంటాడు. కారణం ఆ అమ్మాయి ఒక జడలో ఒక గులాబి మాత్రమే ఉంటుంది. తర్వాత అజంతాకి పోతారు. ఆ అమూల్య కళాఖండాల్లో పాణి, రచయిత మునిగిపోతారు. రాజు జాడ ఉండదు. చివరికి అతని సంగీతం మాత్రం విన్పిస్తుంది. గీతలహరితోపాటు రాజు, రాజువెంట రమాదేవి చెల్లెలు వస్తారు. కథ ముగుస్తుంది.

మూడోది అద్దెగది. ఎమ్మెస్సీ టెక్నాలజీలో ప్యాసయిన రవి ఇందులో కథానాయకుడు. రసదృష్టి గలవాడు. లియొనార్డో డావెన్సీ, దామెర్ల రామారావు అంటే ఇష్టం. పూలకుండీలలో కళాఖండాల్ని చూడగల రసమనస్వి. అక్కడే చూసింది వందన అనే అమ్మాయి అతన్ని. ఆమెకూడా ఇంటర్వ్యూకే వస్తుంది. కేవలం హాబీకోసం ఉద్యోగం చేయాలన్న కోరికే కాని విధిగా మాత్రం కాదు. ప్రవాసాంధ్ర కుటుంబీకులమ్మాయి. ఎలిఫేంటా గుహల్ని చూట్టానికి వెళ్లేటప్పుడు మళ్లా తారసపడుతుంది రవికి! లాంచీలో ఆమె సౌందర్యాన్ని చూసి ముగ్ధుడౌతాడు. కాని బిడియస్థుడు. చొరవ చేయలేడు. ఆమెమాత్రం చాలా కలుపుగోలు మనిషి. చొరవచేసి స్నేహం కలుపుతుంది. ఆమెకు రవి ఎలిఫెంటా గుహల్లో కళా రహస్యాల్ని గురించి వివరిస్తాడు. తిరిగి వచ్చిన తర్వాత ఇద్దరు కలసి కాఫీ త్రాగుతారు. విడిపోదామనుకుంటుండగానే వందన రవిని మరునాడు, తన రూమ్‌కి రమ్మని ఆహ్వానిస్తుంది. ఇద్దరు కలసి సిటీ అంతా చూడవచ్చని ఆమె అభిప్రాయం.

మరునాడు ఇద్దరూ చూడాల్సిన ప్రదేశాలన్నీ చూశాక వందన, రవి సెలక్షన్‌తో రెండు చీరలు కొంటుంది. ఆ సాయంత్రమే ఆమె ప్రయాణం. వీడ్కోలు ఇవ్వమని అభ్యర్థిస్తుంది. రవి కూడా తన రూమ్ ఖాళీచేసి, తన ప్రయాణం కూడా ఆ సాయంత్రం ఏర్పాటుచేసుకుంటాడు. టాక్సీలో ఇద్దరూ స్టేషనుకు వస్తారు. దారిలో తన అడ్రసు రాసిఇచ్చి, లెటర్స్ రాయమని ప్రార్థిస్తాడు. స్టేషను చేరారు. రైలొస్తుంది ఆమె ఎక్కికూర్చుంటుంది. మెల్లగా రైలు కదుల్తుంది. రవికి సడన్‌గా జ్ఞాపకం వస్తుంది. తను ఇచ్చిన అడ్రసు త్వరలో మారబోతుందని. అందుకని ఆమెని పూర్వం తను రాసిఇచ్చిన అడ్రసుకాగితం ఇమ్మంటాడు. ఆమె బ్యాగ్‌అంతా వెతుకుతుంది. చీటి దొరకదు—పోనీలెమ్మని, ప్లాట్‌ఫారమ్‌మీద ఖాళీసిగరెట్ పెట్టె డొక్కమీద మళ్లా తన కొత్తఅడ్రసు రాసిఇస్తాడు - ఆమెకూడా తర్వాత తన అడ్రసు ఇస్తానంటుంది—రైలువేగం పుంజుకుంటుంది. వందన కూర్చున్న కిటికీవద్దనుండి పసుపురంగుకాగితం ముక్కలు గాలిలో ఎగురుతూవచ్చి రవిని పలకరిస్తాయి. ఇదీ కథ.

స్థూలంగా ఇవి మూడింటియొక్క కథావస్తువులు. శ్రీ వీరాజుగారు కథకులు—నవలాకారులు. పైగా చిత్రకారులు. కవి.ఇప్పుడు కలంపట్టి ప్రీవెర్స్‌లో కథాకావ్యాలు రాస్తున్నారు. ముఖ్యంగా ఈ మూడు కథలను పరిశీలించినప్పుడు—మనసుకు తగిలేవి ఇవి. దేనిలోనూ బలమైన కథావస్తువులేదు. హృదయానికి హత్తుకునే సంఘటనలమీద ఈ కథలు ఆధారపడ్డాయాఅన్నది అనుమానం. మూడు కథల్లోనూ మూడు సంఘటనలే ఆధారమైనాయి. కాని మనసులో మిగిలే కథలుకావు ఈ మూడున్నూ.

మొదటి కథలో తాతబ్బాయి తెలిసి, తెలిసి, తీసుకొచ్చి ఆమెని పెద్దపులి నోటి కందిస్తాడు. ఎన్ని హోటళ్లు లేవు? ఆ అమ్మాయికి ఇవ్వబడింది ఆ ఖూనీకోరు ప్రక్కగది మాత్రమే. ఈ విషయం రచయితే చెప్తారు. అలాంటి పరిస్థితుల్లో ఆమె వెళ్ళిపోతూ అతని వాచీ, పర్సు ఎలా పట్టుకువెడుతుంది? వాడు చెప్పినా తాతబ్బాయి నమ్మటానికి ఆస్కారమేముంది? సవతితల్లి పోరు భరించలేక, ప్రాణానికి ముప్పు వస్తుందని తెలిసి, హైద్రాబాదు ధైర్యంతో పారిపోయి వచ్చిన ఆ అమ్మాయి, అడ్రసుపోసి లొకాలిటీపేరు అంతత్వరగా ఎలా మరిచిపోగల్గింది? పైకి పెద్దమనుషులుగా చలామణి అవుతూ లోలోపల ఎంత అఘాయిత్యాలు చేస్తారో కొందరు, సంస్కృతికి పుట్టినిల్లని గప్పాలు కొట్టుకునే మనదేశంలో ఆడది ఎలా బతకలేక, శీలం తర్వాత ప్రాణం సైతం కోల్పోయిందో చూపించదలచి ఈ కథ అల్లారు, అల్లికలో జిగిలేదు. కథ ముగించిన తర్వాత మనల్ని ఊపదు. మనసుమీద ముద్రవేయదు.

రెండోది 'హృదయం దొరికింది'లో ప్రతి మానవుడు నిజంగా ఊహాజీవి. గాలిమేడలు కడతాడు ఆదారం దొరికితే చాలు— అన్నవిషయాన్ని రాజుద్వారా చెప్పించినట్లైతే బాగుండేది. కాని చివరిలో కథను పొడిగించి రసహీనం చేశారు. కారణం కథ. రచయిత ఆ పూవు నాదే, నేనేపారేశాను అని చెప్పటంతో ఆగినట్లైతే కథలో బిగువు—జవం హెచ్చేవి—రాజు మీద మనకు సానుభూతి మిగిలేది. పొడిగించి రమాదేవి చెల్లెల్ని జంటచేసేటప్పటికి—కథా ఉద్దేశ్యమే దెబ్బతిన్నది. ఈ కథద్వారా రచయిత మనకు చెప్పిందేమిటి అన్నది ప్రశ్నగా మిగుల్తుంది. గులాబి రహస్యం వివరించటంలో కథ ముగిసిన చాలా పట్టుగా మంచికథ తయారయ్యేది. కథ, సుఖాంతమా, దుఃఖాంతమా అన్నది ముఖ్యంకాదు. ఎలా, ఎంతవరకు పాఠకుని ఆకట్టుకున్నది, అతని మనఃఫలకంపై చెరగనిముద్ర వేసిందా లేదా అన్నదే ముఖ్యం—ఈ కథకి పటుతరమైన ఘటనే ఆధారం. గులాబి దొరికితే ఎవ్వడుమాత్రం ఊహ చేయడు. చేసినా మధురోహ చస్తాడేతప్ప—చచ్చుగా ఊహించడుకదా!

మూడో కథలో వందనని హిపాక్రైట్‌గా చిత్రించారు. పబ్బం గడుపుకునిపోతారు అవతలకిఅనే రకం వందన. లేదా రైలుప్రయాణం పరిచయాలు సినిమాహాలు స్నేహాలు అద్దెగదిలాంటివే అన్న సత్యం

వ్యక్తీకరించటానికి, తద్వారా 'రవి'లాంటి వారికి హితోపదేశం. ఈ కథ ముగింపులోవచ్చిన ఔచిత్యం, పట్టు, 'హృదయం దొరికింది'లో కొరవడ్డాయి. ఇలాంటి మలుపే—'కొడిగట్టిన సూర్యుడు' సంపుటంలోని—'విశ్వాసం నీడ కింద'అన్న మంచికథలో ఉంది. అదొక అమూల్యమైన ప్రీవెర్స్‌కథ. వస్తువు, దానియొక్క నిర్వహణ సంబంధించినంతవరకు మూడు కథల్లోనూ 'అద్దెగది'దే అగ్రతాంబూలం. మూడు కథలు సాఫీగా సాగిపోతాయి. నూతనత్వం గోచరించదు. మూడు కథలు చదివి ముగించినతర్వాత, ముఖ్యంగా మనకు గుర్తుండేవి శ్రీ వీరాజుగారి వర్ణనలే—పదచిత్రాలే! రాత్రిని వర్ణిస్తూ...

'రాత్రి
ఆకాశం పడమటికొస తగలడిరాలిన మసి
మసిమసిగా
నగరంనిండా భయంకరంగా
రాత్రి.
మంటలు కక్కిన పొగలు
నగరంమీద మేఘాలై పేలాడి
చివరికి, చీకటి చినుకులుగా రాలుతున్న
రాత్రి.'

మరొకచోట సంగీతాన్ని వర్ణిస్తూ—

'అసలే సంగీతం నాజూకైన పూలతీగ
అష్టపదుల్లో సంగీతం
మరీ మృదువుగా సాగి చుట్టుకున్న వలపు తీగ'

'కొడిగట్టిన సూర్యుడి'లో నర్సు కృష్ణవేణిని వర్ణిస్తూ.

'అగరుపత్తి జీవితం కాదామెది
కాలినా సువాసనలు వదలడానికి
కొవ్వొత్తి జీవితమూ కాదు,
తరిగినా వెలుగు వెదజల్లడానికి
ఎండిన కట్టయినా కాదు,
వెచ్చని మంటల్తో చలిని కప్పడానికి,
తడిసిన పచ్చిపెడకలాంటి
పొగచూరే జీవితం ఆమెది'

అని అంటారు.

ఇలాంటి వర్ణనలు—రెండు సంపుటాల్లోనూ కన్పిస్తాయి. కాని కొన్ని కొన్ని చోట్ల అనవసరంగా వర్ణనలు సాగదీయబడి, సొవత్వం చెడగొట్టబడింది. మజ్జిగ పల్చబడ్డట్టు—కొత్త, కొత్త పదబంధాల్ని ఆయన సృష్టించారు. ఉదా: 'భయం బురద' 'ఒద్దకపు సాయంకాలం' 'ఆశవెట్లు' ఇలాంటివి ఎన్నో.

ఒక చోట అంటారు.

'ఆమె ముఖంమీద విసుగుపంకాలా తిరుగుతోంది' అని.

కరెక్టుగా పన్నెండు గంటలవుతుంది. చిన్న ముల్లుమీద, పెద్దముల్లు—ఒక చోటే ఉన్నాయి. ఇది మామూలు—చాలాసామాన్యమైనమైన విషయం. కాని వీరాజుగారు ఈ అతిసామాన్యమైన సాదా విషయాన్నే ఎలా వర్ణించారో చూడండి. 'ముళ్లరెమ్మ'లో

'సన్నగా పొడుగ్గావున్న పురుషుడు మెల్లగా కదలి
మత్తుగా నిద్రకళ్లతో జోగుతున్న
అంతపొడుగులేని పొట్టిఆడమనిషిమీద వాలి
బలంగా కావిలించుకుని
ఊపిరిని గొంతుకొసలో బిగించి
ఒక్కఅదటున పన్నెండుసార్లు ముద్దిడి
అంతలో లోకాన్నిచూసి సిగ్గుపడి
గబగబా తొలగి వెళ్లిపోయాడు.'

ఇంత మంచిదృశ్యాల్ని మన కళ్లముందు నిలుపగల్గిన వీరాజుగారు, అపుడప్పుడు నీరసంగా వర్ణనల్ని సాగదీసి ఉత్సాహాన్ని చంపేస్తారు. మూడు కథలు చాలా సింబాలిక్‌గా కథాంతాల్ని సూచించే వర్ణనల్తో మొదలవుతాయి. కథాకథనంలో కొత్తదనం కొరవడింది. నాటకీయత అంతగాలేదు. ముఖ్యంగా శ్రీ వీరాజుగారిలోని చిత్రకారుడు ముందుకొచ్చి కథకుణ్ణి పీక నొక్కేస్తాడు. కథలు చదువుతున్నప్పుడు, వర్ణనలు కథాగమనానికి దోహదం చేయాలే తప్ప ప్రతిబంధకం కారాదు. ఒక్కొక్కచోట రంగులు అధికంగా గుమ్మరించటం జరిగింది. వర్ణన తగిన మోతాదులోఉంటే అదొక అలంకారం. అధికమైతే విసుగు చోటు చేసుకుంటుంది. సామాన్యపాఠకుడు వివరించి చెప్పలేకపోవచ్చు. కాని, గ్రహించగలడు—ఎక్కడ కవిత్వం కరగి వచనం మిగులుతుందో—ఈ కథల్లో చాలాచోట్ల అదే జరిగింది. అందుకే 'బ్రెవిటీ'

చాలా ముఖ్యం. నిజానికి కావలసినదానికంటే ఎక్కువగా, ఎక్కువ పేజీలు ఈ కథలు ఆక్రమించాయి. కథలోగాని, కవిత్వంలోగాని 'ధ్వని' చాలా ప్రధాన పాత్ర వహిస్తుంది. సూచించబడాల్సింది వాచ్యమైతే, పాయసం త్రాగేటప్పుడు కొలమారినట్లు—

'సామాన్యునికి, కథానాయక గౌరవం కల్పించటం ఆధునిక కవితా సంప్రదాయమైనా, ఎంత సామాన్యుడైనా అతనిలో ఏదో ఒక విశిష్టగుణం భాసించనిదే, ఆ పాత్ర రాణించదు' అన్నారు కుందుర్తిగారు కొడిగట్టిన సూర్యునికి పరిచయ వాక్యాలురాస్తూ—ఈ వాక్యం వీరరాజుగారి కథలకి వర్తిస్తుందా అన్నది సందేహం. నాయకీ నాయకులు సామాన్యులే—విశిష్ట గుణాల మాటేమిటి?

'కొడిగట్టిన సూర్యుడు' సంపుటిలోని కథల్లో ఉన్న కథాబలంగాని, కవితావైభవంగాని నాటకీయత గాని—వర్ణనౌచిత్యంగాని 'హృదయం దొరికింది' సంపుటిలోలేవు. తన్మయీభావం నింపే కథాకావ్యం 'విశ్వాసం క్రిందకింద' అలాంటికథ, ఇందులో లేదు.

ఫ్రీవెర్స్‌కథలని పేరుపెట్టకపోయినా మంచి ఫ్రీవెర్స్‌కథలు రాసిన గౌరవం రా. వి. శాస్త్రిగారికీ దక్కుతుంది. అయినా కుందుర్తిగారన్నట్లు రాజుగారిది సమగ్రమైన ప్రయత్నం—పేరెన్నికగన్న కవులు ఈ జోలికి పోకపోయినా, ధైర్యంతో సాహసోత్సాహాలతో ఈ ప్రక్రియను చేపట్టి జయప్రదంగా నడిపించగల్గిన ఘనత రాజుగారిదే; వారి రెండు సంపుటాల్లోనూ వారిదైన ముద్ర వారు సృష్టించారు. ఈనాడు ఈ ప్రక్రియలో రాజుగారి అడుగుజాడల్లో కొంత మంది యువకవులు నడుస్తున్నారు. ముమ్మందు పటుత్వంగల కథతో, వర్ణనలు తగురీతిలోవాడి, ఔచిత్యం పాటించి, మంచి ఫ్రీవెర్స్‌కథలు రాయగలరని ఆశించవచ్చు.

—కె. శివారెడ్డి.

## స మ త

(న వ ల)

(రచన : వాసిరెడ్డి సీతాదేవి; యం. శేషాచలం అండ్ కంపెనీ; మద్రాసు—మచిలీపట్నం—సికింద్రాబాదు; వెల—రెండు రూపాయలు. పేజీలు 264.)

నాగరికతా వ్యామోహంలోపడి వ్యక్తులు తమ పరిసరాలను, పరిధులను మరచిపోయి ప్రవర్తిస్తున్నారు. కాలగతిలో వస్తున్న మార్పులను విచక్షణ లేకుండా అనుసరించటంచేత వికాసంకంటె వినాశనం అధికంగా కానవస్తున్నది. వికాసంలేని జీవితం పరమార్థాన్ని సాధింపలేక జీవిత పర్యంతం అనుక్షణం అడకత్తెరలో నలిగిపోతుంది. విజ్ఞానం పెరుగుతున్నదికాని మనిషి పెరగటం లేదు. మేధస్సు పెరుగుతోంది కాని మనస్సు పెరగటం లేదు. నాగరికత పెరుగుతోంది కాని సంస్కారం పెరగటం లేదు. జీవిత దృక్పథంలో చెప్పుకోదగిన మార్పులు లేవు. గనుకనే సామాజిక చైతన్యం పేరిట జాతి జీవితం యావత్తు జీర్ణవస్త్రంలా తయారవుతున్నది. మంచి మంచియని దానిముందు తలవంచిన చివరకా మంచి చెడుగా జీవం పోసికొన్న వ్యక్తుల మధ్య కార్పణ్యాలు చెలరేగిస్తున్నది. పొందికలేని జీవన విధానంలో 'సమత' కావాలని కోరినను రాదు. పరస్పర అవగాహనశక్తి జీవమున్న వ్యక్తులలో ఉంటే సమతలేదని బాధపడ నవసరంలేదు. తనను తానే దర్శించుకొని మురిసిపోయి ఆ మురిపంలో అన్నీ మరచి అహంకారంతో ప్రతివిషయాన్ని తూలనాడితే పలువురి నిందలుతప్ప ఆశీస్సులు చేకూరవు. ఈ విషయం వాసిరెడ్డి సీతాదేవి 'సమత'లో అరుంధతికి యథార్థంగా రుజువైంది. ఆమె కష్టాలనుండి విముక్తిచెంది సుఖప్రపంచంలో అడుగుపెట్టేసరికి క్రొత్తదనం కల్పించి ఆశలు పుటించుకొని విశృంఖలత్వాన్ని నేర్చుకొన్నది. భర్తయందు గౌరవమున్నను భక్తిపూర్వకంగా వ్యక్తంచేయలేక అసందర్భంగా అనుమానాలు సృషించుకొని అలజడికి, ఆందోళనకు గురియై అనూహ్యమైన ఘటనలకు మార్గం నిర్మించుకొని స్వేచ్ఛగా పయనించాలని పంతంపట్టి అయిన వారికి కాని వారికి దూరమై ప్రాణాన్ని తృణప్రాయంగా వదలివేసింది. సాధించినదని మనసులో భావించినా క్రియాత్మకమైన సాధన ఏదీ చేయలేదు. అందని ఆశలకు అఱ్ఱులు సాచి ఆనందం పోగొట్టుకొని అందరిచేత ఛీ యనిపించుకొన్నది. స్త్రీకి స్వాతంత్ర్యం కావాలని పెద్దలందరూ కోరితెచ్చుకొని ఆమెను పంజరంనుండి

బయటకు విడిపిస్తే విషవాయువులు ఒకదానివెంట మరియొకటి తరుముకొంటూ వచ్చాయి. స్వేచ్ఛ వెర్రి ఆలోచనలకు స్థానమిచ్చి శీలాన్ని పాడుచేసింది. స్వేచ్ఛ ఉన్నది గదా అని క్రమంగా వినియోగించుకొన లేక దాని రూపురేఖలు తుడిచివేసి సమాజం గుండెలపై నాట్యం చేసింది. మైమరపులో కాలు విరిగింది. గత జీవితం వైపుకు నడక సాగించినా జీవితధ్యేయాన్ని చేరుకొనలేక అసంతృప్తితో భౌతిక ప్రపంచ సమస్యలను త్రెంచుకొన్నది ఆశయం నెరవేరకనే.

శాంతమ్మ కష్టాలనుండి బయటకువచ్చింది. సాధ్యమైనంతవరకు అట్టి బాధలు రాకుండా చూచుకోవాలని ప్రయత్నించినా కుదరలేదు. తన కుమారుడు తనను ఉద్ధరించి మాతృదేవత ఋణాన్ని తీర్చుకొంటాడని కలలు కన్నది. కల నిజమైంది. కోడలు కావాలని కోరుకొని ఏమీ ఆస్తిపాస్తులులేని పిల్లను తెచ్చుకొన్నది. వారిద్దరిని చూచుకొని సంతోషించింది. అత్త అధికారాన్ని చూపింపకపోయినా కోడలుమాత్రం అధికారం చెలాయించుటకు పూనుకొన్నది. శాంతమ్మకులేని అధికారవ్యామోహం అరుంధతిలో ప్రవేశించి ఉన్న పరిస్థితులకు సరిక్రొత్త వ్యాఖ్యానాలు చేయుట ప్రారంభించింది. వ్యాఖ్యలు విమర్శలు పట్టించుకోక యింటిని చక్కబెట్టుకోవాలని ఎవ్వరినీ ఏమీఅనక తన విధిని తాను నిర్వహించుటకు పూనిన భర్తపై అరుంధతి తిరుగుబాటుచేసి వేర్పాటు ధోరణిని చూపింది. అరుంధతి గత జీవితాన్ని పర్యావలోకనం . చేసికొనక ఆ యింటిలో నియంతగా పెత్తనం చెయ్యాలనిపించింది. పిచ్చిఊహలతో మనసు పాడుచేసికొని గౌరవమర్యాదలు లేకుండా అందరిపైన ఆవేశాన్ని చూపింది. గుప్తంగా సంసారాన్ని పైకితీసికొనిరావాలను వాంఛను అరుంధతి తిరస్కరించినా శాంతమ్మ ఆమెతోనే రాజీపడి నీ యిష్టమని ఊరుకొన్నది. ఈ రెండు పాత్రల మనస్తత్వాన్ని సీతాదేవిగారు నేటి పరిస్థితుల కనుగుణంగానే వివరించారు. పల్లెలో లేదని పట్టణంవైపుకు మనసు మరలిస్తే వ్యక్తుల జీవితం పూజ్యంగాక దూషితమగుటకు వీలు కలుగుతుంది. చరిత్ర హీనత్వంకూడ అక్కడే ప్రాప్తిస్తుందని రచయిత్రి దృఢవిశ్వాసం. అరుంధతికి

వచ్చిన కళంకం తరతరాలవరకు ఆ యింటినే పీడిస్తుందన్నమాట యథార్థం. తల్లి చేసిన తప్పుకు బిడ్డలు శిక్ష అనుభవిస్తారు సామాన్యంగా. కాని యిందులో అరుంధతి అనుకొనిచేసిన పొరపాటు కుమార్తె చేసింది. పశ్చాత్తాపం లేకుండగనే శాశ్వతంగా ప్రాయశ్చిత్తం గావించుకొన్నది. చేసిన నేరానికి పరిష్కారం రచయిత్రి ఆమోదయోగ్యంగా చేయలేదు. తప్పుచేసిన వ్యక్తి మరణిస్తే ఆ వ్యక్తి భావిజీవితం నాశనం అవుతుంది. బ్రతికివుండగానే తననుతాను తెలిసికొని ప్రవర్తించినట్లు ఆ పాత్రను తీర్చిదిద్దితే పాత్రకు గాంభీర్యం ఏర్పడివుండేది. ఇట్టి అవకాశం కల్పింపక ఒక్కసారే ప్రాణాలు పోగొట్టి దుఃఖింపచేయుట సన్నివేశానికి సహజత్వమబ్బి నా పాఠకుల ఊహకు వ్యతిరేకంగా ఉన్నది. ఎందుకోగాని చాలమంది రచయిత్రులు స్త్రీ పాత్రలను ప్రాణంతీసి నానావిధాలుగా ఆ పాత్ర చుట్టూ వలయాలు సృష్టిస్తారు అర్థంగాని ఆవేశంతో.

సీతాపతి—రాజారావు ప్రాణ స్నేహితులే. అరుంధతికి సీతాపతిలోలేని ఆప్యాయత రాజారావులో చూచి వలచింది. అభిమానం అడ్డువచ్చి అంతర్గతంగా అగ్నిపర్వతాలు బ్రద్దలయ్యాయి. వీటికి తట్టుకోలేక రాజారావును వెంటనే యింటినుండి పంపమన్నది. ఎవ్వరూ ఆమె మాటను వినిపించుకోక ఆమెనే దూషించారు. మంచికోసం పోతే చెడు ఎదురైంది. మూఢంగా నమ్మిన సిద్ధాంతం పోనుపోను అదే జీవితానికి కంటక ప్రాయమవుతుంది. రాజారావు అరుంధతిపై అభిమానం చూపాడు. వాస్తవాని కది అభిమానంకాదు. ఏ విధంగానైనా అరుంధతి తన భార్య కావాలని వికృతంగా ఆలోచించుకున్నాడు. ఒకరి భార్యను మరొకరు కోరుట ఒకరి ప్రాణాని మరి యొకరు కోరుటవంటి తుచ్ఛపుకోరికలు అతనిలో ఉద్భవించటంతో ప్రశాంతంగా సాగిపోయే శాంతమ్మ సంసారం కుమిలిపోయి కూలిపోవుటకు సిద్ధంగాఉన్నది. అరుంధతి తన అసమర్థతను తెలియజెప్పినా తల్లీ కొడుకులు అర్థం చేసికొనలేకపోయారు. రాజారావు రాజీనామాపడలేని జీవితకోసం ఆరాటపడ్డాడు. రాజ

కీయ చైతన్యం అనే పేరుతో సామాజిక చైతన్యాన్ని భగ్నం చేసికొని ప్రభుత్వానికి ఏజంటుగావుండి పెద్దలనుండి డబ్బు గుంజాడు. సభల్లో సాంఘిక చైతన్యం, రాజకీయ చైతన్యం కావాలి అని ఉపన్యాసాలు చెప్పినా అది తరువాత మోసానికి నిలయమైంది. ప్రీతిగా పలుకరించగానే అరుంధతి అతనిపై అభిమానం పెంచుకొని యింటినుంచి తప్పించుకొన్నది. భ్రమలు కల్పించే ఆశలకు అరుంధతి బలియైపోయింది. అటు సీతాపతికి యిటు రాజారావుకు గాకుండా ప్రమోద్దైన జీవితాన్ని అనుభవిస్తున్నది. బంగాళాలు, కారులు, తోటలు, పరివారం, వందిమాగధు లున్నారని పూర్తిగా సంతోషింపలేక జరిగిన పరిస్థితినిచూచి విస్తుపోయింది.

రాజారావు చైతన్యం శిలారూపం. అరుంధతి తోలుబొమ్మ. సీతాపతి జీవంలేని మనిషి. శాంతమ్మ సజీవ ప్రతిమ. కూలిపోతున్న సంసారాన్ని నిలబెట్టాలని శాంతమ్మ సీతాపతి ముందుకువస్తే అరుంధతి రాజారావు వారి మార్గానికి అవరోధాలు కల్పించి సంసారాన్ని ఛేదించారు. రాజారావు శాంతమ్మ చూపిన మమతను ముక్కలు చేసాడు. సీతాపతికి మిత్రద్రోహం తలపెట్టాడు. అరుంధతి అందరికి తీరని వ్యథ కల్పించింది. అందరికంటె శాంతమ్మ ఆ యింటి పరిస్థితులకు తలవంచలేక, తెలియజెప్పలేక యాంత్రిక జీవిత గమనాన్ని సంతోషంతో ముందుకు సాగింపలేక ఆ నాలుగుగోడలమధ్య బంధించుకొన్నది. చేతులారా ఆ యింటి సౌఖ్యాన్ని శాంతమ్మ రూపుమాపిందనే మాట యితరులు అనకముందే ఈ లోకంనుండి వెళ్ళింది. తన ఆశయాలముందు ఓడిపోయింది.

సమాజంలో పిడపురుగుల్లాంటి వ్యక్తులు నశించినపుడు, దుర్మార్గులు విశ్వాసఘాతకులు కూలినపుడు ప్రజావాహినిస్థితి మరియొకవిధంగా ఉంటుంది. వ్యక్తులు అసూయలేకుండా రాగద్వేషాల కతీతమై ఉన్నప్పుడు సమతా దృక్పథం వస్తుంది. క్రొత్తసంతతి ఈ భువిపై అవతరించినపుడు ప్రాతసంతతి మాయమైనపుడు తప్పక సమత ఏర్పడుతుంది. ఎదుటి వ్యక్తిని మన్నించి గౌరవించి అర్థంచేసికొన్నప్పుడు ఆత్మహత్యలు, విమర్శలు రావుగనుక సమాజంలో నూతన ధర్మాలు వచ్చుట కవకాశం కలుగుతుంది.

రచయిత్రి ఆశించే సమత సుదూరంలో లేదని మనవి చేస్తున్నాను సమత లేనప్పుడు దేశంయొక్క పరిస్థితి గమనింపలేము.

వాసిరెడ్డి సీతాదేవిగారు కథలు వ్రాసి మంచిపేరు సంపాదించినట్లుగానే 'సమత' నవలారచనతో దానిని ఇంకా పెంచుకొన్నారు.

రచన బాగానే ఉన్నది. విషయం సూటిగా ఉన్నది. ఆశయప్రతిపాదనలో సాహసం వ్యక్తమవుతున్నది. ఇట్టి రచనలు రచయిత్రి యింకా చేయాలి.

—రామమోహన్.

---

Printed and Published For Nageswara Rao Estates (Private) Ltd., by S Nageswara Rao at the Andhra Patrika Press, 6 & 7 Thambu chetty Street, Madras-1. Editor : S. Sambhu Prasad.